# లోకోక్తి.



శ్లో॥ ధర్మాదివక్తా బుధసాంప్రదాయ
పారంగతో లౌకికవైదికజ్ఞః ।
విశుద్ధవాక్సంశయవర్జితాత్మా
పరేంగితజ్ఞోర్థకృతీ భవేద్యః ॥

ప్రాచీన సాంప్రదాయములను పూర్తిగా తెలిసియున్నవాడును, లోక వ్యవహారానుకూల ప్రవర్తన కలవాడును, వైదిక ధర్మపరిచితి కలవాడును, వాక్శుద్ధిగలవాడును, అనుమాన రహితుడును, ఎదుటివారి అభిప్రాయమును కనిపెట్టగలవాడును, కార్యసంధాన చాతుర్యముకలవాడును, ధర్మనిర్ధారణ చేయుటకు తగినవాడు.

శ్లో॥ సస్యాధికే యథా క్షామః భిషగ్వృద్ధౌ రుజో యథా ।
కర్మకార్శ్యం బుధాధిక్యే వర్ధతేసౌ విధిః కలేః ॥

పంట లధికమైనకొలది కరువును, వైద్యులెక్కువైన కొలది వ్యాధులును పెంపొందుచున్నట్లే పండితులు ఎక్కువైనకొలది స్మార్త శ్రౌతాదికర్మలయొక్క సంకోచమును, సాంకర్యమును పెంపొందుచున్నవి. ఇది కలిపురుషునియొక్క విధాయకకృత్యము అని ఊహింపవలసియున్నది.

శ్రీః

శ్లో॥ ఆంధ్రదేశే భీమఖండే వైనతేయీనదీతటే ।
పాశర్లపూడిలంకేతి నామ గ్రామః ప్రవర్తతే ॥

ఆంధ్రదేశమున గల భీమఖండమునంద వైనతేయీనదీతీరమున పాశర్లపూడిలంక అ గ్రామము కలదు.

శ్లో॥ తత్రాసీ త్పెదమల్లువంశతిలక శ్శ్రీబాపిరాజాహ్వయ
ప్రఖ్యాతామితసద్గుణౌఘరుచిరస్సద్వైశ్యచూడామణిః
తత్ప్రాంతేష్వఖిలేషు తారకచయే రాకాశశాంకో య
చారామాంతర పుల్లపుష్పసురభిశ్శాఖీవ రాజతే ॥

ఆపాశర్లపూడిలంకగ్రామమునందు పె మల్లు గృహనామకుడును, సద్గుణ సంపన్నుడున వైశ్యచూడామణియు అగు బాపిరాజు అనువ్య ఆప్రాంతమందు నక్షత్రములలో చంద్రుడువలెన ఉద్యానవనమధ్యమున నలుదిశలను వికసించి ప మళించుచున్న పువ్వులుగల వృక్షమువలెను ప్రక శించుచుండెను.

శ్లో॥ గాత్రస్యాస్య బహిశ్శుద్ధిః సర్వతీర్థావగాహనాత్ ।
సంప్రాప్తాంత శ్శుచి స్సర్వక్షేత్రదేవోపసేవనాత్ ॥

సమస్తపుణ్యతీర్థములయందును స్నాత

డగుటవలన ఇతని శరీరముయొక్క బహిశ్శుద్ధియు, సమస్త పుణ్యక్షేత్రములయందును గల దేవతలను సేవించుటచే అంతఃకరణశుద్ధియు సంప్రాప్తమైనవి.

శ్లో॥ శ్రీశైలస్థితవైశ్యసత్రజఠరే యాత్రికసౌఖ్యం ప్రతి
హృద్యం చోపగృహం ప్రకల్పితమథో ద్దేవాలయా
ధీశ్వరైః।
ఏకేష్వంకవిరాజమానవదనం విద్యుత్ప్రభాద్యన్వితం
రూప్యం షష్ఠిశతం సమర్ప్య సహసా భాతి స్వజన్మ
శ్రియై॥

తన భవిష్యజ్జన్మోద్ధరణార్థమై రు 6000 ఆరువేల రూపాయలను సమర్పించి యాత్రికుల సుఖము కొరకు శ్రీశైల నగరమునగల వైశ్యసత్రమధ్యమున విద్యుద్దీపాదిసౌకర్యములతో కూడిన మనోహరముగా ప్రకాశించుచున్న నెం 51రు గది దేవాలయాధికారవర్గముద్వారా నిర్మింపజేయబడినది.

శ్లో॥ ప్రత్యబ్దాగతకార్తికేపి చ తదా ప్రత్యేకత స్స్వామినః
పూజాస్నాపనసత్రభోజనవిధౌ యద్వాంకసంఖ్యాయుతమ్
దత్తం రూప్యశతం తదాగతకుశీదాదన్యవిత్తం వినా
తత్కాలా త్ప్రతికార్తికే శతిదినే నిర్వర్త్యతే తద్విధిః॥

పదకొండువందల పదహారు రూపాయలు

మూలధనముగా ఏర్పరచి దానిపై ప్రతి సంవత్స
రము వచ్చెడు వడ్డీ ఆదాయముతో ప్రతికార్తి
మాసమందును ఏదో ఒకరోజున ఇతర ద్రవ్యా
పేక్ష లేకుండ ఇతని గోత్రనామములతో శ్రీభ్రమ
రాంబామల్లికార్జున మహాలింగములకు పూజా
స్నానములు, సత్రిభోజనములు జరుగునట్లు నిర్ణ
యించబడినది. అది మొదలు ఆప్రకారము
జరుగుచున్నది.

శ్లో॥ శ్రీశైలశృంగేక్షణమైవ నౄణాం
భూయో న జన్మేతి పురాణసిద్ధం ।
శృంగం నిరీక్ష్య ప్రతికార్తికేపి
తత్పూజకానాం ఫలితం పునః కిమ్ ॥

శ్రీశైలశిఖరమును చూచినంతమాత్రము
చేతనే దేవతాజన్మయే; తిరిగి మానవజన్మకలుగదు.
ఇట్లని స్థలపురాణము ప్రకటించుచున్నది.
శృంగమును జూచి ఈశ్వరప్రీతికరమయిన ప్రతి
కార్తికమాసమందును ద్వాదశ జ్యోతిర్లింగము
లోనిదగు మల్లికార్జునలింగమునకు పూజను జరి
పించువారికి ఫలిత మెంతకలదో చెప్పనలవికాదు.

శ్లో॥ ఆబాల్యాదపి ధర్మమార్గపథిక శ్చాద్వైతవిద్యాధరః ।
తారుణ్యేపి హృషీకనిగ్రహపటు ర్నిర్మత్సరః కేష్వపి
సర్వేష్వాదరణాభిమానహృదయస్సత్సంగతో లాలసః
క్షేత్రారామపశుప్రసాదసుహృదాం సాక్షీత్యహం
లక్ష్యవాన్ ॥

ఇతడు బాల్యప్రభృతియు ధర్మమార్గ పథికుడు; అద్వైతమతాభిమాని; ఇంద్రియవిజేత; నిర్మత్సరుడు; అందరియందును ఆదరాభిమానములు గలవాడు; సత్సాంగత్యప్రియుడు; క్షేత్రారామపశుప్రసాదాప్తాదులకు 'నేను సాక్షిమాత్రుండను' అను లక్ష్యబుద్ధిగలవాడు.

శ్లో॥ గీతోక్తిముద్దిశ్య కులప్రదిష్ట
కుసీదవాణిజ్యకృషిస్థితోపి ।
నిరంతరం రామపదారవింద
ధ్యానామృతాస్వాదనసక్తచిత్తః ॥

శ్రీకృష్ణభగవానునిచే భగవద్గీతయందు
శ్లో॥ 'కృషి గోరక్ష వాణిజ్యం వైశ్యం కర్మ స్వభావజమ్' అని చెప్పబడినప్రకారం వైశ్యకులోచితమైన కుసీద (వడ్డీ) వాణిజ్య వర్తకములను గడుపుకొనుచు సర్వదా శ్రీరామపాదారవిందధ్యాననిష్ఠాగరిష్ఠుడై యుండును.

శ్లో॥ అల్పేష్వనల్పేషు సమాగతేషు
శుభేషు పూర్వం విదుషాం సపర్యాం।
విధాయ పశ్చాజ్జనరంజనాయ
చిత్రాన్వినోదాన్ప్రకటీకరోతి॥

చిన్నవైనాసరే, పెద్దవైనా సరే శుభము లెన తటస్థపడినప్పుడు ముందుగా విద్వత్సత్కారము గావించి తదనంతరము ప్రజారంజనమునకై వివిధములైన వినోదములను ఏర్పాటుచేయుచుండును.

శ్లో॥ ఇహంపరం సమంపశ్యన్ జీవయాత్రాం నయత్యసౌ
యథోక్తసంచితార్థేన త్యాగం భోగం కరోత్యసౌ॥

ఇహపరములు రెండింటిని సమానదృష్టితో చూచుచు విధ్యుక్తార్జనచే త్యాగభోగములను గావింపుచు దేహయాత్రను గడపుచున్నాడు.

శ్లో॥ అస్యోత్పత్త్యాసహాయాతా శ్రీః పశ్చాద్వర్ధితాఃక్రమాత్
పశ్వారామోర్వరాసౌధవస్తువాహనసంపదః॥

ఇతనియొక్క పుట్టుకతోకూడ లక్ష్మియు ఇతని ఇంట వెలసినది. అటుపిమ్మటనే క్రమముగా పశుగణము, తోటలు, పంటభూములు, గృహసౌధ వస్తువాహనసంపదలు పెంపొందినవి.

శ్లో॥ ఆగతా న్బంధుమిత్రాదీన్ పుర్వైవాభాష్య సాదరం ।
సర్వోపచారై స్సహధా సంభావయతి తానయమ్ ॥

ఇతడు తనఇంటికి వచ్చిన బంధుమిత్రాదులను వారికంటె ముందుగానే తాను సగౌరవముగా పలుకరించి పాద్యార్ఘ్యపేయాది వివిధోపచారములచే వారిని సత్కరించుచుండును.

శ్లో॥ ఏనాం ధర్మత్రియేనాతిచరామీతి కరగ్రహే ।
కృతప్రమాణం సార్థం హి పత్న్యా తీర్థాటనాదయమ్॥

ఇతడు భార్యాసమేతుడై తీర్థాటనచేయుటచే ధర్మార్థకామములయందు ఈమె నతిక్రమింపనని వివాహకాలమున చేయబడిన ప్రమాణమునకు సార్థకత సిద్ధించినది.

శ్లో॥ సువాసినీభి రుద్వాహః సద్భి ర్గ్రామశ్చ సజ్జనైః ।
సదనం సహధర్మిణ్యా సౌందర్యం భాతి సంతతేః ॥

సువాసినీస్త్రీలచే వివాహమునకును, పండితులచేతను, సజ్జనులచేతను గ్రామమునకును, భార్యచే గృహమునకును, సంతానముచే దంపతీసౌందర్యమునకును శోభ సంప్రాప్తమగుచున్నది.

 

శ్లో॥ గ్రంథముద్రాపకో జీయాత్ బాపిరాజ శ్చిరం భువి
ఆయురారోగ్యసత్పుత్రి స్సర్వైశ్వర్యసమన్వితః

లోకోపకారార్థ మీగ్రంథమును ముద్రిం
పించిన పెదమల్లు బాపిరాజుగుప్త, దీర్ఘాయురారో
గ్యసత్పుత్రపౌత్రాది సకలైశ్వర్య సంపన్నుడై
ఈభూలోకమున చిరకాలము వర్ధిల్లుగాక.

## 51వ అంకె వివరణ

శ్లో॥ భోగభోక్తా తు యో దేహః స దేహోత్ర పతిష్యతి
సహాయాతః పుణ్యాపాపే జీవేన సుఖదుఃఖయోః ॥

జగత్సృష్టికి పృథివ్యప్తేజోవాయురాకా
ములు అను మహాభూతములు 5ను కారణమ
5వ అంకెవల్లను, ఆపంచమహాభూతములయొక్క
సూక్ష్మాతిసూక్ష్మాంశజనితమైనది జీవాధారమై
దేహము 1 అని 1వ అంకెవల్లను స్పష్టపడ
చున్నది. ఇంకొకవిశేష మేమనగా-

మేతకువెళ్ళి అస్తమయసమయమున స్వస్థ
నమునకు వచ్చుచుండగా వాటియొక్క లేగల
వందలకొలది గోవులమందలలోనున్న తమ తల్లితో
తమంతట తాము వెంబడించినట్లు ఇహలోకము

సమస్త భోగములను అనుభవించిన దేహమును ఇహమందే విడిచి పరలోకము (మూలప్రకృతి) లోనికి పోవుచున్న జీవునియొక్క సుఖదుఃఖానుభవవిషయమై ఆజీవునితోకూడ పుణ్యపాపములును జీవుని విడిచిపెట్టక నీడవలె వెంబడించుచున్నవి. 5వ అంకెకు 1 సంఖ్యను కలుపగా 6 అయినది. జననమరణములు రెండును దేహధర్మములనియు, క్షుత్పిపాసములు రెండును ప్రాణిధర్మములనియు సుఖదుఃఖములు రెండును మనోధర్మములనియు ఈ 6వ అంకె ఆరుధర్మములను తెలుపుచున్నది. ఇట్లని 51 అంకెయొక్క సర్వవేదాంతగ్రంథసారమైన తాత్పర్యము.

శ్లో॥ అపూర్వవిషయోపేతం అముందీక్ష్య విపశ్చితః।
తుష్టాశ్చే త్సార్థక స్సాస్య న్మే గ్రంథకల్పనజశ్రమః॥

వర్తమాన కాలావశ్యకములైన బహువిధాపూర్వవిషయములతో కూడియున్న ఈగ్రంథమునుచూచి విద్వాంసులు సంతసించిరేని నాగ్రంథకల్పనశ్రమ సార్థకమగును.

# విషయసూచిక

శ్రీగణేశాయ నమః

# సుముహూర్తసాధనమ్.

## ఇష్టదేవతాప్రార్థన

శ్లో॥ శ్రీసీతయాలంకృతవామభాగం
శ్రీలక్ష్మణేనార్చితదక్షిణాంగమ్।
హనూమతా సేవితపాదపద్మం
శ్రీరామచంద్రం శిరసా నమామి ॥

తా॥ శ్రీసంపన్నురాలైన సీతాదేవిచే అలంకరింపబడిన ఎడమ పార్శ్వమును, లక్ష్మణస్వామిచే పూజింపబడుచున్న దక్షిణపార్శ్వమును, హనుమంతునిచే సేవింపబడుచున్న పాదపద్మములునుగల శ్రీరామచంద్రునకు సాష్టాంగముగ నమస్కరించుచున్నాను.

## గ్రంథకల్పనరీతి

శ్లో॥ దోషాంస్తదపవాదాంశ్చ ప్రదర్శ్యాదౌ తతః పరమ్।
ప్రవక్ష్యతే క్రమాల్లగ్నం గర్భాధానాదికర్మణామ్॥

తా॥ ముందుగా దోషములను, పిమ్మట తదపవాదలను ఉదహరించిన తరువాత క్రమానుసారముగా గర్భాధానాది కర్మల యొక్క ముహూర్తనిర్ణయవిధానము చెప్పబడుచున్నది.

శ్లో॥ మహర్షీణాం పురస్కృత్య మతాని వివిధాని చ,
పరివక్ష్యతే సుముహూర్త సాధనోయం మయాధునా కృ
తా॥ మహర్షులందరియొక్కయు, వివిధములై
నమతములను అనుసరించి సుముహూర్తసాధ
మను ఈగ్రంథ మిపుడు నాచే చెప్పబడుచున్న

## అవతారిక

సుముహూర్తనిర్ణయవిషయమై పంచాం
మును ఆమూలాగ్రముగా చదువుట తెలిసియుం
వలయునుగాన ముందుగా పంచాంగపరిభా
తెలుపబడుచున్నది.

## సంవత్సరనామములు

1. ప్రభవ, 2. విభవ, 3. శుక్ల, 4. ప్రమోదూ
5. ప్రజోత్పత్తి, 6. ఆంగీరస, 7. శ్రీముఖ, 8. భా
9. యువ, 10. ధాత, 11. ఈశ్వర, 12. బహుధాన
13. ప్రమాది, 14. విక్రమ, 15. వృష, 16. చిత్రభా
17. స్వభాను; 18. తారణ, 19. పార్థివ, 20. వ్యయ
21. సర్వజిత్, 22. సర్వధారి, 23. విరోధి, 24. వికృ
25. ఖర, 26. నందన, 27. విజయ, 28. జయ, 2
మన్మథ, 30. దుర్ముఖి, 31. హేవిలంబి, 32. విలంబి,
వికారి, 34. శార్వరి, 35. ప్లవ, 36. శుభకృత్, 37. శో

కృత్, 38. క్రోధి, 39. విశ్వావసు, 40. పరాభవ, 41. ప్లవంగ, 42. కీలక, 43. సౌమ్య, 44. సాధారణ, 45. విరోధికృత్, 46. పరీధావి, 47. ప్రమాదీచ, 48. ఆనంద, 49. రాక్షస, 50. నల, 51. పింగళ, 52. కాలయుక్తి, 53. సిద్ధార్థి, 54. రౌద్రి, 55. దుర్మతి, 56. దుందుభి, 57. రుధిరోద్గారి, 58. రక్తాక్షి, 59. క్రోధన, 60. అక్షయ.

## మాసనామములు

1. చైత్రము, 2. వైశాఖము, 3. జ్యేష్ఠము, 4. ఆషాఢము, 5. శ్రావణము, 6. భాద్రపదము, 7. ఆశ్వయుజము, 8. కార్తికము. 9. మార్గశిరము, 10. పుష్యము, 11. మాఘము, 12. ఫాల్గునము.

## ఋతువులు

| | |
|---|---|
| చైత్ర వైశాఖములు | 1 వసంత ఋతువు. |
| జ్యేష్ఠాషాఢములు | 2 గ్రీష్మ ఋతువు. |
| శ్రావణభాద్రపదములు | 3 వర్ష ఋతువు. |
| ఆశ్వయుజకార్తికములు | 4 శరదృతువు |
| మార్గశిరపుష్యములు | 5 హిమవంతఋతువు |
| మాఘఫాల్గునములు | 6 శిశిరఋతువు. |

## అ య న ము లు

సూర్యుడు కర్కాటరాశియందు ప్రవేశించిన మొదలు మకరరాశియందు ప్రవేశించు వర దక్షిణాయనము; మకరరాశి నుండి కర్కాటరా యందు ప్రవేశించువరకు ఉత్తరాయణము.

## శు క్ల ప క్ష తి థు లు

౧ పాడ్యమి ౨ విదియ, ౩ తదియ ౪ చవితి, ౫ పంచమి, ౬ షష్ఠి, ౭ సప్త ౮ అష్టమి, ౯ నవమి, ౧౦ దశమి, ౧౧ ఏకాద ౧౨ ద్వాదశి, ౧౩ త్రయోదశి, ౧౪ చతుర్ద ౧౫ పూర్ణిమ.

## కృష్ణపక్షతిథులు

౧-౨-౩-౪-౫-౬-౭-౮-౯-౧౦-౧౧-౧౨ ౧౩-౧౪-౩౦ అమావాస్య.

## వారములు

శ్లో॥ మందామరేజ్యభూపుత్ర భానుశుక్రేందు జేందవః ।
వరిభ్రమం త్యధోధస్తాత్ చతుర్థో దివసాధిపః ॥

తా॥ (1) శని (2) గురు (3) కుజ (4) రవి (5) శుక్ర (6) బుధ (7) సోములు క్రమాను

సారము ఒకరిక్రింద ఒకరు తిరుగుచుందురు. వీరిలో 1వ వానికి 4వ వాడు క్రమానుసారముగా దినాధిపతులు. ఉదాహరణ :- 1వ వాడు శని- ఈశనికి 4వ వాడు రవిగాన 1 ఆదివారము, ఈరవికి 4వ వాడు సోముడుగాన 2 సోమవారము- ఇట్లే మిగిలిన వారములను గుర్తింపవలయును.

## తిథివారాధిపతులు

శ్లో॥ వహ్నిర్బ్రహ్మహిమాద్రిజాగణపతిస్సర్పః కుమారో రవిః,
గౌరీశో వసునాగధర్మహరయః కామః కలీందూపితా,
ఏతే సర్వదినాధిపా స్స్యురథ తే వారేశ్వరా భాస్కరః
చంద్రో భూమిజ ఇందుజో గురుభృగూ మందో భవేయుః క్రమాత్ ॥

తా॥ పాడ్యమికి అగ్నియు, విదియకు బ్రహ్మయు, తదియకు పార్వతియు, చవితికి గణపతియు, పంచమికి ఆదిశేషువు, షష్ఠికి కుమారస్వామి, సప్తమికి సూర్యుడు, అష్టమికి శివుడు, నవమికి అష్టవసువులు, దశమికి దిగ్గజములు, ఏకాదశికి యముడు, ద్వాదశికి విష్ణువు, త్రయోదశికి మన్మథుడు, చతుర్దశికి కలిపురుషుడు, పూర్ణిమకు

గరిమెళ్ళ రామకృష్ణశాస్త్రి (పురోహిత్)

చంద్రుడు, అమావాస్యకు పితృదేవతలు
పతులు. మరియు ఆదివారమునకు సూర్యు
సోమవారమునకు చంద్రుడు, మంగళవారము
కుజుడు, బుధవారమునకు బుధుడు, గురువార
నకు బృహస్పతి, శుక్రవారమునకు శుక్రుడు,
వారమునకు శని అధిపతులు.

## నక్షత్రములు

(1) అశ్విని. (2) భరణి, (3) కృత్తి
(4) రోహిణి, (5) మృగశిర, (6) ఆర్ద్ర, (7) పు
ర్వసు, (8) పుష్యమి, (9) ఆశ్రేష, (10) మఖ
(11) పుబ్బ, (12) ఉత్తర, (13) హస్త, (14) చిత్త
(15) స్వాతి, (16) విశాఖ, (17) అనూరాధ, (1
జ్యేష్ఠ, (19) మూల, (20) పూర్వాషాఢ, (2
ఉత్తరాషాఢ, (22) శ్రవణం, (23) ధనిష్ఠ, (2
శతభిషం, (25) పూర్వాభాద్ర, (26) ఉత్త
భాద్ర, (27) రేవతి. జాతకవిషయమునగా
ముహూర్తభాగలో కొన్ని కొన్ని విషయము
లలో ఉత్తరాషాఢాశ్రవణములమధ్య అభిజి
అను పేరుతో 28 నక్షత్రములు లెక్కింపబడు
చుండును.

## నక్షత్రాధిపతులు

శ్లో॥ ఋక్షేశా అథదస్రసకాలహుతభుగ్బ్రహ్మేంద్రరుద్రాదితీ,
జ్యానాగాః పితరో భగాద్యమరవిత్త్వష్ట్రీరగాఖ్యాః
శక్రిమాత్ ।
ఇంద్రాగ్నీఅపిమిత్రశక్రదనుజాస్తోయాఖ్యవిశ్వాత్మభూః
శ్రీశాఖ్యావసుతోరుపాజచరణాహిర్బుధ్న్యపూపా
హ్వయాః ॥

తా॥ అశ్వనికి అశ్వనీదేవతలు, భరణికి యముడు, కృత్తికకు అగ్ని, రోహిణికి బ్రహ్మ, మృగశిరకు చంద్రుడు, ఆర్ద్రకు శివుడు, పునర్వసుకు అదితి; పుష్యమికి బృహస్పతి, ఆశ్లేషకు సర్పము, మఘకు పితృదేవతలు, పుబ్బకు భగసంజ్ఞగల సూర్యుడు, ఉత్తరకు ఆర్యమసంజ్ఞగల సూర్యుడు, హస్తకు సూర్యుడు, చిత్తకు ఇంద్రుడు, స్వాతికి వాయువు, విశాఖకు ఇంద్రాగ్నులు, అనూరాధకు మిత్రసంజ్ఞగల సూర్యుడు, జ్యేష్ఠకు దేవేంద్రుడు, మూలకు రాక్షసుడు, పూర్వాషాఢకు జలము, ఉత్తరాషాఢకు విశ్వేదేవతలు, శ్రవణమునకువిష్ణువు, అభిజిత్తునకు, బ్రహ్మ, ధనిష్ఠకు అష్టవసువులు, శతభిషమునకు వరుణుడు, పూర్వాభాద్రకు అజచరణుడు, ఉత్తరాభాద్రకు అహిర్బుధ్నుడు, రేవతికి

పూషసంజ్ఞ గల సూర్యుడు అధిపతులు. ఈ శ్లో
మున పేర్కొనబడిన సూర్యులు ద్వాదశాదిత్యు
లోనివారు.

## అబిజిన్నక్షత్రనిర్ణయము

శ్లో॥ పాద శ్చతుర్థః కిల విశ్వభస్య
నాద్యాశ్చ విష్ణోః ప్రథమే చతస్రః ।
ఊక్తోభజి ద్భుక్తి రితీయ మస్యాం
స్థితగ్రహా విధ్యతిధాతృతారామ్ ॥

తా॥ ఉత్తరాషాఢానక్షత్ర 4వ పాదమును
శ్రవణానక్షత్రమందలి మొదటిపాదమున మొదటి
4 ఘడియలును కలసిన కాలమునకు అభిజిన్నక్షత్ర
మని సంజ్ఞ. ఈ నక్షత్రమందున్నగ్రహము రోహిణీ
నక్షత్రమును వేధించుచున్నది. ఈ వేధ పంచ
శలాక, సప్తశలాకచక్రములద్వారా తెలియబడు
చున్నది. ఈచక్రములీగ్రంథముచివరనీయబడినవి.

## యో గ ము లు

1. విష్కంభము. 2. ప్రీతి, 3. ఆయు
ష్మాన్, 4. సౌభాగ్యం, 5. శోభనము, 6. అతి
గండము, 7. సుకర్మము, 8. ధృతి, 9. శూల,
10. గండం, 11. వృద్ధి, 12. ధ్రువము,

13. వ్యాఘాతము, 14. హర్షణము, 15. వజ్రము, 16. వృద్ధి, 17. వ్యతీపాత, 18. వరీయాన్, 19. పరిఘము, 20. శివము, 21. సిద్ధము, 22. సాధ్యము, 23. శుభము, 24. శుభ్రము, 25. బ్రాహ్మము, 26. ఐంద్రము, 27. వైధృతి.

## కరణములు

(1) బవ, (2) బాలవ, (3) కౌలవ, (4) తైతుల, (5) గరజి, (6) వణిజి, (7) శకుని, (8) భద్ర, (9) చతుష్పాత్, (10) నాగవము, (11) కింస్తుఘ్నం.

## నక్షత్రవిషఘడియలు

శ్లో॥ షట్పంచాశత్సురారాతేః పంచాశత్తురగస్య చ ।
చత్వారింశచ్చ రోహిణ్యా రదనాశ్చ భుజంగినః ॥
త్రింశద్వహ్నేపునః పైత్ర్యరేవతీనాం జినాస్తతః ।
యమతోయనిశాస్యానాం మూర్చనా హరహస్తయోః ॥
నఖాః పుష్యచిపూషాణాం ధృతి రుత్తరవైద్యయోః ।
అక్షిత్రిప్రోష్ఠపదశ్శక్రాణామృగస్యావిశత్రతోః ॥
దశానూరాధశ్రవణధనిష్ఠానాం క్రమాత్పరం ।
చతస్రో విషనాడ్యస్తాస్సర్వకార్యేషు నిందితాః ॥

తా॥ మూలకు 56, అశ్వనికి 50, రోహిణ
40, ఆశ్లేషకు 32, కృత్తిక పునర్వసు మఘ రే
తులకు 30, భరణి పూర్వాషాఢా ఉత్తరాభాద్రల
24, ఆర్ద్ర హస్తలకు 21, పుష్యమి చిత్త పుబ్బ
ఉత్తరాషాఢలకు 20, ఉత్తర శతభిషములకు 18
పూర్వాభాద్రకు 16, మృగశిర స్వాతి విశా
జ్యేష్ఠలకు 14, అనూరాధ శ్రవణం ధనిష్ఠలకు 10,
ఈప్రకారము ఆయానక్షత్రముల ప్రారంభము
ఆయా ఘడియలకు పైన రమారమి 4 ఘడియలు
విషఘడియలుగాన వాటిని శుభములయందు
విడువవలయును. ఋక్షాద్యంతమును 16చే భాగిం
పగా ఏర్పడిన కాలము విషఘడియల ప్రమాణ
మని తెలియవలయును.

## నక్షత్రామృతఘడియలు

శ్లో॥ త్రింశ త్పూష్ణే చతుర్వింశ దాదిత్యే చ జినా స్తతః ।
అశ్వీందుగురుపైత్ర్యేషు ద్వావింశ ద్యమ సంజ్ఞికే ॥
వింశతిః పూర్వఫల్గున్యా మష్టీవసునిశాన్యయోః ।
మను స్స్వాత్యుత్తరామైత్రపురుహూతసురారిషు ॥
అర్కామఘాభిజిత్పూర్వాభాద్రేషు దశ వైష్ణవే ।
[illegible] వేధసి ॥

చతుస్స్వాతిజలద్వంద్వే ద్వైక మీశే శుభప్రిదాః ।
ఏతా అమృతనాడ్యస్తు న యుక్తా స్స్వశ్శుభేతరే ॥

తా॥ రేవతికి 30, పుర్వసుకు 26, అశ్విని మృగశిర పుష్యమి శతభిషములకు 24, భరణికి 22, పుబ్బకు 20, ధనిష్ఠ ఉత్తరాభాద్రలకు 18, ఆశ్లేష ఉత్తర అనూరాధ జ్యేష్ఠమూలలకు 14, మఘ అభిజిత్ పూర్వాభాద్రలకు 12, శ్రవణము నకు 10, కృత్తిక హస్త చిత్త విశాఖలకు 8, రోహిణికి 5, స్వాతి పూర్వాషాఢ ఉత్తరాషాఢ లకు 4, ఆర్ద్రకు 1, ఈనక్షత్రములకు చెప్పబడిన పై ఘడియలకు రమారమి 4 ఘడియలు అమృత ఘడియలు. వీటియందు ప్రయాణ వాణిజ్య శకట వాహనాలంకారోహణాదులను నూతనవస్త్రాభరణ ధారణ మొదలగు కార్యములను నెరవేర్చవచ్చును. ఈ అమృతఘడియలలో చెప్పబడిన కార్యములకు తిథివారాలతో పనిలేదు. ఈ అమృతఘడియల యం దశుభకర్మలు పనికిరావు. ఋతూద్యంత ములో 16వ వంతు అమృతఘడియల ప్రమాణము.

## లగ్నములు

1. మేషం, 2. వృషభం, 3. మిథునం, 4. కర్కాటకం, 5. సింహం, 6. కన్య, 7. తుల, 8. వృశ్చికము, 9. ధనుస్సు, 10. మకరము, 11. కుంభము, 12. మీనము.

## రాసులు

అశ్విని, భరణి, కృత్తిక పాదం మేషం; కృత్తికత్రియం రోహిణి మృగశిరార్థం వృషభం; మృగశిరార్థం ఆర్ద్రపునర్వసుత్రియం మిథునం; పునర్వసుపాదం పుష్యమ్యాశ్లేషాంత్యం కర్కాటకం; మఖ పుబ్బ ఉత్తరపాదం సింహం; ఉత్తరాత్రియం హస్త చిత్తార్థం కన్య; చిత్తార్థం స్వాతివిశాఖత్రియం తుల; విశాఖపాదం అనూరాధ జ్యేష్ఠాంతం వృశ్చికం; మూల పూర్వాషాఢ ఉత్తరాషాఢపాదం ధనుః; ఉత్తరాషాఢత్రియం శ్రవణాధనిష్ఠార్థంమకరం; ధనిష్ఠార్థంశతభిషపూర్వాభాద్రత్రయంకుంభం; పూర్వాభాద్రపాదంఉత్తరాభాద్రా రేవత్యంతం మీనం. నక్షత్రము ఒకటికి 4 పాదముల చొ॥న 27 నక్షత్రములకు 108 పాద

ములుగాన రాశికొకటికి 9 పాదములు చొ॥న పంచగా మేషాది 12 రాసులు ఏర్పడినవి.

## లగ్నములకు చరాదిసంజ్ఞ

శ్లో॥ చరస్థిరద్విస్వభావో మేషాదిక్రమతో భవేత్ ।

| చరలగ్నములు | స్థిరలగ్నములు | ద్విస్వభావలగ్నములు |
|---|---|---|
| మేషము | వృషభము | మిథునము |
| కర్కాటకము | సింహము | కన్య |
| తుల | వృశ్చికము | ధనుస్సు |
| మకరము | కుంభము | మీనము |

## పుణ్యకాలములు

రవి కర్కాటమున ప్రవేశించినప్పుడు దక్షిణాయనపుణ్యకాలము; మకరమున ప్రవేశించినప్పుడు ఉత్తరాయణపుణ్యకాలము; మేష, తులలయందు ప్రవేశించినప్పుడు విషువత్పుణ్యకాలము; వృషభ, సింహ, వృశ్చిక, కుంభములయందు ప్రవేశించినప్పుడు విష్ణుపద (హరిపద) పుణ్యకాలము; మిథున, కన్యా, ధనుర్మీనలగ్నములయందు ప్రవేశించినప్పుడు షడశీతిపుణ్యకాలము.

## గ్రహములు

1. సూర్యుడు, 2. చంద్రుడు, 3. కుజుడు
4. బుధుడు, 5. బృహస్పతి, 6. శుక్రుడు
7. శని, 8. రాహువు, 9. కేతువు.

## గ్రహములకు ఆధిపత్యములు

శ్లో॥ సింహస్యాధిపతి స్సూర్యః కర్కటస్య నిశాకరః
మేషవృశ్చికయో ర్భౌమః కన్యామిథునయో ర్బుధః
కోదండమీనయో ర్మంత్రీ తులావృషభయో ర్భృగుః
నక్రకస్య కుంభరాశేశ్చ నాయక స్సూర్యనందనః ॥

సింహమునకు సూర్యుడు; కర్కాటకమునకు చంద్రుడు; మేషవృశ్చికములకు కుజుడు; కన్యా మిథునములకు బుధుడు; ధనుర్మీనములకు బృహస్పతి; తులావృషభములకు శుక్రుడు; మకర కుంభములకు శని అధిపతులు.

## గ్రహములకు ఉచ్చనీచలు

శ్లో॥ రవే ర్మేషతులే ప్రోక్తే చంద్రస్య వృషవృశ్చికే ।
భౌమస్య మృగకర్కే చ కన్యామీనే బుధస్య చ ॥
గురోస్తు కర్కే మకరే మీనకన్యే సితస్య చ ।
తులామేషే చ మంద స్స్వోచ్చనీచే ప్రకీర్తితే

తా॥ రవికి మేషం ఉచ్చ, తుల నీచ; చంద్రునికి వృషభం ఉచ్చ, వృశ్చికం నీచ

జునికి మకరం ఉచ్చ, కర్కాటకం నీచ; బుధు
నకు కన్య ఉచ్ఛ, మీనం నీచ; బృహస్పతికి కర్కా
కం ఉచ్చ, మకరం నీచ; శుక్రునికి మీనం
చ్చ, కన్య నీచ; శనికి తుల ఉచ్చ, మేషం నీచ.

## గ్రహములకు మిత్రశత్రుసమత్వములు

॥ రవే శ్చంద్రకుజార్యాశ్చ శుక్రమందౌ బుధ స్సమః ।
చంద్రస్యార్కబుధౌ నారిః కుజార్యకవిసౌరిణః ॥
కుజస్యార్కేందుగురవ స్సౌమ్య శ్శుక్రశనైశ్చరౌ ।
బుధస్యార్కకవీ చంద్రః కుజార్యశనయ స్సమాః ॥
గురో రర్కేందుభౌమాశ్చ బుధశుక్రౌ శనైశ్చరః ।
శుక్రస్య బుధమందౌ చ రవిచంద్రౌ కుజార్యకౌ ॥
శనే ర్బుధకవీసూర్యచంద్రభౌమా బృహస్పతిః ।
రాహోః కేతోశ్చ మిత్రాణి గురుశుక్రశనైశ్చరాః ॥

| గ్రహములు | మిత్రులు | శత్రువులు | సములు |
|---|---|---|---|
| సూర్యుడు | చ కు గు | శు శ | బు |
| చంద్రుడు | ర బు | .... | కు గు శు శ |
| కుజుడు | ర చ గు | బు | శు శ |
| బుధుడు | ర శు | చ | కు గు శ |
| బృహస్పతి | ర చ కు | బు శు | శ |
| శుక్రుడు | బు శ | ర చ | కు గు |
| శని | బు శు | ర చ కు | గు |
| రాహుకేతు | గు శు శ | .... | .... |
| ...లు | | | |

## గ్రహములకు దృష్టినిర్ణయము

శ్లో॥ పశ్యంతి సప్తమాంత్సర్వే శనిజీవకుజాః పునః ।
విశేషతశ్చ త్రిదశత్రికోణచతురశ్రిగాన్ ॥

రవ్యాది సప్తగ్రహములును తామున్న రాశికి 7వ రాశిని చూచుచుందురు. 7వ రాశి గాకుండ విశేషదృష్టిచే శని 3-10 రాసులను, బృహస్పతి 5-9 రాసులను, కుజుడు 4-8 రాసులను చూచుచుందురు.

## గ్రహములకు రాసులయందు నివాసము

శ్లో॥ సూర్యస్య శుక్రస్య బుధస్య మాసం
కుజస్య పక్షత్రియ మబ్ది మేకమ్ ॥
జీవస్య సార్ధద్వయ మర్కసూనోః
స్వర్భానుకేతోర్వరపి సార్ధవర్షమ్ ॥

రాశి 1కి రవి శుక్ర బుధులు 1 మాసము, కుజుడు 45 రోజులు, బృహస్పతి 1 సంవత్సరము, శని 30 మాసములు, రాహుకేతువులు 18 మాసములు ఈప్రకారము సంచరింతురు. చంద్రుడు సర్వదా నిత్యనక్షత్రముతో కలసియుండును. రాహుకేతువులకు వెనుకనడకయేగాని ముందునడక (ఋజుగతి) లేదు.

## గ్రహగతుల నామములు

శ్లో॥ పరాఙ్ముఖా ద్వక్ర మతిప్రచారం
పలాయనాత్ స్తంభన మాచిరస్థాత్ ।
పరాజితం భౌమభపూర్వతోస్తం
దినేశయోగా దుదయం విముక్తేః ॥

గ్రహములు తామున్నరాశినుండి వెనుకకు మరలినచో వక్రము; నిర్ణీతకాలముకంటె ముందుగా పైకి వెళ్లినచో అతిచారము; నిర్ణీతకాలము కంటె అధికకాలమున్నచో స్తంభనము; కుజుడున్న నక్షత్రమునకు క్రింది నక్షత్రమందున్నచో పరాజితము; సూర్యుడున్న నక్షత్రమందున్నచో అస్తంగతము; సూర్యుడున్న నక్షత్రమును విడిచి పై నక్షత్రమునకు వెళ్లినచో ఉదయము అని సంజ్ఞ.

సూర్యుడు ఏనక్షత్రమందు నివసించియుండునో ఆకాలము ఆనక్షత్రనామముగల కార్తె యగును. అనగా అశ్వనికార్తె, భరణికార్తె, కృత్తికకార్తె ఇత్యాదులు.

## మేషాదిలగ్నప్రమాణము

శ్లో॥ మేషే వింశతి రర్కభే పనశరా నక్రేగ్నివేదాఘటే
యద్వాద్వౌ జలజే శతప్రియమితాః పంచాత్రషడ్వ్యాయుగే ।

కర్కి కన్యక గుణా సఖా మృగవతో షడ్వ్యాం తిథిస్త్రా
చతుర్వింశతిరస్త్రగో హిమకరా స్త్ర్యక్షా మమర్త్రా
స్పష్టల

మేషం 4-20, వృషభం 4-56, మిథు
5-26, కర్కాటకం 5-31. సింహం 5-20,
5-15, తుల 5-24, వృశ్చికం 5-33, ధనుస్సు 5-
మకరం 4-43, కుంభం 4-11 మీనం 4-2.

## ఏకవింశతి మహాదోషములు

శ్లో॥ ఆద్యః పంచాంగశుద్ధిస్స్యా ద్ద్వితీయ స్సూర్య
సంక్రమ
తృతీయః కర్తరీదోష శ్చంద్రష్షష్ఠాష్టరిఃఫగః ॥
ఉదయాస్తాంశయో శ్శుద్ధిరహితో దుర్ముహూర్తజః
గండాంతం పాపషడ్వర్గం భృగుషట్కం కుజాష్టమ
దంపత్యో రష్టమం లగ్నం రాశే ర్విషఘటీ భవేత్
కునవాంశో వారదోషః ఖార్జూరికసమాంఘ్రిభమ్ ॥
గ్రహణోత్పాతభం క్రూరవిద్ధర్క్షం క్రూరసంయుతం
అకాలగర్జితం వృష్టి ర్మహాపాత స్స వైధృతిః ॥

(1) పంచాంగశుద్ధిరాహిత్యము, (2) సూ
సంక్రమణము, (3) కర్తరి, (4) చంద్ర దోష
(5) ఉదయాస్తాంశశుద్ధిరాహిత్యము, (6) దు
హూర్తము, (7) గండాంతము, (8)

..గ్రహము, (9) భృగుషట్కము, (10) కుజాష్టమం, (11) దంపతుల జన్మలగ్నమునకు, జన్మరాశికి ..ష్టమలగ్నము, (12) రాశివిషఘటికలు, (13) కునవాంశ (14) వారదోషము, (15) ఖార్జూరికసమాంఘ్రిభదోషము, (16) గ్రహ ..త్పాతభము, (17) క్రూరవిద్ధర్క్షము, (18) క్రూరసంయుతము, (19) అకాలగర్జితవృష్టి, (20) వ్యతీపాత, (21) వైధృతి అను ఈ 21 మహా ..దోషములు.

## పంచాంగశుద్ధిరహితదోషము

శ్లో॥ తిథి ర్వారశ్చ నక్షత్రం యోగశ్చ కరణం తథా ।
పంచాంగశుద్ధిరహితం తల్లగ్నం పరివర్జయేత్ ॥

తిథి, వారము, నక్షత్రము, యోగము, కరణము ఈ 5 పంచాంగములు. ఇవి చెడువైనచో పంచాంగ శుద్ధిరహితదోషము సంప్రాప్తమగును. పంచాంగ శుద్ధిలేని ముహూర్తమును విడువవలయును.

## అపవాద

శ్లో॥ త్రిద్యుస్పృక్స్వపమాగణ్యా లగ్నే బలసమన్వితే ।
అసంశయం శుభం కుర్యాత్ కించిద్వానాత్రసంశయః ॥

ఒక రోజున మూడుతిథులు కలసియున్నచో

అవమ అనియు, ఒకేతిథి మూఁడువారములయందు
వ్యాపించి యున్నచో త్రిద్యుస్పృక్కు అనియు
సంజ్ఞ. ఇవి శుభకార్యముల విషయమున పనికిరా
వని కొన్నిమతములు కలవు. లగ్నము బలవత్త
మైయున్నప్పుడు వీటిని లెక్కచేయునవసర మెం
మాత్రమును లేదు. ఇందువిషయమై సందేహ
మెంతమాత్రమును లేదు.

## సూర్యసంక్రమణదోషతదపవాదలు

శ్లో॥ భానో స్సంక్రాంతికాలస్య పూర్వతః పరత స్సదా
త్యాజ్యా ష్షోడశ నాడ్యస్తు త్రింశ న్నాడ్యశ్చరేషు చ

సూర్యసంక్రమణకాలమునకు పూర్వపరమ
లయందు స్థిర ద్విస్వభావ రాసులయందు 16 ఘ
యలును, చరరాసులయందు 30 ఘడియలును
విడిచిపెట్టతగినవి.

## కర్తరీదోషము

శ్లో॥ లగ్నస్యాంతే ద్వితీయే చ సపాపే కర్తరీ భవేత్ ।
ఋజు వక్రీ యది తయోః మహాకర్తరికా మతా ॥

తా॥ లగ్నమునకు 2-12 స్థానములయంద
పాపగ్రహము లున్నయెడల కర్తరీదోషమనియు
2వయింట పాపగ్రహము వక్రించియుండి 12వ

యింట పాపగ్రహము ఋజుగతి కలిగియు ఉన్నచో మహాకర్తరి అనియు చెప్పబడును.

అపవాద

శ్లో॥ శుభశ్చ లగ్నే గురు రంత్యరాశౌ
ధనే శశాంకో యది వా శుభా స్స్యః ।
కేంద్రేపి కోణే కవిసౌమ్యజీవాః
న కర్తరీకా యది నీచగౌ వా ॥

తా॥ లగ్నమందు శుభగ్రహమున్నను, బృహస్పతి 12 వ యింట నున్నను, 2వ యింట చంద్రుడుగాని, శుభగ్రహములుగాని ఉండి యున్నను కేంద్రములయందుగాని, కోణములయందుగాని గురుశుక్రబుధులలో ఏ ఒకరున్నను, కర్తరిని కలుగజేయు గ్రహము నీచయందున్నను కర్తరీదోషములేదు.

## 4 చంద్రషష్ఠాష్టరిఃఫదోషము

శ్లో॥ షడష్టరిఃఫగే చంద్రే లగ్నే దోష స్స సంజ్ఞికః ।
తల్లగ్నం వర్జయే ద్ధీమాన్ జీవశుక్రసమన్వితమ్ ॥

లగ్నమునకు 6-8-12 స్థానములయందు ఏ ఒక రాశియందైనా చంద్రు డున్నయెడల ఆ అంక సంజ్ఞగల దోష మేర్పడుచున్నది. కాన అట్టి

గరిమెళ్ళ రామకృష్ణశాస్త్రి (పురోహిత్)

లగ్నము గురుశుక్రబలసమన్వితమైనదై నను విడువ
వలెను.

### అ ప వా ద.

శ్లో॥ కవౌ గురౌ వా బలిని స్థితే తనౌ శుభేక్షితో వా
వర్గగ శ్శశీ । వివర్ధమాన శ్శుభకృచ్ఛ నాశుభం కరో
తిష్ఠన్నపి షష్ఠరిఃఫయోః ॥

శుక్లపక్షమున వర్ధమానచంద్రుడు శు
వర్గులయందుండి, శుభగ్రహదృష్టిగలవాడై
యుండగా లగ్నమందు బృహస్పతిగాని, శుక్రుడు
గాని ఉండియున్నచో షష్ఠచంద్రరిఃఫదోషము లేదు.
అష్టమచంద్రదోషము అనివార్యము.

### 5 ఉదయాస్తాంశశుద్ధిరహితదోషము

శ్లో॥ లగ్నలగ్నాంశకౌ స్వస్య పతినా వీక్షితౌ యుతౌ ।
న చె దన్యోన్యపతినా మిత్రేణాపి శుభేన వా ॥
వ్యత్యయ శ్చే త్తథా మృత్యు స్తాభ్యాం
సప్తోదయాంశకౌ ।
ఏవం యుతౌ మృత్యుకరౌ క్రూరగ్రహయుతౌ
యథా ॥

లగ్నము నవాంశయు తత్తదధిపతులచే
చూడబడుచుగాని, కలసిగాని లేదా పరస్పరాధిపతు

లచే గాని, మిత్రులచేగాని, శుభులచేగాని చూడ బడుచుండవలయును. ఇట్లే ప్రకారము లగ్న సప్తమ తన్నవాంశాధిపతుల బలమునుకూడ చూడ వలయును. వివాహవిషయమున లగ్నము, సప్తమ లగ్నము, తన్నవాంశాధిపతులు క్రూరులైన వధూ మరణప్రదము లగుదురు. ఈదోషమున కపవాదలేదు.

## 6 వారదుర్ముహూర్తదోషము

శ్లో॥ రవౌ మను శ్శీతకరేంకసూర్యే కుజే సముద్రాకృతి
రష్టమోజ్లే । గురౌ రసార్కా భృగుజేంకమార్గా
శనౌ కరేంపా ఖలు దుర్ముహూర్తాః ॥

ఆదివారము 14, సోమవారము 9-12, మంగ ళవారము 4-22, బుధవారము 8, గురువారము 6-12, శుక్రవారము 9-4, శనివారము 2-1 ఈ సంజ్ఞగలవి దుర్ముహూర్తములు. దినప్రమాణ ములోను, రాత్రిప్రమాణములోను 15వ భాగము దుర్ముహూర్తప్రమాణము.

## 7(1) గండాంతదోషములోతిథిగండదోషము

శ్లో॥ పూర్ణానందాఖ్యయో స్తిథ్యోః సంధౌ నాడీచతుష్టయం ।
గండాంతం మృత్యుదం జన్మ యాత్రోద్వాహ
ప్రతాదిషు ॥

పూర్ణానందతిథుల సంధియందు 4ఘడియలు (పూర్వతిథియందు చివరి 2 ఘడియలు, పరతిథియందు మొదటి 2 ఘడియలు) సంధికాలముగా ఈఘడియలయందు జననప్రయాణవివాహాద్యనుష్ఠానాదులు పనికిరావు.

శ్లో॥ నందా భద్రా జయా రిక్తా,
పూర్ణా చ క్రమతో భవేత్ ।

**ఉదాహరణ :-**

| నంద. | భద్ర. | జయ. | రిక్త. | పూర్ణ. |
|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 |
| 6 | 7 | 8 | 9 | 10 |
| 11 | 12 | 13 | 14 | 15 |
| 16 | 17 | 18 | 19 | 20 |
| 21 | 22 | 23 | 24 | 25 |
| 26 | 27 | 28 | 29 | 30 |

అంకెలను శుక్లపక్షకృష్ణపక్షతిథులుగా తెలియవలెను.

## 7 (2) నక్షత్రగండదోషము

శ్లో॥ సార్పేంద్రపౌష్ణభే ష్వంతే షోడశాంశాః నంధయః
అశ్వగ్రిభే ష్వాద్యపాదే పాదగండాంతసంజ్ఞకమ్ ॥

ఆశ్రేష, జ్యేష్ఠ, రేవతి ఈనక్షత్రముల యొక్క చివరియందును, మఘ, మూల, అశ్వని మొదలకు ఋక్షాద్యంతములో 16వ భాగము (రమారమి 4 ఘడియలు) పాదగండసంజ్ఞకలవి.

## 7 (3) లగ్నరాశిగండము

శ్లో॥ కుళీరసింహయోః కీట చాపయోర్మీనమేషయోః ।
గండాంతమంతరాళం స్యాత్ ఘటికార్థంమృతిప్రదమ్॥

నక్షత్రములయొక్కయు, రాసులయొక్కయు ఖండనాసాదృశ్యముచే ఆశ్రేషాంత్యమైన కర్కాటకము, మఘాదియగు సింహాది, జ్యేష్ఠాంతమైన వృశ్చికము, మూలాదియగు ధనురాది, రేవత్యంతమైన మీనాంతము, అశ్వన్యాదియగు మేషాది ఈలగ్నములయొక్క ఆద్యంతములయందు 30 విఘడియలు లగ్నగండదోషముగలవి.

## 8 (1) షడ్వర్గము

శ్లో॥ త్రింశద్భాగాత్మకం లగ్నం హోరా తస్యార్థ
ముచ్యతే ।
రాశిత్రిభాగో ద్రేక్కాణో నవాంశో నవభాగకః ॥
ద్వాదశాంశో ద్వాదశాంశ త్రింశాంశ త్రింశదంశకః ।
షడ్వర్గలక్షణం ప్రోక్తం సర్వలగ్నే ష్వయం
క్రమః ॥

గొరిమెళ్ళ రామకృష్ణశాస్త్రి (పురోహిత)

తా॥ షడ్వర్గవివరణ కళిమా సుసార్య
ఈదిగువ వివరింపబడుచున్నది-లగ్నము 30 భాగ
కలది. ఇది 1వ వర్గు.

## 8 (2) హోర

శ్లో॥ హోరా విషమ మర్కేందోః
సమభే చంద్రసూర్యయోః ॥

తా॥ లగ్నమును 2 భాగలుగా చేసి,
రాసులయందు మొదటిది సూర్యహోర అని
రెండవది చంద్రహోర అనియు, సమరాసులయం
మొదటిది చంద్రహోర, 2వది సూర్యహో
అనియు తెలియవలయును.

## 8 (3) ద్రేక్కాణము

శ్లో॥ చరే స్వపుత్రనవపాః స్థిరే ధర్మస్వపుత్రపాః ।
పుత్రధర్మస్వపాద్విస్వే ద్రేక్కాణస్య ప్రకీర్తితాః

తా॥ లగ్నమును 3 భాగములుగా చేసి
లగ్నములైన మేష, కర్కాట, తులా, మకరము
యందు 1వ ద్రేక్కాణమునకు లగ్నాధిపతియు, 2
ద్రేక్కాణమునకు పంచమాధిపతియు, 3వ ద్రేక్
ణమునకు నవమాధిపతియు, స్థిరలగ్నములై
వృషభ, సింహ, వృశ్చిక, కుంభములయందు 1

ద్రేక్కాణమునకు నవమాధిపతియు, 2వ ద్రేక్కాణ
మునకు లగ్నాధిపతియు, 3వ ద్రేక్కాణమునకు
పంచమాధిపతియు, ద్విస్వభావలగ్నములైన మిథున
కన్యా ధనుర్మీనములయందు 1వ ద్రేక్కాణమునకు
పంచమాధిపతియు, 2వ ద్రేక్కాణమునకు నవ
మాధిపతియు, 3వ ద్రేక్కాణమునకు లగ్నాధి
పతియు అధిపతులు. ద్రేక్కాణ మనగా లగ్నంలో
3వ వంతు భాగము.

## 8 (4) నవాంశ

శ్లో॥ మేషసింహధనుషి త్వజాదయః
తౌళికుంభమిథునే తులాదయః।
కన్యకామృగవృషే మృగాదయో
మీనకర్క్యళిషు కర్కటాదయః॥

తా॥ లగ్నమును 9 భాగములు చేయగా సుముహూర్తకాలము ఎన్నవ నవాంశయం దుండునో క్రమానుసారము మేష, సింహ, ధనుస్సుల యందు మేషాదిగాను, తులా, కుంభ, మిథునముల యందు తులాదిగాను, కన్యామకరవృషభముల యందు మకరాదిగాను, మీన, కర్కట, వృశ్చికములయందు కర్కటాదిగాను అన్నవయింటివాడు నవాంశాధిపతి యగును.

## 8 (5) ద్వాదశాంశ

శ్లో॥ యద్రాశిభాగసంఖ్యానాం
తత్తద్రాశ్యధిపాః క్రమాత్ ।

తా॥ లగ్నమును 12 భాగలుం చేయగా సుముహూర్తముగాని, జననముగాని ఎన్నవ ద్వాద శాంశయందుండునో లగ్నము మొదలుకొని అన్న యింటివాడు ద్వాదశాంశాధిపతి అగును.

## 8 (6) త్రింశాంశ

శ్లో॥ కుజః పంచ శనిః పంచ గురు రష్టౌ జ్ఞస్సప్త చ ।
శుక్రః పంచక్రమేణైవ సమరాశౌ విపర్యయః ॥

తా॥ లగ్నమును 30 భాగములు చేసి, బే లగ్నమైనచో క్రమానుసారము కుజునికి 5, శని 5, బృహస్పతికి 8, బుధునికి 7, శుక్రునికి 5ను సమలగ్నములైనచో పైవిధమునకు తలక్రిందుగ శుక్రునకు 5, బుధునకు 7, బృహస్పతికి 8, శనికి 5 కుజునకు 5ను ఈప్రకారముపంచగా సుముహూర్తము (జననకాలము) ఎవనిభాగలలో చేరియుండునో ఆగ్రహము త్రింశాంశాధిపతి అని తెలియవలయు ను ఈషడ్వర్గముద్వారా లగ్నమునందలి పాపులను గుర్తింపవలయును.

## 9 భృగుషట్కదోషము

శ్లో॥ లగ్నాత్ షష్ఠగతే శుక్రే భృగుషట్కం విదుస్సతే ।
ఉచ్చగే శుభయుక్తే వా తల్లగ్నం పరివర్జయేత్ ॥

తా॥ శుక్రుడు సుముహూర్తలగ్నమునకు
ఆరవ ఇంట నున్నచో భృగుషట్కము అను దోషము.
శుక్రుడు ఉచ్చయందుండి లగ్నము శుభగ్రహ
సంబంధము కలిగియున్నను ఆలగ్నమును విడువ
వలయును.

### అపవాద

శ్లో॥ నీచే వా తత్తురీయే వా శత్రుక్షేత్రగతేపి వా ।
భృగుషట్కోద్భవో దోషో నాస్తి త్యత్ర న సంశయః ॥

తా॥ శుక్రుడు తన నీచస్థానమైన కన్య
యందుగాని, ఈకన్యారాశికి 4వది యగు ధనుస్సు
యందుగాని, శత్రుక్షేత్రములైన కర్కటసింహ
ములయందుగాని ఉండియున్నను భృగుషట్క
దోషములేదు. ఇందెంతమాత్రమును సందేహము
లేదు.

## 10. కుజాష్టమదోషము

శ్లో॥ కుజాష్టమో మహాదోషః లగ్నాదష్టమగే కుజే ।
శుభైర్యుతే వా తల్లగ్నం త్యజేత్తుంగేపి వా కుజే ॥

గరిమెళ్ళ రామకృష్ణశాస్త్రి (పురోహిత్)

తా॥ కుజుడు సుముహూర్తలగ్నమునకు ...యింట నుండెనేని కుజాష్టమదోష మేర్పడును... లగ్నము అనేకశుభగ్రహములతో కూడియున్న... కుజుడు ఉచ్ఛయందున్నను ఆలగ్నమును వి... వలయును.

అ ప వా ద

శ్లో॥ అస్తగే నీచగే భౌమే శత్రుక్షేత్రగతేపి వా,
కుజాష్టమోద్భవో దోషో న కించిదపి విద్యతే॥

తా॥ కుజుడు అస్తంగతుడైనను, నీచయం...దున్నను, శత్రుక్షేత్రములైన కన్యామిథునము... యందున్నను కుజుడు బలహీనుడుగాన కుజదోషము లేదు.

## 11. అష్టమలగ్నదోషము

శ్లో॥ ఉభయో రష్టమం లగ్నం వివాహోపనయాదిషు,
సశుభో వా లగ్నగశ్చే దుభయో ర్మరణప్రదః॥

తా॥ దంపతులు, శిష్యాచార్యులు వీరి జ...
లగ్నమునకుగాని, జన్మరాశికిగాని అష్టమలగ్న...
వివాహోపనయనాదికర్మలయందు పనికిరా...
మరియు అష్టమలగ్న అష్టమరాశ్యధిపతులు శు...
లైనను లగ్నమునం దుండరాదు.

అ ప వా ద.

శ్లో॥ న దోషోష్టమలగ్నస్య యది జన్మేశలగ్నపౌ ।
సుహృదౌ చేత్తదా కార్యం ఇత్యాహు ర్మంగళం బుధాః ॥

తా॥ వివాహలగ్నము దంపతులయొక్క జన్మలగ్నమునకుగాని, జన్మరాశికిగాని అష్టమలగ్నమైనచో పనికి రాదు. ఆ అష్టమలగ్నాధిపతి దంపతులయొక్క జన్మలగ్నాధిపతికిగాని, జన్మరాశ్యధిపతికిగాని మిత్రుడైనచో శుభప్రదుడుగాన పనికి వచ్చును. ప్రతిశుభమందును ఈనిబంధనను అవశ్యముగా పరిశీలించి సుముహూర్తమును స్థిరపరచవలయును. ఉపనయనలగ్నవిషయమునకు వటువునకు చూడవలయును.

## 12. విషనాడీదోష-తదపవాద

శ్లో॥ లగ్నాంతం విషయుక్తంచే
త్తల్లగ్నం పరివర్జయేత్ ।
విషత్యక్తావశిష్టం య
త్తల్లగ్నం శుభసమ్మతమ్ ॥

తా॥ లగ్నముయొక్క చివరిభాగము నక్షత్రవిషనాడీస్పర్శ కలిగియున్నచో ఆలగ్నమును విడువవలయును. విషఘడియలు పోగా మిగిలియున్న

గరిమెళ్ళ రామకృష్ణశాస్త్రి (...

లగ్నశేషము శుభములయందు అంగీకరిం
చున్నవి. శాస్త్ర మంగీకరించినను ఈవిధ
ఆచరణలో లేదు.

## 13. కునవాంశదోషము.

శ్లో॥ గోయుగ్మకన్యావణిజాం నవాంశాః
కోదండపూర్వశ్చ శుభప్రదాస్స్యుః।
లగ్నాన్నవాంశస్య బలం ప్రధానం
పరే నవాంశా న శుభా వివాహే॥

తా॥ షడ్వర్గమందేర్పడిన, వృషభమి
కన్యాతులానవాంశలును, ధనుర్నవాంశపూ
భాగమును వివాహమందు శుభప్రదములు.
హావిషయమున లగ్నబలముకంటె నవాంశబల
ముఖ్యము. ఈ చెప్పబడిన నవాంశలకంటె
నవాంశలు మంచివికావు. ఈవిషయమును ప్ర
కాలామృతమందలి 75-76 శ్లోకములద్వా
తెలియనగును.

### అపవాద

శ్లో॥ యే లగ్నదోషాః కునవాంశదోషాః
పాపగ్రహదృష్టినిపాతదోషాః।
లగ్నే గురుస్తాన్విమలీకరోతి
బీజం యథాంభః కతకద్రుమస్య॥

తా॥ లగ్నమందుగల వివిధదోషములు, శుభాంశదోషములు, పాపగ్రహదృష్టిదోషములు, వీటినన్నిటిని లగ్నమందున్న గురుడు, ఇందుగ గింజ నీటియందుగల బురదనువలె తొలగించి, లగ్నమును నిర్మలమైనదానినిగా చేయుచున్నాడు.

## 14 సగ్రహచంద్రదోషము

శ్లో॥ శశాంకే గ్రహసంయుక్తే దోష స్సగ్రహసమ్మితః ।
లగ్నే సగ్రహదోషే చేత్ వివాహాది న కారయేత్ ॥

తా॥ చంద్రుడు ఇతరగ్రహములతో కూడియున్నయెడల, సగ్రహచంద్రదోషముగాన వివాహము కూడదు.

### అపవాద

శ్లో॥ ఏకరాశిగతో వాపి నక్షత్రాంతర్గత శ్శశీ ।
యది చేత్సగ్రహ భయం నాస్తీతి దృఢనిశ్చయః ॥

తా॥ చంద్రుడు ఇతరగ్రహములతో కూడి ఏకరాశిగతుడైనను నక్షత్రభేదము కలిగియున్న యెడల సగ్రహచంద్రదోషము లేదు. ఇట్లని దృఢనిశ్చయము.

శ్లో॥ గురు స్స్వకీయవర్గస్థో బలవా న్కంటకాశ్రితః ।
పక్వాంత్సగ్రహాశీతాంశుంతి ద్దోషం విలయం వ్రజేత్॥

తా॥ బృహస్పతి స్వవర్గమందుగా[ని]
స్వాంశయందుగాని, కేంద్రమందుగాని బలవం[తుడై]
యుండి, ఇతరగ్రహములతో కూడియు[ండక]
చంద్రుని చూచుచున్న యెడల, సగ్రహచంద్ర
దోషములేదు.

## 15 ఖార్జూరికసమాంఘ్రిభదోషము

శ్లో॥ సంవిఖే దూర్ధ్వరేఖాయాం తిర్యగ్రేఖా త్రయోదశ,
తస్య ఖార్జూరికం చక్రం ఇతి సంజ్ఞా ప్రవర్తతే॥

తా॥ నిడుపుగా 1 గీతను గీసి, దానిపై
13 అడ్డగీతలను గీసినచో ఏర్పడినదానికి ఖార్జూరి[క]
చక్రము అనిపేరు.

### ఖార్జూరికచక్రమునకు సంబంధించిన యోగములు - నక్షత్రములు.

శ్లో॥ విష్కంభవ్యతీపాతశూలపరిఘా గండాతిగండాశని
వ్యాఘాతా అపి వైధృతిశ్చధనదా యోగావివాహాదిషు
చంద్రాహీందుమఘాస్తథాదితిసుతానూరాధపుష్యాదితి
త్వష్ట్రాఖ్యాః క్రమశః ప్రదక్షిణవిధౌ జ్ఞేయా
శ్చలస్త్వోడులః

తా॥ విష్కంభమునకు అశ్వని, వ్యతీపాతకు
ఆశ్లేష, శూలకు మృగశిర, పరిఘకు మఘ

గండమునకు మూల, అతిగండమునకు అనూరాధ, వజ్రమునకు పుష్యమి, వ్యాఘాతమునకు పునర్వసు, వైధృతికి చిత్త – ఈప్రకారముగా ఏ యోగమునకు ఏ నక్షత్రము చెప్పబడినదో ఆప్రకారము ఆ యోగమును, ఆనక్షత్రమును శిరస్సునందు లిఖించి శిరోగతనక్షత్రమునుండి 13 నక్షత్రముల వరకు అవరోహణక్రమముగా పాదవారిగా విన్యసించి దాని పార్శ్వమున మరల 13 నక్షత్రములను ఆరోహణక్రమముగా పాదవారిగా విన్యసింపవలయును.

ఉదాహరణ :-

శ్లో॥ అవరోహక్రమాద్ధ్రసాత్ చిత్రాంతాత్తస్య పార్శ్వతః।
ఆరోహణక్రమాత్స్వాత్యాః యమాంతాత్పదశోన్యసేత్ ॥

| | | | |
|---|---|---|---|
| భరణివరకు | 4 | 1 | భరణినుండి |
| | 3 | 2 | |
| | 2 | 3 | |
| | 1 | 4 | |
| స్వాతినుండి | 4 | 1 | చిత్త వరకు |
| | 3 | 2 | |
| | 2 | 3 | |
| | 1 | 4 | |

శ్లో॥ చంద్రార్కా వేకరేఖాస్థౌ ఖార్జూరికసమాంఘ్రిభః,
దోషస్స్యాద్వర్జయేత్తస్మాత్ సర్వేషు శుభకర్మసు

తా॥ సూర్యచంద్రు లిద్దరును ఏక యందున్న యెడల ఖార్జూరికసమాంఘ్రిభ దో మేర్పడునుగాన అట్టి లగ్నమును సర్వశుభ యందును విడువవలయును; చంద్రుడన్నను ని నక్షత్రమన్నను ఒకటే.

## అర్గళవివరణ

శ్లో॥ చతుర్థగ స్త్వాద్యపాదం ఆద్యగస్తు చతుర్థగం।
ద్వితీయగ స్తృతీయస్థం తృతీయస్తు ద్వితీయగమ్

తా॥ 4వపాదమందున్నగ్రహము 1వ పా మందున్న గ్రహమును, 1వ పాదమందున్న గ్రహ ము4వపాదమందున్నగ్రహమును, 2వపాదమందున్న గ్రహము 3వ పాదమందున్నగ్రహమును, 3వ పా మందున్న గ్రహము 2వ పాదమందున్న గ్రహ మును చూచుచుండును. ఇదియే ఏకార్గ దోషము.

## 16 గ్రహణోత్పాతభదోషము

శ్లో॥ గ్రస్తేస్తే త్రిదినం పూర్వం పశ్చాద్గ్రస్తోదయే తథా
సంధ్యాకాలే త్రిత్రిదినం నిశ్శేషే సప్త సప్త చ॥

తా॥ గ్రస్తాస్తమయగ్రహణమందును, గ్రస్తోదయగ్రహణమందును, సంధ్యాకాలగ్రహణమందును, పూర్వాపరములయందు 3 రోజులును, సర్వగ్రాసగ్రహణమందు పూర్వాపరములయందు 7 రోజులును శుభనిషిద్ధములు.

## మతాంతరము

శ్లో॥ సర్వగ్రాసేషు షణ్మాసం అర్ధగ్రాసే తదర్ధకం ।
తదంతరేనుపాతేన త్యజేద్భం గ్రహణాహతమ్ ॥

తా॥ సర్వగ్రాసగ్రహణమందు 6 మాసములు, అర్ధగ్రాసగ్రహణమందు 3 మాసములు, తద్భిన్నగ్రాసగ్రహణములయందు అనుపాతానుసారము (యథాసంఖ్యము) గాను గ్రహణనక్షత్రమును శుభములయందు విడువవలెను.

శ్లో॥ పక్షగ్రహణమధ్యే తు మౌంజీబంధం వివాహకం ।
న కుర్యా ద్యది కుర్వీత నష్టాయుః స్త్రీవియోగవాన్ ॥

తా॥ పూర్ణిమామావాస్యల గ్రహణసంధ్యాకాలమున ఉపనయనముగావించినచో వటునికి ఆయుఃక్షీణమును, వివాహము గావించినచో వరునకు స్త్రీనష్టమును కలుగును.

## క్రూరగ్రహావిద్ధర దోషము

శ్లో॥ క్రూరగ్రహేణ సంవిద్ధం క్రూరగ్రహసమన్విత
త్యజే త్తద్భం పంచగవ్యం సురాబిందుయుతం య

తా॥ క్రూరగ్రహవేధిత నక్షత్రము
క్రూరగ్రహయుత నక్షత్రమును మద్య
సంయుతమైన పంచగవ్యమువలె విడువవలయు
క్రూరగ్రహవేధను పంచశలాక, సప్తశలాక చ
ములద్వారా తెలియవలెను.

### పంచశలాకచక్రము-సప్తశలాకచక్రము

శలాకచక్రావశ్యకత-

శ్లో॥ వధూప్రవేశే దానేషు కన్యకావరణే తథా ।
పశ్యే త్పంచశలాకాఖ్యం శేషే సప్తశలాకకమ్ ।

తా॥ నూతనవధూప్రవేశము, షోడశమ
దానములు, కన్యకావేక్షణ (పెళ్లికూతురుచూ
వీటియందు పంచశలాకచక్రశుద్ధి ముఖ్యము. మి
లినవాటియందు సప్తశలాకచక్రశుద్ధి ముఖ్యమ
పంచశలాకచక్రరీత్యా కృత్తికయందున్నగ్రహము
విశాఖను, సప్తశలాకచక్రరీత్యా కృత్తికయందున్న
గ్రహము శ్రవణమును వేధించుచున్నది. ఇ
తెలియవలెను. ఈచక్రము లగ్రంథములచే
ఈయబడినవి.

॥ యస్యాః శశీ సప్తశలాకచక్రే
పాపైః రపాపైః సహితో వివాహే ।
సుఖం న జానాతి కదాపి సా స్త్రీ
సంసారచింతా పరిశిప్త చిత్తా ॥

తా॥ సప్తశలాకచక్రదూషిత నక్షత్రమున వాహము కాబడిన స్త్రీ సర్వదా సంసారచింతా రిక్షిప్తచిత్తురాలై యుండును. కాన చంద్రుడు ముహూర్త నక్షత్రము) పాపగ్రహవేధగాని, శుభ హవేధగాని కలిగియుండకూడదు. ఈ చెప్పబడిన ర్జూరికచక్ర, పంచశలాక సప్తశలాకచక్ర లు మాత్రమేగాక అడలచక్ర, కాలహోరా క్ర, ఖచరయోగచక్ర, చంద్రగర్భసమ్మతిచక్ర, ంద్రద్వాదశావస్థాచక్ర, నాడీకూటచక్ర పంథా హుచక్ర, పరిఘదండచక్ర, యాత్రాచంద్రకం కచక్ర, యాత్రాఫణిచక్ర, యాత్రాలలాటచక్ర రచక్ర, సూర్యచంద్రనాడీచక్ర, ఉపనయన క్ర, వివాహచక్ర, రజస్వలాచక్రాదులనేకములు లవు. వాటిప్రయోజనములను ముహూర్తదర్పణ, ర్వకాలామృత, ఉత్తరకాలామృత, ముహూర్త ంతామణి, ముహూర్తరత్నాకర, విద్యామాధవీ యాది గ్రంథములద్వారా తెలియునగును.

# 18 క్రూరగ్రహయుక్తర్క్షదోషము

శ్లో॥ దగ్ధం క్రూరవిముక్తం స్యాత్
జ్వలితం క్రూరసంయుతం।
ధూమితం క్రూరమూర్ధస్థం
త్యజేద్రాశీ స్థలాశ్రితాన్ ॥

తా॥ క్రూరగ్రహముచే విడువబడిన
త్రము 'దగ్ధము' క్రూరగ్రహముతో కూడియు
నక్షత్రము "జ్వలితము" క్రూరగ్రహమున్న
త్రమునకు పైనున్న నక్షత్రము "ధూమితము"
సంజ్ఞ. ఇట్టినక్షత్రములును పాపగ్రహసంబంధము
లగ్నమును, రాశియు శుభకార్యములయం
పనికిరావు.

## అపవాద

శ్లో॥ ఋక్షాణి క్రూరవిద్ధాని క్రూరయుక్తాని యాని చ।
చంద్రభుక్తవిముక్తాని శుభార్హాణి విదుర్బుధాః ॥

తా॥ క్రూరగ్రహవేధగలనక్షత్రము క్రూ
గ్రహముతో కూడియున్న నక్షత్రమును చం
భుక్తముక్తై విడువబడినచో శుభార్హము
చున్నవి.

## 19 అకాలగర్జితవృష్టదోషము

శ్లో॥ పుష్యాదిషు చతుర్మాసు యా వృష్టి స్తదకాలజా ।
న చే దదోషా సా వృష్టిః పశుమర్త్యపదాంకితా ॥

తా॥ పుష్య, మాఘ, ఫాల్గున, చైత్ర మాసములు నాల్గింటియందును కురిసిన వర్షము అకాలవృష్టి అనబడును; ఆవృష్టి పశువులయొక్క యు, మనుష్యులయొక్కగాని పాదచిహ్నము లేర్ప డనిదైనచో దోషప్రదము కాదు. అనగా పువ్వారమువంటి తుంపర దోషము కాదనుట.

## 20-21 వ్యతీపాతవైధృతిదోషములు

శ్లో॥ యస్మిన్వారే మహాపాతః వైధృతి స్తం వివర్జయేత్ ।
తదహస్సు గుణం వాపి దంపత్యోర్మృత్యుదం భవేత్ ॥

ఏరోజున వ్యతీపాతగాని, వైధృతిగాని వ్యాపించి యుండునో ఆరోజు ఎన్నిసుగుణములు కలదైనను దంపతులకు మృత్యుప్రదముగాన వివా హము పనికిరాదు.

### అ ప వా ద

శ్లో॥ త్రింశత్పాతే వైధృతౌ పక్షమంతే
వజ్రే ఖండా స్సప్తశూలే విహ్యాత్య ।

షట్గండే చాతిగండే చ బాణాః
విష్కే ఘాతే పారిఘే త్రీణి త్రయః ॥

వ్యతీపాత 30, వైధృతి 15, వజ్రం 9, శూ
7, గండం 6, అతిగండం 6, విష్కంభం 5, వ్యాఘా
తం 3, పరిఘ 3, ఈప్రకారము ఆయా యోగము
యందు మొదటి ఘడియలను విడిచి ఆపై ఘ
యలలో శుభమును చేయవచ్చును.

## స్వ ల్ప దో ష ము లు

శ్లో॥ వృష్ట్యభ్రభద్రిమణాభ్రఘోషపరిధిబద్ధేందువర్ణాన్వితా
విద్యుచ్చాపహిమప్రతీందురవిదిగ్ధూమాదయః కాలజా
దుర్యోగా బహవశ్చ దుష్టశకునం దుస్స్వప్నదుర్వీక్ష
దుర్వాక్యశ్రవణంచ దుష్టమరుతో దుఃఖప్రదా మంగళే

వర్షము, మేఘాడంబరము, ఉరుము, సూర్య
చంద్రపరివేషము (సూర్యచంద్రులు గుడి కట్టుట)
సూర్యుడు చంద్రునివలె వెలవెలబారియుండుట
మెరుపు, ఇంద్రధనుస్సు, మంచు, ప్రతిచంద్రుడు
ప్రతిరవి దిగ్ధూమము, తోకచుక్క, పెనుగాలి మొద
లైన దుర్యోగములు, దుస్స్వప్నము, దుశ్శకునము
దుష్టవస్తుదర్శనము, దుర్వాక్యశ్రవణము ఇవి
మంచివి కావు.

శ్లో॥ ఋక్షోల్కాశనిపాతనాని గురుభృగ్వస్తోన్యవస్యసప్తస్థితిః
దిగ్దాహోయమకంటకశ్చ గుళికావ్యర్ధపరిహారా స్తతః ।
లత్తోపగ్రహసౌమ్యవిద్ధఖచరా శ్శూన్యాఖ్యతిథ్యాదయో
దగ్ధాఖ్యా అపి పంగుకాణబధిరాఖ్యాంధాఖ్యలగ్నాదయః ॥

నక్షత్రములు, బొగ్గులు, పిడుగులుపడుట, గురుశుక్రులు లొకరికొకరెదురై యుండుట, దిక్కులు మంటవలె భగభగలాడుట, యమకంటకము, గుళిక అర్ధపరిహారము, లత్తలు, సర్వతోభద్ర, చక్రోక్తోప గ్రహములు, పంచశలాకచక్రోక్త సౌమ్యగ్రహ వేధ, ఖచరయోగము, శూన్యతిథి, వారనక్షత్ర ములు, దగ్ధతిథివారనక్షత్రములు, పంగుకాణబధి రాంధ, లగ్నతిథివారనక్షత్రములు ఇవి పనికిరావు.

## దోషములకు దేశవ్యవస్థ

శ్లో॥ ప్రోక్తావిస్తరభీతితశ్చ కతిచిత్స్వల్పాశ్చ దోషామయా
సౌరాష్ట్రాంగకళింగవంగమగధావంతీషు కాశ్మీరకే ।
గౌడద్రావిడసాల్వమధ్యమకురుమ్లేచ్ఛేషు దేశేషు తే
బాహ్లీకాదిషు మంగళే నిధనదా శ్శేషే తు దేశే శుభాః ॥

స్వల్పదోషము లనేకములున్నను వాటిలో కొన్నిమాత్రమే చెప్పబడినవి. ఈ స్వల్పదోష ములు, సౌరాష్ట్ర, అంగ, వంగ, కళింగ, మగధ,

అవంతి, కాశ్మీర, గౌడ, ద్రావిడ, సాల్వ, మగ
కుకు, మ్లేచ్ఛ, బాహ్లీక దేశములయందే గాని
తర దేశములయందు వర్తింపవు.

## మరికొన్ని స్వల్పదోషములు

శ్లో॥ స్థూణాంధోష్ణశిఖార్ధపాతకులికా నిమ్నా శిఖా కంట
జ్వాలాంశాడలఘాతకూపఘటికానిర్జీవతారోడుజాః,
పక్షచ్ఛిద్రదినామయోడుకుహరాహర్గండరాహ్వాదయః,
సంధ్యాదుర్దినమృత్యుయోగజముఖా దోషా న పుణ్యక్షి

స్థూణాదోషము, అంధదోషము, ఉష్ణి
దోషము, అర్ధపాతదోషము, కులికాదోష
నిమ్ననాడీదోషము, శిఖాకంటకదోషము, జ్వా
దోషము, అంశదోషము, అడలదోషము, ఘా
దోషము, కూపనాడికాదోషము, నిర్జీవన
దోషము, పక్షచ్ఛిద్ర తిథిదోషము, దినగతదోష
నక్షత్రకుహరదోషము, దినగండదోషము, రా
కేతుదోషము, సంధ్యాదోషము, దుర్దినదోష
మృత్యుయోగదోషము- అను ఈ దోషము
ఆర్యావర్త దేశమునకు వర్తింపవు. ఈ దోషము
ముహూర్తదర్పణ, ముహూర్తచింతామణి, విద
మాధవీయాదులయందు ప్రకటితములు.

## మరికొన్ని దుష్టయోగములు

శ్లో॥ గ్రామే వ్యాధిసమాకులే మృతదినే యస్యాపికస్యాపివా
పాపిండే దహనే గృహస్య దివసే శక్త్యుత్సవాహస్యపి।
ఖేటాస్తోదయయో ర్ద్వినత్రయమితః పశ్చాత్పురస్తాత్తథా
క్ష్మాకంపాశనిపాతయోస్తు పరత శ్చాహ్నాత్రయం వర్జ
యేత్॥

కలరా, మశూచి మున్నగు వ్యాధులచే గ్రామము అల్లకల్లోలముగా నున్నప్పుడు, గ్రామమునందు ఎవరైనను మృతినొందినరోజు, దినవారము జరుగురోజు, శవదహనము జరిగినరోజు, ఇల్లుకాలిపోయిన రోజు, గ్రామదేవతయొక్క జాగరపు రోజు (క్రొత్త అమ్మవారిని నిలువబెట్టిన రోజులు), గ్రహముల యొక్క ఉదయాస్తమయములకు ముందు వెనుకలను మూడురోజులు, భూకంపము, పిడుగుపాటు వీటికి పరమందు 3 రోజులు ఇవియు శుభములయందు పనికిరావు.

## ఇందలి విశేషము

శ్లో॥ శవదాహే గ్రామదాహే సపిండీకరణే తథా।
శక్త్యుత్సవే చ సంక్రాంతౌ న గచ్ఛే త్పరవాసరే॥

శవదహనముజరిగినరోజు, గ్రామము కాలి

పోయినరోజు, దినవారము జరిగినరోజు, గ్రామస్థ
జాగరము జరిగినరోజు, సంక్రాంతిపండుగరో
వీటికి మరుచటిరోజునకు 'కనుము' అను సంజ్ఞ
ఆరోజున ప్రయాణములు పనికిరావు.

## దగ్ధయోగములు

శ్లో॥ బుధతృతీయాకుజపంచమీ చ
షష్ఠీగురావష్టమిశుక్రవారః ।
ఏకాదశీందుశ్చ శని ర్నవమ్యాం
దగ్ధా అమీ ద్వాదశిభానువారః ॥

తదియా బుధవారము, పంచమి మంగళ
వారము, షష్ఠి గురువారము, అష్టమి శుక్రవారము
ఏకాదశి సోమవారము, నవమి శనివారము, ద్వాదశి
ఆదివారము ఇవి దగ్ధయోగసంజ్ఞ కలవి.

## పంచకదోషము

శ్లో॥ తిథివారోడులగ్నానాం సంఖ్యా మేకీకృతాం హరేత్
నవభి రేవం శిష్టాంకైః దోషపంచక మున్నయేత్ ॥

తిథి, వార, నక్షత్ర, లగ్నములయొక్క
ఏకముచేయబడిన సంఖ్యను 9 చే భాగించి మి
లిన సంఖ్యలద్వారా చెప్పబోవు ప్రకారము
దోషపంచకము నూహింపవలెను.

శ్లో|| ఏకో మృత్యుశ్చ ద్వయం వహ్నిః చత్వారో రాజపంచకం
షట్చోర అష్టౌ రోగ స్స్యాత్ ఇత్యేవం దోషపంచకమ్ ||

1 మిగిలిన మృత్యుపంచకము, 2 మిగిలిన అగ్నిపంచకము, 4 మిగిలిన రాజపంచకము, 6 మిగిలిన చోరపంచకము, 8 మిగిలిన రోగపంచకము అని తెలియవలయును.

## అ ప వా ద

శ్లో|| చోరం రోగం త్యజేద్రాత్రౌ దివా రాజాగ్నినామకం |
అర్ధరాత్రే త్యజేన్మృత్యుం పంచకం యత్ర దృశ్యతే ||

రాత్రిభాగమున చోరపంచక, రోగపంచకములును, పగటిభాగమున రాజపంచక, అగ్నిపంచకములును, అర్ధరాత్రమున మృత్యుపంచకమును పనికిరావు.

శ్లో|| సేవాయాం రాజకం మార్గే
చోరం రాజానలౌ గృహే |
మౌంజీబంధే తథోద్వాహే
రోగం మృత్యుం చ వర్జయేత్ ||

ఉద్యోగనిమిత్తమున రాజపంచకము, ప్రయాణమున చోరపంచకము, నూతన గృహప్రవేశమున రాజపంచక, అగ్నిపంచకములును ఉపనయన, వివా

హాములయందు రోగపంచక, మృత్యుపంచక
లును పనికిరావు. ముహూర్తదర్పణమందు ఈ
ఒకటి మాత్రమే చెప్పబడియున్నది. తదిత
లైన ముహూర్తచింతామణ్యాది గ్రంథ
యందు ఆరుపద్ధతులు నిరూపింపబడియున్నవి.

## పత్రికాంతరము

శ్లో॥ తిథివారోడులగ్నైక్యం తదేవ ధ్రువకాన్వితం,
లగ్నం సేతతిథీత్యేవం త్రిధా బహుభి రీక్ష్యతే॥

(1) తిథి, వార, నక్షత్రలగ్నసంఖ్య
నేకము చేసియు, (2) వీటిలో ధ్రువక సంఖ్యను
పియు, (3) లగ్నసంఖ్యను శుద్ధపాడ్యమి
యతు గతించిన తిథుల సంఖ్యను కలిపి
ఈ విధముగా చాలమందిచే పంచకరహిత
మూడువిధములుగా చూడబడుచున్నది. వీటి
ఏదో ఒక విధముచే పంచకరహితము లభ్యమగు
న్నందున అనేకులు పంచకరహితవిషయమును
బెట్టుటలేదు. పంచాంగకర్తలు, ముహూర్తదర్
పద్ధతి నవలంబించియే పగటి ముహూర్తమ
యందు చోరపంచక, రోగపంచకములను; రా
ముహూర్తములయందు రాజపంచక, వహ్నిపం

కమును సూచింపుచున్నాను. ఈ పంచకరహితము ఏకవింశతి మహాదోషములలో నిదికాదు.

## మేషాదులకు ధ్రువకాంకములు

శ్లో॥ అబ్ధిబాణాగమపాత్రిణా వేదవహ్నీక్షణేందవః ।
అకాశేంద్వంబకగుణాః మేషాదీనాం ధ్రువాస్స్మృతాః॥

మేషమునకు 4, వృషభమునకు 5, మిథునమునకు 6, కర్కాటకమునకు 5, సింహమునకు 4, కన్యకు 3, తులకు 2, వృశ్చికమునకు 1, ధనుస్సుకు 0, మకరమునకు 1, కుంభమునకు 2, మీనమునకు 3 ధ్రువకాంకములు.

## ధ్రువకాంకావశ్యక కార్యములు

శ్లో॥ కృషిప్రయాణవాణిజ్యతటాకద్రవ్యసంగ్రహే ।
సత్రేచేశప్రతిష్ఠాయాం రహితం ధ్రువకాన్వితమ్ ॥

ఉద్యోగ వ్యవసాయాదులు, ప్రయాణము, వర్తకము, తటాక ప్రతిష్ఠ, ధనసంబంధవ్యవహారము, సత్రనిర్మాణము, ఈశ్వరప్రతిష్ఠ- వీటియందు ధ్రువకాంకములను కలిపి రహితమును చేయవలయును.

## నక్షత్రాదులయందు త్యాజ్యకాలము

శ్లో॥ ఆద్యంతేద్విఘటీస్త్యాజ్యాత్ మాసాంతేదివసత్రయం
వర్షాంతే పక్షం షష్ఠ్యంతే మాసషట్కం తదర్ధకమ్॥

నక్షత్రాద్యంతములయందు 2 ఘడియలు, మాసాంత మందు 3 రోజులు, సంవత్సరాంతమందు చివర (24వ) పక్షము, అక్షయ సంవత్సరమందు 6 మాసములుగాని, పక్షాంతరముచే 3 మాసములు గాని శుభములయందు విడువవలయును.

## తారాబలక్రమము

శ్లో॥ జన్మసంపద్విపత్క్షేమప్రత్యక్సాధననైధనం।
మిత్రం పరమమిత్రం చ నవతారాః ప్రకీర్తితాః॥

జన్మనక్షత్రమునుండి వరుసగా 1 జన్మతార, 2 సంపత్తార, 3 విపత్తార, 4 క్షేమతార, 5 ప్రత్యక్తార, 6 సాధనతార, 7 నైధనతార, 8 మిత్రతార 9 పరమమిత్రతార అని తెలియునగును.

## దుష్టతారాపవాద

శ్లో॥ ప్రథమే ప్రథమంత్యాజ్యం ద్వితీయే చ తృతీయకం।
తృతీయే పంచమం త్యాజ్యం నైధనం త్రిషు వర్జయేత్।

మొదటి నవకములో మొదటి తారయు, రెండవ నవకములో 3వ తారయు, మూడవ నవకములో 5వ తారయు దూష్యములు. నైధన తార 3 నవకములయందును దూష్యము.

## దుష్టతారలయందు త్యాజ్యఘడియలు

శ్లో॥ జన్మర్క్షే సప్తనాద్యస్తు త్రిస్తు విపది స్మృతాః ।
ప్రత్యగే నైధనే చాష్టౌ నింద్యాశ్శేషాశ్శుభావహాః ॥

జన్మతారయందు 7, విపత్తారయందు 3, ప్రత్యక్తార నైధనతారలయందు 8 ఈ ఘడియలు దూష్యములు. ఆయా తారలయందు పై లెక్క ప్రకారము మొదటిఘడియలు పోగా మిగిలియున్న ఘడియలు శుభప్రదములు.

శ్లో॥ శుభప్రదేతి నవమా తారాసు విషమాసు చ ।
ద్వికత్రికపద్యేన పూర్వకాలామృతే స్మృతమ్ ॥

బేసితారలలో నవమ (పరమమైత్ర) తార శుభప్రదమని పూర్వకాలామృతపంచమ బిందువు 203వ శ్లోకమున చెప్పబడియున్నది.

## చంద్రబలవిషయము

శ్లో॥ జన్మనక్షత్ర మారభ్య పశ్యే త్తారాబలం తథా ।
జన్మరాశిం సమారభ్య పశ్యేచ్చంద్రబలం సదా ॥

తారాబలమును జన్మనక్షత్రమునుండియు
చంద్రబలమును జన్మరాశినుండియు చూడవలె

## దుష్టతారలకు దానములు

శ్లో॥ శాకం గుడం చ లవణం సతిలం కాంచనం తథా
దత్తం చేద్యది తద్దోషం న కించి దవశిష్యతే॥

తా॥ జన్మతారకు శాకము (కూరగాయలు
కాదు), విపత్తారకుగుడము (బెల్లము), ప్రత్యక్తార
లవణము (ఉప్పు), నైధనతారకు సువర్ణసహితమైన
కూడిన తిలదానము గావింపబడినచో ఆదోష
పూర్తిగా తొలగును.

## వివాహిత స్త్రీరజస్వలావిషయము

శ్లో॥ యామ్యార్ద్రాగ్నిపునస్సర్పమఘాజ్యేష్ఠభగత్రయే।
భర్తుర్జన్మర్క్షరంధ్రేందౌ దోషస్స్యాత్ప్రథమార్తవే

తా॥ వివాహముకాబడిన స్త్రీ భరణి ఆర్ద్ర
కృత్తిక పునర్వసు ఆశ్రేష మఘ జ్యేష్ఠ పుబ్బ
పూర్వాషాఢ పూర్వాభాద్రలయందును, భర్త
యొక్కజన్మనక్షత్రమునకు 8ట చంద్రుండుండగా
(8వనక్షత్రమందు) రజస్వలయ్యేనేని దోషముగా
శాంతిని గావింపనగును.

## దోషాదులకు శాంతికాలనిర్ణయము

శ్లో॥ విషే రోగే యథైవాశు మణిమంత్రౌషధాదికం ।
గృధ్రహస్తమృతర్క్షేషు వినాశాంతిం చరేద్ద్రుతిమ్ ॥

తా॥ పక్షిదోషము (ఇంటిపైన గెద్ద, రాబందు, గుడ్లగూబ, తేలుపుపిట్ట వాలుట) మొండి చెయ్యి, మృతనక్షత్రము వీటియందు మినహాగా విషప్రయోగము, వ్యాధి తటస్థపడినప్పుడు, వెంటనే మణి మంత్రౌషధాదుల నుపయోగించి నట్లే, దుష్టనక్షత్రాది దోషశాంతులును వెంటనే గావింపతగినవి.

శ్లో॥ విధ్యుక్తదివసే శాంతిం పూర్ణాహుతిపురస్సరం ।
కుర్యాత్కుజే భృగౌ వాపి న పీతాదిమహాశ్చరేత్ ॥

తా॥ జనన, రజస్వలాది శాంతులయందు విధ్యుక్తదివసము, మంగళవారము లేక శుక్రవారముగాని అయినను పూర్ణాహుతిపూర్వకముగా నవగ్రహశాంతి నాచరింపవలయును. పసుపు, కుంకుమతో కూడినసారిని గ్రామమున పంచిపెట్టకు డదు.

## నిషేక, గర్భాధానవివరణ

శ్లో॥ నిషేక ఇతి నిర్దిష్టః సంభోగః ప్రథమార్తవే ।
తదూర్ధ్వార్తవసంభోగః గర్భాధాన మితి ద్విధా ॥

తా॥ ప్రథమరజస్వలాస్నానదినము మొదలు 13 రోజులలోగా గావింపబడినది నిషేధకము అనియు, తదనంతరము గావింపబడినది గర్భాధానమనియు శాస్త్రనిర్ణయము.

## రజస్వలానంతరవివాహిత స్త్రీగర్భాధాన విషయము.

శ్లో॥ వివాహాత్ షోడశాహస్సు తారాబలయుతే దినే,
గర్భాధానం చరం త్యద్య పర్వాన్ త్యక్త్వాఖిలత్రిచ॥

తా॥ రజస్వలానంతర వివాహితస్త్రీలకు వివాహదినము మొదలు 16 రోజులలోగా పర్వదినములను విడిచి లగ్నవిచారణతో పనిలేకుండ తారాబలసమన్వితమైయున్నరోజున దేశమంతటను గర్భాధానము నెరవేర్పబడుచున్నది.

## పంచపర్వములు.

శ్లో॥ కృష్ణాష్టమీ చతుర్దశ్య ప్యమావాస్యా చ పూర్ణిమా।
సంక్రాంతిః పర్వతిథయః పంచ పర్వా ఇతి స్మృతాః॥

తా॥ కృష్ణపక్షమునందలి అష్టమి చతుర్దశి అమావాస్య పూర్ణిమ సంక్రమణప్రవేశతిథి ఇవి పంచపర్వములని మహర్షులచే చెప్పబడినది.

## పక్షఛిద్రతిథులు

శ్లో॥ అష్టమీ ద్వాదశీ షష్ఠీ చతుర్థీ చ చతుర్దశీ ।
పక్షఛిద్రాశ్చ తిథయః శుభకార్యేషు నిందితాః ॥

తా॥ అష్టమి, ద్వాదశి, షష్ఠి, చతుర్థి, చతుర్దశి- ఈతిథులు పక్షచ్ఛిద్రములు అనుసంజ్ఞగలవిగాన శుభకార్యములయందు నిందితములు.

## పత్నీసంగమదూష్యకాలము

శ్లో॥ వైధృతౌ చ వ్యతీపాతే దివా విష్ట్యాం చ పర్వసు ।
ఆబ్దికాశౌచసంధ్యాసు పత్నీసంగం పరిత్యజేత్ ॥

వైధృతి, వ్యతీపాత, పగటిభాగము, విష్టి కరణము, పర్వదినములు, ఆబ్దికదినము, జాతాశౌచ మృతాశౌచదినములు, సంధ్యాకాలము- వీటి యందు భార్యాసమావేశము పనికిరాదు.

## షోడశకర్మలు

శ్లో॥ గర్భాధానం పుంసవనం సీమంతం జాతకర్మ చ ।
నామాన్నప్రాశనం చౌలం మౌంజీవ్రతచతుష్టయమ్ ॥
గోదానం స్నాతకం చైవ వివాహం పైతృమేధికం ।
ఏతే షోడశసంస్కారాః త్రివర్ణానాం ప్రకీర్తితాః ॥

(1) గర్భాధానము (2) పుంసవనము (3) సీమంతము (4) జాతకర్మ (5) నామకరణము

(6) అన్నప్రాశన (7) చౌలము (8) ఉపనయన
(9) ఆగ్నేయవ్రతము (10) ప్రాజాపత్యవ్రత
(11) సౌమ్యవ్రతము (12) వైశ్వదేవవ్రత
(13) గోదానవ్రతము (గౌదానికం) (14) స్నాత
వ్రతము (15) వివాహము (16) పితృమేధము.

## లగ్నశుద్ధులు

శ్లో॥ ప్రవేశే ద్వాదశే శుద్ధిః షష్ఠశ్చైకాదశే తథా ।
ప్రాశనే దశమే శుద్ధి ర్నవ సీమంతకర్మణి ॥
వ్రతచౌలకలాగేహే చాష్టౌ సప్తమముద్వహే ।
వస్త్రభైషజ్యయోష్షష్ఠే ప్రయాణేపి చ పంచమే ॥
ఆక్రమేతు చతుశ్శుద్ధి స్తృతీయే క్రయవిక్రయే ।
ధనకృత్యే ద్వితీయే చ లగ్నశుద్ధిశ్చ సంగమే ॥

నూతనగృహప్రవేశమందు 12, ఉద్యోగా
రంభమందు 11, అన్నప్రాశనయందు 10, సీమంత
మందు 9, ఉపనయన, చౌల, విద్యాగృహారంభ
ములయందు 8, వివాహమందు 7, నూతనవస్త్ర
ధారణ వైద్యారంభములయందు 6, ప్రయాణ
మందు 5, ఆక్రమణయందు 4, క్రయవిక్రయ
ములయందు 3, ధనవ్యవహారమందు 2, గర్భా
ధానమందు 1. ఈస్థానములు శుద్ధి (గ్రహ

శూన్యములై ) ఉండవలయును. కొందరిమతములో విద్యావిషయమున 4 శుద్ధి యుండవలయును.

## గర్భాధాననిషిద్ధకాలము

శ్లో॥ జన్మర్క్షం చాష్టమే చంద్రః పాపస్థోడుశ్చ సంగమే ।
అశ్వియమోరగమఘామూలేంద్రాంత్యాశ్చ నిందితాః ॥

భార్యాభర్తలయొక్క-జన్మనక్షత్రము, జన్మలగ్నజన్మరాసులకు 8వ యింట చంద్రుడు, పాపగ్రహాశ్రితనక్షత్రము అశ్విని, భరణి, ఆశ్లేష, మఘ, మూల, జ్యేష్ఠ, రేవతి గర్భాధానమందు పనికిరావు.

## గ్రహములకు క్రూరత్వాదినిర్ణయము

శ్లో॥ క్రూరాభానుతమశ్శనిధ్వజకుజాశ్శుక్రార్యసౌమ్యేందవః
సౌమ్యాస్తే పురుషాః కుజార్క-గురవో రాహ్వందుశుక్రాః
స్త్రియః ।
తచ్ఛేషాస్తు నపుంసకా గురుభృగూ విప్రౌ కుజార్కౌ-
నృపౌ,
వైశ్యౌ చంద్రబుధౌ తదన్యకులజో మందస్తు వర్ణే
శ్వరః ॥

రవి, కుజ, శని, రాహు, కేతువులు పాపులు. శుక్ర, గురు, బుధ, చంద్రులు శుభులు. కుజుడు,

రవి, బృహస్పతి పురుషులు. రాహువు, చంద్రుడు, శుక్రుడు స్త్రీగ్రహములు. బుధ, శని, కేతువు నపుంసకులు. బృహస్పతిశుక్రులు బ్రాహ్మణులు, కుజుడు, రవి క్షత్రియులు. చంద్రబుధులు వైశ్యులు. శని తనకంటె తక్కువైన సవర్ణములకు పతి అయిన శూద్రుడు.

## గర్భిణ్యాదినియమము

శ్లో॥ రజోవయస్థ్సితా నారీ ప్రమదా గర్భధారిణీ ।
న పశ్యే చ్ఛాంతిహోమాదీన్ తదన్నం నైవభక్షయేత్

రజస్వలవయసు వచ్చిన వివాహితస్త్రీయును గర్భిణీస్త్రీయును శాంతిని, శాంతి సంబంధమైన హోమాదులను, జపాభిషేకాదులను చూడరాదు శాంతిభోజనమునకు వెడలకూడదు; ఆ అన్నము తినకూడదు.

## గర్భిణీపతినియమము

శ్లో॥ గృహం యాత్రాం నదీస్నానం వపనం శ్రాద్ధభోజన
ఆసప్తమాసా త్త్యజేత బ్రహ్మత్వం గర్భిణీపతిః

గర్భవతియొక్క భర్త భార్యకు 7వమాసము వచ్చినది మొదలు శంకుస్థాపన, తీర్థయాత్ర,

స్నానము, క్షౌరము, శ్రాద్ధభోజనము పౌరో హిత్యము- పీటిని విడువవలెను.

## సీమంతము

శ్లో॥ లగ్నే విచంద్రే నవమే చ శుద్ధే
పంచాష్టరిఃఫే ష్వశుభేషు సత్సు ।
చతుష్షడష్టాసు చ మాస్సు కుర్యాత్
సీమంతకర్మ ద్విహృదన్వితానామ్ ॥

గర్భిణీస్త్రీలకు 4, 6, 8 మాసములలో ఏదో ఒకమాసమున 5, 8, 12 స్థానములలో పాపులు లేకుండ నవమ శుద్ధిగల, చంద్రహీనాన్యలగ్నమందు సీమంతమును గావింపవలయును. సీమంతమనగా గాజులు పెట్టుట అని లోక వ్యవహారము. ఆచారములో వేసమాసములో జరుపుచున్నట్లు చూడబడుచున్నది. (పూర్వకాలామృతము ప్రథమబిందువు 15 శ్లోకం.)

## తిథి విషయము

శ్లో॥ తిథినక్షత్రవారేషు తిథిరేవ బలీయసీ ।
యస్యాం తిథౌ జని ర్మృత్యుః తస్యా ముత్సవ
మాబ్దికమ్ ॥

తిథి, నక్షత్రవారములలో జనన, మరణ

సమయములయందుగల తిథియో ప్రధానమైన
తిథిని పురస్కరించుకొనియో జన్మదినోత్సవము
ప్రత్యాబ్దికము నెరవేర్పబడుచున్నవి.

## జననమునకు శాంతినక్షత్రము

శ్లో॥ అశ్వ్యయమోవహ్నివిధీశపుష్యా
శ్లేషామఘాఫల్గునచిత్రపూర్వాః ।
మూలేంద్రకాంత్యా స్సుతజన్మకాలే
శాంత్యన్వితా స్తేషు సుతాల్పదోషః ॥

అశ్విని, భరణి, కృత్తిక, రోహిణి, ఆర్ద్ర
పుష్యమి, ఆశ్లేష, మఘ, పుబ్బ, ఉత్తర, చిత్త
విశాఖ, మూల, జ్యేష్ఠ, పూర్వాషాఢ, రేవతి- ఈ
నక్షత్రములయందు పుత్రజననమైనచో శాంతి
చేయవలయును. పుత్రికాజననమైనచో స్వల్పదో
షము. లఘుశాంతిని (ఆజ్యవేక్షణ) గావింపవల
యునని భావము. స్త్రీ పరధనముగాన ఆజ్యవేక్షణ
చాలునని ఋషుల అభిప్రాయము.

## జాతాశౌచప్రారంభము

శ్లో॥ యావన్న ఛిద్యతే నాళం తావన్నాప్నోతి సూతకం
ఛిన్నే నాళే తతః పశ్చాత్ సూతకం తు విధీయతే

శిశువు జన్మించినపిదప బొడ్డుకోయువర

పురుడు లేదు. బొడ్డు కోసిన తరువాత పురుడు ప్రారంభము.

## నెలపురిటినిర్ణయము

శ్లో॥ చత్వారింశత్త్రియ త్రింశత్ దినాని పురుషస్య చ ।
అశుచి ర్జననా న్మాతుః నాతో గచ్ఛే న్మహానసమ్ ॥

స్త్రీ జననము మొదలు 40 రోజులు, పురుష జననము మొదలు 30 రోజులు తల్లికి అశుచిగాన ఆకాలములో ఆమె వంటయింటిలోనికి వెళ్ల కూడదు.

## ఏకనక్షత్రజననశాంతి

శ్లో॥ మాతాపిత్రో రపత్యస్య భ్రాతృభగినీ స్తథైవ చ ।
జన్మనక్షత్ర మేకం చేత్ శాంతిం కుర్యా ద్యథావిధి ॥

తల్లి-పిల్లల యొక్కగాని, తండ్రి-పిల్లల యొక్కగాని, సంతానము (పురుషులైనా సరే, స్త్రీలు అయినా సరే) సోదరీసోదరులయొక్కగాని జన్మనక్షత్రములు ఒకటి అయినచో యథావిధిగా శాంతి నాచరింపవలయును.

## కవలలకు జ్యేష్ఠ, కనిష్ఠత్వనిర్ణయము

శ్లో॥ ఏకగర్భే తు యమళౌ స్త్రీవా పురుష ఏవ వా ।
కనిష్ఠ ఆద్యజాతస్స్యాత్ప్రశ్చాజ్జాతోగ్రజస్స్మృతః ॥

యదా విశర్ద్విధాభూతం వీర్యం పుష్పం పరిక్షతం ।
ద్వౌ తదా భవతో గర్భౌ సూతిర్వేశవిపర్యయః ॥

ఏకగర్భజులైన కవలలవిషయమై వీర్యము రెండు విధములుగా విడిపోయి శిశురూపమును పొంది ముందుగా ప్రవేశము కాబడిన వీర్యము ప్రసవకాలమున వెనుకను, వెనుక ప్రవేశము కాబడిన వీర్యము ముందుగాను జన్మించునుగాన ఇట్లు నిర్ణయింపబడినది.

## రోహిణినక్షత్రజననవిషయము

శ్లో॥ రోహిణ్యాం భాగనేయస్య జననే సతి మాతులః ।
దృష్ట్వా శిశుముఖం తైలే కుర్యా ల్లాంగలిఖండనమ్ ॥

రోహిణీనక్షత్రమున మేనల్లుడు జన్మించిన యెడల, మేనమామ నూనెలో శిశుముఖమును చూచి, కొబ్బరికాయను పగులకొట్టవలయును. ఈ ఆచారము పురాణాంతర్గతమైన (శ్రీకృష్ణకంసచరిత్ర) వలన లోకపరంపరగా వ్యాప్తమైయున్నది.

శ్లో॥ చతుర్థే మాసి శిశునా చరిత్వా దేవదర్శనం ।
గృహాన్మాతులగేహంవా మాతృష్వసృగృహం నయేత్॥

శిశువునకు నాలుగవమాసమునందలి మంచి రోజున, అభ్యంగనము గావించి అలంకరించి దేవా

లయమునకు తీసుకువెళ్ళి, దేవునిపూజించి దేవదర్శనమును చేయించి ఇంటికి తీసుకువచ్చిన పిమ్మట నుంచిరోజున బలులుదేరదీసి, మేనమామఇంటికిగాని, పినతల్లి ఇంటికిగాని, పెదతల్లి ఇంటికిగాని తీసుకొని వెళ్ళవలయును. దీనికి నిష్క్రమణము అని పేరు. ఇది జాతకర్మ, నామకరణములకంటె అతి ముఖ్యమైనది. నిష్క్రమణ అనగా జననగృహము నుండి మొదటి ప్రయాణము అని అర్థము.

ఈవిషయమును పూర్తిగా తెలియగోరువారు ముహూర్తమార్తాండ, పాలకారోహణము, భూమ్యుపవేశన,సదుగ్ధపాన, శిశునిష్క్రమణ ప్రకరణమునందు చూడవలయును.

## రాత్రివారనిర్ణయము

శ్లో॥ త్రిధా విధాయ రజనీం ద్వౌ భాగౌ పూర్వవాసరే ।
శేషం పరదినే గణ్యం మృతౌ జన్మని చార్తవే ॥

రాత్రిప్రమాణమును 3 భాగములుగా చేసి మరణము, జననము, రజస్వల- వీటియందు మొదటి 2 భాగములను పూర్వదినమందును, శేషము (3వ భాగము) ను పరదినమందును పరిగణింపవలయును.

గడియారపుటయము ప్రధానముగా

వర్తమానకాలమున ఆచరణలో లేకున్న

శాస్త్రము నిరాకరింపతగినదికానందునదినప్రమా

ణాతిప్రమాణనిర్ణయము ప్రసంగవశముచే తెల్పి

జేయుబడుచున్నది.

## దినప్రమాణము

శ్లో॥ అహస్త్వర్ధాంగనేత్రోనం తచ్ఛేషం పదసంయుతం ।
దినమానం త్రిగుణితం విభజే త్కాలనిర్ణయమ్ ॥

దినప్రమాణములోనుండి 26½ను తీసివేయ

మిగిలిన ఘడియలను పాదఛాయంతో కలిపి

మొత్తముచే 3 రెట్లుగా పెంచబడిన దినప్రమాణ

మును భాగింపగా ఎంతసంఖ్యవచ్చునో పూర్వాహ్ణ

మందు అన్ని ఘడియల ప్రొద్దు గతించిన దనియు

అపరాహ్ణమందు అన్ని ఘుడియల ప్రొద్దు ఉన్నదనియు

తెలియవలయును.

60 విఛాయలు 1 ఛాయ, 60 విఘుడియలు ఒక

ఘుడియ.

## నక్షత్రస్వరూపజ్ఞానము

నక్షత్రస్వరూపజ్ఞానము ముఖ్యముగా

వానిస్వరూపము వివరింపబడుచున్నది.

## నక్షత్రస్వరూపములు

తురంగముఖాశ్వనిగుణాః = అశ్వని గుఱ్ఱపు ముఖము వలె 3 నక్షత్రములు; భరణి యోనిత్రిణి = భరణి పొయ్యివలె 3 నక్షత్రములు; క్షురాకృత్తికా షట్కం = కృత్తిక మంగలికత్తి వలె 6నక్షత్రములు; రోహిణీచక్రవత్పంచ = రోహిణి బండిచక్రమువలె 5 నక్షత్రములు; మృగశిరాశరవత్త్రియం = మృగశిర ధనుస్సువలె 3 నక్షత్రములు; ఆర్ద్రాప్రవాళమేకం = ఆర్ద్ర పగడమువలె 1 నక్షత్రము; పునర్వసుర్నౌకవత్సప్త = పునర్వసు పడవవలె 7 నక్షత్రములు; పుష్యమీశరటవత్త్రిణి = పుష్యమి పొట్లపువ్వువలె 3 నక్షత్రములు; ఆశ్రేషాసర్పవత్సప్త = ఆశ్రేష సర్పమువలె 7నక్షత్రములు; మఘాందోళికంపంచ = మఘ పల్లకిబొంగువలె 5 నక్షత్రములు; పుబ్బ నేత్రద్వయం = పుబ్బ నేత్రములవలె 2నక్షత్రములు; ఉత్తరనేత్రద్వయం = ఉత్తర నేత్రములవలె 2 నక్షత్రములు; హస్తాపాణివత్పంచ = హస్త చేతివలె 5నక్షత్రములు; చిత్రామౌక్తికమేకం = చిత్త ముత్యమువలె 1నక్షత్రము; స్వాతీ మాణిక్య మేకం = స్వాతి మాణిక్యమువలె 1 నక్షత్రము; విశాఖా

తుల్యలచక్రవత్పంచ = విశాఖకు మ్మరిసారెవలె 5 నక్షత్రములు; అనూరాధాఛత్రవత్పంచ = అనూరాధ గొడుగువలె 5నక్షత్రములు; జ్యేష్ఠాదండవత్పంచ = జ్యేష్ఠగొడుగుకామువలె 5 నక్షత్రములు; మూలాం కుశవత్పంచ = మూల అంకుశమువలె 5నక్షత్రములు; పూర్వాషాఢోత్తరాషాఢా ద్వా ద్వా కారం మంచపుకోళ్ళవలె 4 నక్షత్రములు; శ్రవణాత్రియం = కావిడిబద్దవలె 3 నక్షత్రములు; ధనిష్ఠ మృదంగాకారం పంచ = మృదంగంవలె 5 నక్షత్రములు; శతభిషం శతతారకం = గుంపువలె 100నక్షత్రములు; పూ. భా. ఉ. భా. ద్వే ద్వే ఖట్వాం = మంచపుకోళ్ళవలె 4 నక్షత్రములు; రేవతి మత్స్యాకారం సప్త = చేపవలె 7 నక్షత్రములు.

## శిరోగతనక్షత్రనిర్ణయము

శ్లో॥ జ్యేష్ఠాదీనా మతిక్రమ్య పౌష్ణాదీనామనాగమే ।
ఆర్ద్రాదీనాం శమం కుర్యాత్ నవషడ్ద్వాదశ క్రమాత్ ॥

జ్యేష్ఠ మొదలు 9 నక్షత్రములు శిరోగతమును దాటిన పిమ్మటను, రేవతి మొదలు 6 నక్షత్రములు శిరోగతము కాకముందును; ఆర్ద్ర మొదలు

13 నక్షత్రములు శిరోగతములైనప్పుడును ఉచ్చ అని తెలియవలయును. ఉచ్చ అనగా ధ్రువనక్షత్రమున కెదురుగా నిలువబడి ఆకాశమధ్యభాగమును రెండుకనుబొమ్మల మధ్యనుండి (ధ్రువరేఖలో) చూచుట.

## రాత్రిప్రమాణము

| ప్రాచీనపద్ధతి | | ఆధునికపద్ధతి | |
|---|---|---|---|
| శ్రవణామేషేరత | 2_06 | శ్రవణామేషేకోదేవాః | 1-48 |
| శ్రవిష్ఠావృషభేనభ | 0_04 | శ్రవిష్ఠామేషేగోధీరాః | 3_22 |
| శతభిషగ్వృషభేరామ | 2_05 | శతభిషగ్వృషభేవోమరాః | 4-25 |
| అజైకపాన్మిధునేపర | 1_02 | పూర్వాభాద్రామిధునేనోలఘుః | 0_33 |
| అహిర్బుధ్నిమిధునేభాను | 4_00 | ఉత్తరాభాద్రామిధునేరంజరాః | 2_28 |
| రేవతీకర్కియజ్ఞ | 1_05 | రేవతీర్కిసజీగః | 0_38 |
| అశ్వినీకర్కిరూప | 2_01 | అశ్వనీకర్కికంరామ | 1_52 |
| భరణీకర్కిశాబ | 5_03 | భరణీకర్కిభోగః | 4_03 |
| కృత్తికాసింహేకాయ | 1_01 | కృత్తికాసింహేకోనఖాః | 1_20 |
| రోహిణీసింహేగురు | 3_02 | రోహిణీసింహేలోగురుః | 3_23 |

| | | | |
|---|---|---|---|
| మృగశిరాకన్యానేయ | 0_01 | మృగశిరాసింహేమోహితాః | 5_1 |
| ఆర్ద్రాకన్యాయుత | 1_06 | ఆర్ద్రాకన్యాకర | 1_02 |
| పునర్వసుస్తులానీల | 0_03 | పునర్వసూతులానోధవః | 0_49 |
| పుష్యస్తులారామ | 2_05 | పుష్యస్తులారదేవాః | 2_41 |
| ఆశ్లేషాతులాభోగి | 4_03 | ఆశ్లేషాతులారోదేశాః | 2_58 |
| మఘావృశ్చికేకల | 1_03 | మఘావృశ్చికేకరయ | 1_12 |
| ఫల్గునీవృశ్చికేలత | 2_06 | ఫల్గునీవృశ్చికేమోరయః | 4_12 |
| ఉత్తరాధనుర్వామ | 0_05 | ఉత్తరావృశ్చికేశారయః | 5_12 |
| హస్తాధనుర్బల | 3_03 | హస్తాధనూరామ | 2_05 |
| చిత్రాధనుశ్శర | 5_02 | చిత్రాధనుర్భూమయః | 4_1 |
| స్వాతీమకరేకామ | 1_05 | స్వాతీమకరేకోరాయః | 1_12 |
| విశాఖామకరేవనం | 4_00 | విశాఖామకరేగానమః | 3_50 |
| అనూరాధాకుంభేనాభి | 0_04 | అనూరాధాకుంభేనోవిశ | 0_54 |
| జ్యేష్ఠాకుంభేకథ | 1_07 | జ్యేష్ఠాకుంభేఖర | 2_0 |
| మూలాకుంభేగఛ | 3_07 | మూలాకుంభేవోప | 4_0 |
| పూర్వాషాఢామీనేకవిః | 1_04 | పూర్వాషాఢామీనేరోధకః | 2_1 |
| ఉత్తరాషాఢామీనేగాధ | 3_07 | ఉత్తరాషాఢామీనేగోనఖాః | 3_2 |

8 పరకలు 1 ఘడియ = వర్గసం కేతములు, 'కాదినవ, టాదినవ, పాదిపంచ, యాద్యష్టౌ' లెక్క చూచుకొనుటలో 'క' కారము మొదలు 9, టకారము మొదలు 9, పకారము మొదలు 5, యకారము మొదలు 8. ఈప్రకారము అక్షరవారీగా చూడవలెను. ఆయానక్షత్రములు శిరోగతములైనప్పుడు ఆయాలగ్నములలో ఆయాఘడియలుభుక్తి అగును.

## పుట్టుకోరలు

శ్లో॥ సదంతజన్మని శిశో భౌమస్యార్కి-త్రియస్య చ ।
జపం శతద్వయంకుర్యాత్ ఏకైకస్య విదుర్బుధాః ।

శిశువు దంతములతో సహా పుట్టినప్పుడు కుజ శని రాహు కేతువులకు ప్రత్యేక ప్రత్యేకముగా 200 చొ॥న జపమును చేయించవలయునని పండితుల అభిప్రాయమైయున్నది. రుద్రాభిషేకము గావించుట ప్రాచీన సాంప్రదాయమై యున్నది.

## మీదిపళ్లు

శ్లో॥ ప్రాగూర్ధ్వరదనోత్పత్తౌ ఛింద్యాత్తద్రదసంఖ్యయా ।
లాంగలం వాపి కూశ్మాండం కుర్యా ద్విప్రాభిషేచనమ్ ।

శిశువునకు ముందుగా, మీదిపళ్లు మొలచి

నచో ఆసంఖ్యసంఖ్యగల కొబ్బరికాయలనుగా గుమ్మడికాయలనుగాని పగులకొట్టి పారవేసి స్నా భిషేకమును చేయించవలయును. ఇదికూడ శా నాచారమే.

## స్రావపాతనిర్ణయము

శ్లో॥ ఆచతుర్థా ద్భవేత్ స్రావః పాతః పంచమ షష్ఠయోః ఉచ్యతే, ఆసప్తమాత్ప్రసూతిస్స్యాత్ త్రిదినం స్రావపాతయోః

4 మాసములు పూర్తి యగువరకు స్రావము, పిమ్మట 6 మాసములు పూర్తియగు వరకు పాతము, అటుపైని (7వ మాసము మొదలు) ప్రసూతి. స్రావపాతములయందు రజస్వలవలెనే స్త్రీకి 3 దినములు ఆశౌచము. భర్తకును, జ్ఞాతులకును స్నానముతో శుద్ధి. 7వమాసము మొదలు (జ్ఞాతులందరికిని) దశరాత్రములు ఆశౌచము. దశరాత్రములలో శిశువు గతించినచో మృతాశౌచము స్నానముతో సరి. జాతాశౌచమును పూర్తిగా పట్టవలయును. నాభిఛేదము కాకముందు శిశువు గతించెనేని, మావితోపాటు శిశువు పాతి పెట్టబడునుగాన జ్ఞాతులకు 3 రోజులు ఆశౌచము. తల్లిదండ్రులకుమాత్రము దశరాత్రాశౌచము.

## మృతాశౌచవివరణ

శ్లో॥ ఆదంతజన్మనా త్సద్యః ఆచూడా న్నైశికీ స్మృతా ।
త్రిరాత్రమా వ్రతాదేశాత్ దశరాత్ర మతఃపరమ్ ॥

శిశువు జనించిన 11వ రోజు మొదలు 6 మాసములు నిండువరకు స్నానము. అది మొదలు 3 సంవత్సరములు నిండువరకు 1 రోజు. 4 సంవత్సరము మొదలు పురుషునికి ఉపనయనము, స్త్రీకి వివాహము అగువరకు 3 రోజులు– ఈ ప్రకారము జ్ఞాతులు మృతాశౌచము నవలంబింపవలయును. పదకొండవరోజు మొదలు ఉపనయన, వివాహములవరకు తల్లిదండ్రులకు 3 రోజులు ఆశౌచము.

శ్లో॥ జననే జననం స్యా చ్చేత్ మరణే మరణం తథా ।
పూర్వశేషేణ శుద్ధి స్స్యాత్ ఉత్తరాశౌచవర్జనమ్ ॥

జాతాశౌచమధ్యమం దింకొక జాతాశౌచము వచ్చినను, మరణాశౌచమధ్యమం దింకొక మరణాశౌచము వచ్చినను, మొదటి ఆశౌచముతోనే మధ్యవచ్చిన ఆశౌచము తొలగిపోవును గాన మధ్యవచ్చిన ఆశౌచమును పట్టనక్కరలేదు.

శ్లో॥ మృతజాతకయోర్యోగే యా శుద్ధి స్సాతు కథ్యతే ।
మృతేన శుధ్యతే జాతం న మృతం జాతకేన తు ॥

మృతాశౌచ జాతాశౌచములు రెండును ఒకసారిగా తటస్థపడినప్పుడు మృతాశౌచము జాతాశౌచము తొలగిపోవును. జాతాశౌచము మృతాశౌచము తొలగదుగాన, దుర్బలమైన జాతాశౌచమును విడిచి, ప్రబలమైన మృతాశౌచమును పూర్తిగా పట్టవలయును.

శ్లో॥ అల్పాశౌచస్య మధ్యే తు దీర్ఘాశౌచం భవేద్యది ।
న పూర్వేణ విశుద్ధి స్స్యాత్ దీర్ఘ కాలేన శుధ్యతి ॥

స్వల్పకాలాశౌచములో, దీర్ఘకాలాశౌచము పోదు. అనగా స్వల్పకాలపరిమితిగల పక్షిణ్యాశౌచములో త్రిరాత్రాశౌచమును, దశరాత్రాశౌచమును; త్రిరాత్రాశౌచములో దశరాత్రాశౌచమును వచ్చినయెడల స్వల్పకాలాశౌచమును విడిచిపెట్టి దీర్ఘకాలాశౌచము నవలంబింపవలయును.

శ్లో॥ స్వల్పకాలే మృతాశౌచే దీర్ఘం వా జాతకం భవేత్ ।
స్వల్పకాలేన శుద్ధి స్స్యాత్ న దీర్ఘేణ విశుధ్యతి ॥

స్వల్పకాల శేషముగల మృతాశౌచమందు దీర్ఘకాల శేషముగల జాతాశౌచము వచ్చెనేని జాతాశౌచమును విడిచి మృతాశౌచము నవలం

టింపవలెను. మృతాశౌతముతోనే శుద్ధిగాని జాతాశౌచప్రశంస లేదు. మరియు 10 రోజులమధ్య ఎప్పుడు విన్నను, పక్షిణిగాని, త్రిరాత్రాశౌచముగాని పట్టవలసినదేకాని, పోయినరోజును మొదలుగా ఎంచి దానికాలము అతిక్రమించినదిగాన, పట్టనగత్యము లేదు అనుపద్ధతి మనదేశాచారము కాదు. కర్తకు అశుచి పోయేవరకు (10 రోజులలోపల) మధ్యకాలములో ఎప్పుడు విన్నను ఆశౌచము తప్పదు.

## నామకరణము

శ్లో॥ ఏకాదశే ద్వాదశేహ్ని షోడశే వాథ వింశతౌ ।
ద్వావింశే వా శుభే లగ్నే శిశోర్నామ క్షిపేత్పితా ॥

శిశువు జన్మించిన 11 12 16 20 22 రోజులలో ఏదో ఒకరోజున శుభలగ్నమందు తండ్రి కుమారునికి నామకరణమును చేయవలెను. పూర్వకాలామృత ప్రథమబిందు 17వ శ్లోకంలో ఈవిధముగానే చెప్పబడినది. లగ్నశుద్ధి చెప్పబడలేదు. జాతకర్మకుకూడ ఇదే నియమము.

## పురుషునకు మాసనామములు

శ్లో॥ కృష్ణోనంతోచ్యుత శ్చక్రీ వైకుంఠోథ జనార్దనః ।
ఉపేంద్రో యజ్ఞపురుషో వాసుదేవ స్తథా హరిః ।
యోగీశః పుండరీకాక్షో మాసనామా న్యనుక్రమాత్ ॥

అర్థము సుబోధకము. చైత్రమాసాదిగా ఈ 12 సు పురుషులకు మాసనామములు.

## స్త్రీలకు మాసనామములు

శ్లో॥ మార్గశీర్షే చ వాగ్దేవీ తతః పద్మావతీ తథా।
శ్రీదేవీ చాపి సావిత్రీ భూమిః కల్యాణికా తథా॥
సత్యభామా పుణ్యవతీ రూపవతీందుమత్యపి।
చంద్రావతీ చ లక్ష్మీ శ్చ స్త్రీనామకరణా న్యపి॥

అర్థము సులభము. మార్గశిర మాసము మొదలు క్రమానుసారముగా స్త్రీలకు మాసనామములు.

## డోలారోహణ

శ్లో॥ ఆరోహయే ద్బాలక మష్టశుద్ధౌ
ఏకాదశేహ్ని ద్వాదశై కవారే।
డోలాం చ సామాన్యశుభర్క్షలగ్నే
మాసే తృతీయే చ పంచమే వా॥

సామాన్య శుభ నక్షత్రములతో కూడిన అష్టమశుద్ధిగల లగ్నమందు 11-21 రోజులలో గాని, 3-5 మాసములలో గాని శిశువును ఊయలలో పరుండబెట్టవలెను.

## జలపూజ

శ్లో॥ ఏకవింశద్దినే కూపాత్ సూతికా జల ముద్ధరేత్ ।
జలం పూతం న దోషస్తత్ పృథక్త్వితోద్ధరేజ్జలమ్ ॥

నెలపురిటి బాలింతరాలు 21వ రోజున నూతి నుండి నీటిని తోడవలయును. ఉదకము పవిత్రమై నదిగాన నీటికి దోషము లేదు. అందరితోను కలసి మెలసి తోడక వేరుగాఉండి తోడుకొనవలయును.

## కర్ణవేధ

శ్లో॥ ద్వాదశే షోడశే వాహ్ని షష్ఠే వా సప్తమేష్టమే ।
మాసి కుర్యా త్కర్ణవేధం లగ్నే శుద్ధేష్టమే శిశోః ॥

శిశువు జనించిన 12వ రోజునగాని, 16వ రోజునగాని, 6, 7, 8 మాసములలోగాని, అష్టమ శుద్ధిగల శుభలగ్నమందు చెవులు కుట్టవలయును.

## అన్నప్రాశన

శ్లో॥ షష్ఠాదిసమమాసేషు పంచమాద్యసమేపి చ ।
క్రిమాత్పుంసాం స్త్రియాం కుర్యాత్ ప్రాశనం దశమే శుచౌ ॥

పురుషులకు 6వ మాసము మొదలు సమ మాసములయందును, స్త్రీలకు 5వ మాసము

మొదలు బేసిమాసములయందును దశమశుద్ధిని కూడిన శుభలగ్నమందు అన్నప్రాశన గావింప వలయును.

## అన్నప్రాశనలగ్నగ్రహఫలం

శ్లో॥ కుష్ఠీ లగ్నగతే రవౌ తనుకలే చంద్రే సదా భిక్షుకః
పూర్ణస్థే బహుసత్రదో వనిసుతే పిత్తార్దితో జ్ఞానవాన్।
జ్ఞేజీవే బహుభోగవాన్ భృగుసుతే దీర్ఘాయురర్కాత్మజే
వాతాంగీతమసిధ్వజే వ్యసనశనీ బాలోన్నభోక్తా భవేత్॥

అన్నప్రాశన లగ్నమందు సూర్యుడున్న కుష్ఠురోగి, క్షీణచంద్రుడున్న దరిద్రుడు, పూర్ణచంద్రుడున్న అన్నప్రదాత, కుజుడున్న పైత్యరోగి, బుధుడున్న జ్ఞానవంతుడు, బృహస్పతియున్న ఐశ్వర్యవంతుడు, శుక్రుడున్న దీర్ఘాయుష్మంతుడు, శనియున్న వాతరోగి, రాహు కేతువులు ఉన్న అతి దరిద్రుడు అగును.

## కే శ ఖం డ న

శ్లో॥ ప్రథమాబ్దే తృతీయాబ్దే బాలకస్యోత్తరాయణే।
శుద్ధేష్టమే శుభే లగ్నే కేశఖండన మాచరేత్॥
సూనో ర్మాతరిగర్భిణ్యాం చూడాకర్మ న కారయేత్।
యదికుర్యా ద్విపత్తిస్స్యా ద్దంపత్యోర్వా శిశోశ్చ వా॥

ఉత్తరాయణముతో కూడిన మొదటి సంవత్సరమునగాని, మూడవ సంవత్సరమునగాని, అష్టమశుద్ధిగల శుభలగ్నమందు శిశువునకు కేశఖండన గావింపవలయును. తల్లి 5 మాసములు దాటిన గర్భవతి అయియుండగా కేశఖండన పనికి రాదు.

## విపత్కాలపక్షము

శ్లో॥ జటాపామాదిబాధాయాం వినా వర్షాయనాదికం।
కుర్వీత దేవతాగారే సహసా కేశఖండనమ్ ॥

జడలుకట్టుట, కురుపులు, విపరీతముగా పేలు పుచ్చుట, పుట్టువ్యాధి ఇత్యాది ప్రబలబాధలు తటస్థపడినప్పుడు సంవత్సరములు, ఉత్తరాయణాము వీటిని విడిచి శిశువుయొక్క ఆరోగ్యమునిమిత్తమై అప్పటికప్పుడు దేవతాగారమున కేశఖండనమును గావింపవలయును.

## షడ్జన్మనక్షత్రస్వరూపములు

శ్లో॥ జన్మర్క్షం నైధనం సప్త కర్మర్క్షం దశమం స్మృతం।
సాంఘాతికంషోడశంస్యాద్ధృతిస్సాంఘాతికాభిధమ్ ॥
త్రివింశద్వైనాశికాఖ్యం పంచవింశచ్చ మానసం।
బాలవ్రతవివాహాదీ న్న కుర్యా దేషు జాత్వపి ॥

జన్మించినది జన్మనక్షత్రమనియు, జన్మ
త్రమునకు 7వది నైధననక్షత్రము, 10వది కర్మన
త్రము, 16వది సాంఘాతికనక్షత్రము, 18వది సా
దాయకనక్షత్రము, 23వది వైనాశికనక్షత్రము,
వది మానసనక్షత్రము అని సంజ్ఞ. వీటియం
చౌలము, ఉపనయనము, వివాహము మున్న
శుభములు ఎన్నడును పనికిరావు.

## షడ్జన్మనక్షత్రములసూక్ష్మప్రతిపాదన

శ్లో॥ పంచవింశత్త్రివింశచ్చా వ్యష్టాదశ చ షోడశ।
దశసప్తషడేతాని శుభే నింద్యాని జన్మవత్ ॥

జన్మనక్షత్రమును, ఈజన్మనక్షత్రమునకు 2
23, 18, 16, 10, 7– ఈ 6 నక్షత్రములును జన్మన
త్రమువలెనే శుభములయందు కూడవు.

## క్షౌరానర్హ తిథులు

శ్లో॥ ఆద్యశ్చతుర్థీ షష్ఠ్యష్టౌ నవమీ చ చతుర్దశీ।
పూర్ణిమాచైవ సంక్రాంతిః క్షౌరకర్మణి నిందితాః

1, 4, 6, 8, 9, 14, 15, 30 ఈ తిథు
యందును, మేషాది సంక్రమణ దినములయందు
క్షౌరము పనికిరాదు.

## క్షౌరయోగ్యనక్షత్రములు

శ్లో॥ అశ్వీమృగపునఃపుష్యకరత్రయహరిత్రయం ।
జ్యేష్ఠా చ రేవతీ చేతి ప్రశస్తాః క్షురకర్మణి ॥

అశ్విని, మృగశిర, పునర్వసు, పుష్యమి, హస్త, చిత్త, స్వాతి, జ్యేష్ఠ, రేవతి ఇవి క్షౌరమునకు ప్రశస్తములు.

## విశేషవిధి

శ్లో॥ అక్షౌరతిథినక్షత్రే కుర్వీత బుధసోమయోః ।
సుక్షౌరతిథినక్షత్రే న కుర్యాచ్ఛనిభౌమయోః ॥

పర్వదినములుగాకుండ క్షౌరమునకు చెప్పబడని తిథి, నక్షత్రములైనప్పటికిని బుధవార,సోమవారములయందు క్షురకర్మ పనికివచ్చును. క్షౌరమునకు ప్రశస్తములైన తిథినక్షత్రములతో కూడియున్నను శనివార, మంగళవారములు పనికిరావు.

శ్లో॥ మాతుశ్చతుర్థీ భగినీ చతుర్దశీ
భ్రాతుశ్చ షష్ఠీ పితురేవ పర్వసు ।
అదౌ నవమ్యాం ధనధాన్యహానిః
కుటుంబహానిః క్షౌరాష్టమేషు ॥

చవితి తల్లికి, చతుర్దశి సోదరికి, షష్ఠి సోదరు

గరిమెళ్ళ రామకృష్ణశాస్త్రి (పురోహిత్)

లకు, పర్వదినములు తండ్రికి, పాడ్యమి, నవమి ధనధాన్యములకు, అష్టమి కుటుంబమునకు హానికరములుగాన వీనియందు క్షౌరము కూడదు.

శ్లో॥ అధికారపదస్థానాం పంచమే పంచమేహని।
మహాపర్వదినం త్యక్త్వా యుక్తం చుబుకశోధనమ్॥

ఉద్యోగులు మహాపర్వదినములను విడచి ప్రతి 5 రోజులకును గడ్డమును కేశరహితముగా గావించుట యుక్తము.

శ్లో॥ రాజకార్యనియుక్తానాం నటానాం వేషధారిణాం।
శ్మశ్రుగండనఖచ్ఛేదే నైవ కాలవిశోధనమ్॥

మహారాజసన్నిధానమందు పనిచేయు ఉద్యోగులు, నటులు, వేషధారులు- వీరికి మీసములు, గడ్డము, గండస్థలము (చెంపలు) గోళ్లు గొరిగించుకొనుటకు కాలనియమముతో పనిలేదు.

శ్లో॥ శుభాత్పూర్వదినే వర్జ్యతిథితారాన్వితేపి వా।
క్షౌరం శుభకరమితి పూర్వకాలామృతస్మృతిమ్॥

వివాహాదిశుభకర్మలకు పూర్వదినము (వెనకరోజు) నిషిద్ధతిథినక్షత్రములతో కూడియున్నను క్షౌరము శుభకరమని పూర్వకాలామృత నాలుగవ బిందువందు చెప్పబడియున్న

ఉనిర్ణయమువరునికిని, వటువునకును, ఆచార్యునకు మాత్రిసే అనియు, ఉపనయనమునకు వెనుకటి రోజుగాక మరొకప్పుడు తండ్రికిని, కొడుకునకును ఒకేరోజున క్షౌరము పనికిరాదనియు తెలియవల యును. వటువునకు పంచశిఖలు ఉంచే కల్పంలో వెనుకటిరోజున క్షౌరమును విసర్జింపనగును.

శ్లో॥ స్నానం రజకతీర్థేషు క్షౌరం నాపితమందిరే ।
విద్యాలయే చ శయనం భోజనం న శివాలయే ॥

చాకిరేవుయందు స్నానము, మంగలి ఇంటి వద్ద క్షౌరము, విద్యాలయమందు పడక, శివాలయ మందు భోజనము కూడదు.

## అక్షరస్వీకారము

శ్లో॥ ఉదగర్కే పంచమేబ్దే తదబ్దే మాసి పంచమే ।
దివసేపి చ బాలానాం అక్షరగ్రహణం స్మృతమ్ ॥

శిశువునకు 5వ సంవత్సరములోని ఉత్తరా యణమును (5) సంవత్సరము 5వ మాసమును 5వ రోజును అక్షరాభ్యాసమునకు అతి ప్రశస్తము.

## ఉపనయనవాదిశుభకార్యక్రమము

శ్లో॥ ముండనా న్మండనం కుర్యాత్
మండనా న్నతు ముండనం ।

న కుర్యా దేకజన్యానాం
వ్రతోద్వాహౌ వృతుత్రయే ॥

ఉపనయనానంతరము వివాహము చేయ
వచ్చును. వివాహానంతరము ఉపనయనము
పనికిరాదు. ఏకగర్భజనితులైన పుత్రులలో ఒక
నికి ఉపనయనము చేసిన పిమ్మట మరొకనికి ఉప
నయనమును, పుత్రికలలో ఒకతెకు వివాహము
చేసిన పిమ్మట మరొకతెకు వివాహమును ఆరు
మాసములకు లోపుగా చేయకూడదు.

శ్లో॥ ముండనం మీనచైత్రే తు ముండనం మేషచైత్రికే ।
ముండనం ముండనం చైవ మేషచైత్రే విధీయతే ॥

శూన్యమాససంజ్ఞగల మీనచైత్రమందు
వివాహమును, మేషచైత్రమందు ఉపనయనమును,
మేషచైత్రమందు వివాహోపనయనములను
గావింపవచ్చును.

శూన్యమాససంజ్ఞ

శ్లో॥ మీనచైత్రో ధనుః పుష్యః మిథునాషాఢకోపి చ ।
కన్యాభాద్రపదో మాసః శూన్యమాసాః ప్రకీర్తితాః ॥

అర్థము సుబోధకము.

శ్లో॥ పుష్యభాద్రపదాషాఢాః మౌఢ్యం చ గురుశుక్రయోః ।
వివాహే వర్జనీయా స్స్యుః శేషాస్తు శుభదాయకాః ॥

పుష్యము, భాద్రపదము, ఆషాఢము, గురు శుక్రుల అస్తమయము (మౌఢ్యము) వివాహమునకు పనికిరావు. మిగిలిన మాసములు వివాహమునకు శుభప్రదములు.

## శూన్యమాసాపవాద

శ్లో॥ పౌష్యో న దూష్యో మకరేణ యుక్తః
చైత్ర స్తథా మేషసమన్వితశ్చ ।
శుచశ్చ కేచి న్మిథునేన యుక్తో
వివాహకృత్యం శుభదం వదంతి ॥

మకరసంక్రమణానంతరము ఉత్తరాయణముతో కూడిన పుష్యమాసమును, మేషసంక్రమణమైనపిమ్మట శేషించిన చైత్రమాసమును, దక్షిణాయనప్రవేశము కాకముందు ఉత్తరాయణముతో కూడియున్న మిథునాషాఢమును వివాహ విషయమున శుభప్రదమని మునులు చెప్పియున్నారు. హఠాత్సిద్ధములైన ఆటంకములచే శుభకార్యములు అడ్డిపోయినవారు ఈ చెప్పబడిన మాసములయందు శుభములను జరుపుట ప్రాయి

క్షమై యున్నది. ఇందెంతమాత్రము దోషము
లేదు.

## ఉపనయనకాలము

శ్లో॥ త్రయాణాం ముఖ్యకాల స్స్యాత్
అష్టాయద్వాదశ క్రమాత్ ।
వర్ణే విప్రక్షత్రవిశాం
గౌణం తద్ద్విగుణోకృతమ్ ॥

బ్రాహ్మణక్షత్రియవైశ్యులకు క్రమాను సారము 8, 11, 12 సంవత్సరముల వయస్సు ఉప నయనమునకు ముఖ్యము. ఈవయస్సునకు ద్విగుణితమైన 16, 22, 24, సంవత్సరముల వయస్సు గౌణకాలము- అనగా అధమపక్షకాలము.

## ఉపనయన నిషిద్ధకాలము

శ్లో॥ గర్భిణీ యది పత్నీ స్యాత్ న కుర్యా దుపనాయనం
పంచమాసా దధః కుర్యాత్ తదూర్ధ్వం నైవ కారయేత్ ॥

ఉపనయనకర్త యొక్క భార్య గర్భవతిగా ఉన్నప్పుడు 5 మాసములు దాటకుండ ఉపనయ మును గావింపవలెను. 5వ మాసము దాటినచో చేయ పనికిరాదు. ఆరవమాసము దాటకుండ వచ్చునని కొన్ని మతములు కలవు.

శ్లో॥ మందారయోర్నాభిజితి వ్రతం నేందుజ్ఞయోః కలాం।
న సమావేశనం భౌమే నోద్వాహః సోమభౌమయోః॥

శనివార, మంగళవారములు, అభిజిల్లగ్నము ఇవి ఉపనయనమందును, సోమవార, బుధవారములు విద్యాప్రారంభమందును, మంగళవారమున గర్భాధానమును, సోమవారమంగళవారములు వివాహమందును పనికిరావు. అభిజిన్ముహూర్త మనగా సూర్యోదయలగ్నమునకు 4వ లగ్నము.

శ్లో॥ ఇడావాచనతః పూర్వం మాతా యది రజస్వలా।
నైవోపనయనం కార్యం పరతిశ్చే చ్చరే ద్వ్రతమ్॥

నాందీదేవతాహ్వానమునందలి ఇడావాచనముకంటె పూర్వమందు వటువుతల్లి రజస్వల అయినచో ఉపనయనమును చేయకూడదు. ఇడావాచనము అయిన పిమ్మట రజస్వల అయినచో ఉపనయనము పనికివచ్చును.

## ఉపనయనయోగ్యతిథులు

శ్లో॥ ద్వితీయా చ తృతీయా చ పంచమీ సప్తమీ తథా।
త్రయోదశీ చ దశమీ ప్రశస్తా స్తిథయో వ్రతే॥

అర్థము సుబోధకము. త్రయోదశి అన్నప్పుడు శుద్ధత్రయోదశి అని తెలియవలయును.

## ఉపనయనవివాహనిషిద్ధనక్షత్రములు

శ్లో॥ యమవహ్నిమఘాశూర్పజ్యేష్ఠా న్పంచ త్యజేద్వ్రతే
వివాహేగ్నియమార్ద్రాహి శూర్పజ్యేంద్రభగా న్దశ ॥

భరణి, కృత్తిక, మఘ, విశాఖ, జ్యేష్ఠ అను ఈ 5 నక్షత్రములు ఉపనయనమందును, కృత్తిక, భరణి, ఆర్ద్ర, ఆశ్లేష, విశాఖ, పుష్యమి, జ్యేష్ఠ పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర ఈ 10 నక్షత్రములు వివాహమందును పనికిరావు.

## వేదోపయోగనక్షత్రములు

శ్లో॥ ఆర్ద్రాశ్లేషభగత్రయంమృగశిరార్కాదిత్రయం మూలభం
చాదిత్యద్వయమత్తరాత్రయవిధిద్వంద్వార్క మిత్రాంతిమాః
శ్రీశార్కేశవసూత్తరాత్రయతురంగేజ్యా శ్చతుర్వేదినా
హస్తాద్యంతవసుద్వయాదితియుగాసూరాధచంద్రాః క్రమాత్

| ఋగ్వేద నక్షత్రములు | యజుర్వేద నక్షత్రములు | సామవేద నక్షత్రములు | అథర్వణవే నక్షత్రములు |
|---|---|---|---|
| ఆర్ద్ర | పునర్వసు | శ్రవణం | హస్త |
| ఆశ్లేష | పుష్యమి | హస్త | అశ్విని |

| | | | |
|---|---|---|---|
| పుబ్బ | ఉత్తర | ఆర్ద్ర | రేవతి |
| పూర్వాషాఢ | ఉత్తరాషాఢ | ధనిష్ఠ | ధనిష్ఠ |
| పూర్వాభాద్ర | ఉత్తరాభాద్ర | ఉత్తర | శతభిషం |
| మృగశిర | రోహిణి | ఉత్తరాషాఢ | పునర్వసు |
| హస్త | మృగశిర | ఉత్తరాభాద్ర | పుష్యమి |
| చిత్త | హస్త | అశ్విని | అనూరాధ |
| స్వాతి | అనూరాధ | పుష్యమి | మృగశిర |
| మూల | రేవతి | | |

## ఉపనయననక్షత్రవ్యవస్థ

శ్లో॥ యస్య కస్యాపి వేదస్య చతుర్వేదేషు భేపి వా ।
అసంశయం వ్రతం కార్యం కించిద్వా నాత్ర సంశయః ॥

నాలుగువేదములలోను ఏ వేదమునకు చెప్పబడిన నక్షత్రముండైనా సరే, సర్వవేదములవారును ఉపనయనమును గావింపవచ్చును. ఇందెంతమాత్రము సందేహములేదు.

## దక్షిణాయననిషేధకార్యములు

శ్లో॥ యామాయనే వ్రతం చౌలం దత్తతాం చ న కారయేత్
శుభానామపి సర్వేషాం శ్రేష్ఠం మాఘాదిపంచకమ్

దక్షిణాయనమందు ఉపనయనమును, చౌలమును, దత్తతయును పనికిరావు. ఉత్తరాయణము సర్వశుభకార్యములకును ప్రశస్తము.

## శలాకాదిదోషము

శ్లో॥ శలాకవేధ ముద్వాహే లగ్నచంద్రం వ్రతే తథా।
లగ్నపాపగ్రహం సంగే సర్వథాపి వివర్జయేత్ ।

వివాహమందు సప్తశలాకచక్ర వేధితనక్షత్రమును, ఉపనయనమందు లగ్నచంద్రుడు, గర్భాధానమందు పాపగ్రహాలగ్నమును పనికిరావు.

శ్లో॥ యస్యా శ్చశీ సప్తశలాకభిన్నః
పాపై రపాపై రథవా వివాహే ।
ఉద్వాహవస్త్రేణ సమావృతాంగే
స్మశానభూమిం రుదతీ ప్రయాతి ।।

ఏకన్యక యొక్క వివాహమందు, చంద్రుడు సప్తశలాకచక్రరీత్యా పాపగ్రహములచేగాని, శుభగ్రహములచేగాని వేధింపబడినయెడల ఆ కన్యక వివాహవస్త్రము (మధుపర్కము)తో కూడ రోదనముచేయుచు స్మశానభూమిని త్రొక్కును. ఇట్లని దీపికాకారవచనము. ఈశ్లోకము ముహూర్తరత్నావళి 280వ పేజీలో 208వ శ్లోకముగా ఉదాహరింపబడినది.

## లగ్నచంద్రదోషము

శ్లో॥ స్వోచ్చసంస్థేపి శీతాంశుః వ్రతినం యది లగ్నగః।
తం కరోతి శిశుం నిత్యం క్షయరోగసమన్వితమ్ ॥

చంద్రుడు ఉచ్ఛస్థుడై యున్నను ఉపనయన లగ్నమందుండెనేని వటువును సర్వదా క్షయరోగిగా చేయును.

### అపవాద

శ్లో॥ ప్రాలేయరశ్మి ర్యది లగ్నసంస్థో
వళక్షపక్షే ప్యశుభో నితాంతం ।
సోపీహ సౌమ్యగ్రహవర్గగశ్చేత్
బహ్వాయురారోగ్యసుఖాని దద్యాత్ ॥

శుక్లపక్షమున వర్ధమానచంద్రుడు అయి నప్పటికి ఉపనయనలగ్నమందున్నయెడల అశుభ ప్రదుడగుచున్నాడు. ఆలగ్నగతచంద్రుడే షడ్వర్గమందు శుభగ్రహసముదాయము కలవాడైనచో వటువునకు దీర్ఘాయురారోగ్యైశ్వర్యముల నిచ్చును.

### చంద్రునికి పూర్ణత్వక్షీణత్వములు.

శ్లో॥ అష్టమ్యో రుభయోశ్చ మధ్యమగత శ్శుక్లాన్యయోర్వ్య
త్యయే, పూర్ణః క్షీణ ఇతి క్రమాచ్ఛశధరః పూర్ణశ్శుభో
మంగళే । కృష్ణాదౌ దినపంచకం శుభకరం తన్మ
ధ్యమం మధ్యమం, తస్యాంత్యం త్వధమాభిధం శశి
వశా చ్ఛుక్లే తు తద్వ్యత్యయమ్ ॥

తా॥ చంద్రుడు శుద్ధ అష్టమినుండి బహుళ అష్టమివరకును పూర్ణుడు. బహుళ అష్టమినుండి శుద్ధ అష్టమివరకును క్షీణుడు. పూర్ణచంద్రుడు శుభుడు; క్షీణచంద్రుడు అశుభుడు. మరియు శుద్ధ ఏకాదశినుండి బహుళ పంచమివరకు పూర్ణ చంద్రుడుగాన శుభుడు. బహుళ షష్ఠినుండి బహుళ దశమివరకు మధ్యమబలుడు. బహుళ ఏకాదశినుండి శుద్ధపంచమివరకు క్షీణచంద్రుడు.

## నైధనపంచకదోషము.

శ్లో॥ న నైధనర్క్షం నచ తన్నవాంశం
నేందుర్భవే ద్దష్టమరాశినాథః ।
నాష్టోదయం నాష్టమరిఃఫచంద్రః
శస్తం వ్రతే నైధనశుద్ధిలగ్నమ్ ॥

తా॥ ఉపనయనలగ్నమందు (1) నైధనతార (2) అష్టమనవాంశ (3) అష్టలగ్నాధిపత్యముగల చంద్రుడు (4) వటువుయొక్క జన్మలగ్న జన్మరాసులకు అష్టమలగ్నమును (5) ఉపనయనలగ్నమునకు 8-12 స్థానములయందు చంద్రుడును పనికిరావు. అష్టమలగ్నశుద్ధి కలిగి ఉండవలయును.

## స్ఫూజితాదిదోషములు.

శ్లో॥ అదిత్యే స్ఫూజితం భౌమే కూజితం రుధిరం శనౌ ।
స్వర్భానావుగ్రం కేతౌ తు రంధ్రం కేంద్రస్థితేః
క్రమాత్ ॥

తా॥ ఏ కేంద్రమందైనాసరే ఉపనయన లగ్నమునకు కేంద్రమందు సూర్యుడున్న యెడల స్ఫూజితము, కుజుడున్న యెడల కూజితము, శనియున్న యెడల రుధిరము, కేతువున్న యెడల రంధ్రము అను దోషములు ఏర్పడుచున్నవి.

### అ ప వా ద

శ్లో॥ లగ్నాదికేంద్రేష్వథ వా త్రికోణే
దేవేజ్యదైత్యార్చితసోమసౌమ్యాః ।
ఏకో నిహంతి స్ఫూజితాదిదోషాన్
భాను ర్యథా గాఢ మివాంధకారమ్ ॥

తా॥ ఉపనయనలగ్నముయొక్క కేంద్రమందుగాని, కోణమందుగాని గురు, శుక్ర, పూర్ణచంద్రబుధులలో ఏ ఒకడు ఉన్నను సూర్యుడు గాఢాంధకారమును పోగొట్టినట్లు స్ఫూజితాది దోషములను పోగొట్టుచున్నాడు.

## రాహు కేతు దోషవిషయము.

శ్లో॥ వివాహేపి చ దేవానాం ప్రతిష్ఠా సూపనాయనే,
ఛాయాగ్రహౌ చ విజ్ఞేయౌ రాహుకేతూ న దోషదౌ,

తా॥ వివాహము, దేవతాప్రతిష్ఠ, ఉపనయనము- వీటియందు ఛాయాగ్రహములైన రాహు కేతువులు దోషప్రదులు కారు.

## ఘృతాపోశనవిశేషము.

శ్లో॥ అజ్యం పైత్యహరం మనోమలహరం కుక్ష్యగ్ని మాంద్యాపహం, దోషఘ్నంచ పురాణతాపశమనం వాతాపహం పుష్టిదం। మేధాజ్ఞాపకశక్తిదం బలకరం చక్షుష్య మాయుఃప్రదం, వృష్యం కాంతికరం వయ స్త్రిషు హితం వృద్ధేషు బాలేష్వపి ॥

తా॥ ఆజ్యము వృద్ధులకు, పిల్లలకు చతు ర్వింశతి పైత్యములను, మనఃకశ్మలమును, జఠ రాగ్నిమాంద్యమును, వాతపిత్తశ్లేష్మములను, పురాణజ్వరములను, అశీతివాతములను హరించి శరీరపుష్టిని, మేధాశక్తిని, జ్ఞాపకశక్తిని, బలమును, నేత్రవికాసమును, ఆయుర్వృద్ధిని, వీర్యపుష్టిని, దేహకాంతినిఇచ్చి వనితాభిలాషను కలుగజేయును

## ఉపనయనలగ్నబలము

శ్లో॥ గురుశ్శుక్రోపి వా యస్య మౌంజీబంధనలగ్నగః ।
తస్య విద్యాభివృద్ధిస్స్యాత్ వివాహశ్చాచిరా ద్భవేత్ ॥

తా॥ ఏవటువుయొక్క ఉపనయనలగ్నమందు బృహస్పతిగాని, శుక్రుడుగాని ఉండునో ఆవటువుయొక్క విద్య అభివృద్ధి నొందును. ఆవటువు శీఘ్రకాలములోనే గృహస్థుడగును.

## శుభములకు సమశీతోష్ణకాలము

శ్లో॥ మాఘఫాల్గునచైత్రేషు వ్రతోద్వాహాది సౌఖ్యదం ।
ఆతపస్యాథవా వృష్టేః బాధాస్యాజ్జాతుతత్పరమ్ ॥

ఉపనయన వివాహాదిశుభకార్యముల విషయమై సమశీతోష్ణములైన మాఘ, ఫాల్గున, చైత్రమాసములు మూడును సుఖప్రదములు. తదనంతరవైశాఖ జ్యేష్ఠమాసములు ఒకొక్కప్పుడు ఎండబాధయు, లేక వర్షపుబాధయు కలిగియుండును.

## నిషేధ్యకన్యక

శ్లో॥ త్యజే ద్వివస్త్రాం రుదతీం తమస్థాం
సంమార్జయంతీం పరగేహసంస్థాం ।

వినిద్రితాం తైలవిలిప్తగాత్రీం
ప్రాగ్వీక్షణేపస్మృతిమార్తవస్థామ్ ॥

పెండ్లిచూపులకు వెళ్లినప్పటికి ఆకన్యక దిగంబరిగా నున్నను, రోదనము చేయుచున్నను, చీకటిగదియందున్నను, తుడుచుచున్నను, పొరు గింటియందున్నను, నిద్రించుచున్నను, అభ్యంగ మునకై దేహమునకు నూనెపూసుకొనియున్నను, ఒడలు తెలియనిదిగా నున్నను, రజస్వల యైయునను ఆకన్యను విడువవలయును.

## గండర్క్ష జాతవివాహము

శ్లో॥ సర్పశూర్పేంద్రమూలోత్థాశ్వశ్రూదేవరభావుకాన్,
శ్వశురం హంతి తల్లోపే నాఘం పుంసి న కించన॥

ఆశ్లేష, విశాఖ, జ్యేష్ఠ, మూల నక్షత్ర ములయందు జనించిన కన్యకవలన అత్తకు, మరు దికి, బావకు, మామకు గండము- అను శాస్త్రనిర్ణ యముచే చెప్పబడినవారు లేని విషయములో దోషము లేదు. పురుషుని విషయమున ఈదోష పరిశంసయే లేదు.

## అ ప వా ద

శ్లో॥ విరుద్ధే రాశినక్షత్రే భవేతా మపి చేత్తదా ।
దంపత్యోః ప్రీతయే నృణాం నామాంతర మథ
క్షిపేత్ ॥

దంపతులయొక్క రాశి, నక్షత్రము పరస్పర విరుద్ధములైనయెడల దంపతులయొక్క అన్యోన్య ప్రీతికొరకు నామకరణకాలమున స్త్రీకి ఉంచబడిన పేరును మార్చి అనుకూలమైన మరియొక నామమును ఉంచవలయును.

## నామాంతరముచేయువిధానము

శ్లో॥ పంచత్వక్సితపక్వపాన్వితజలం కుంభస్థితం నూతనం
దూర్వాశ్వత్థదళైర్వివాహసమయే సంప్రోక్షణం కల్ప
యేత్ ।
కన్యాయాస్తదనంతరం ద్విజవర స్తస్యాశ్చ పుణ్యాం
గనా
పూర్వస్థం పరిహృత్య మంగళకరం నామాంతరం
ప్రక్షిపేత్ ॥

వివాహసమయమందు బ్రాహ్మణోత్తముడు నూతనకలశమునందు పంచత్వక్కులతోను తెల్ల ఆవాలతోను కూడిన ఉదకమును గరికపరకలతో

కూడిన రావిచిగుళ్ళతో కన్యకశిరముపై ప్రోక్షిం
చినపిమ్మట బ్రాహ్మణాముత్తైదువ ఆకన్యక
అంతకు పూర్వమందున్న నామమును పరిహరించి
దాంపత్యమున కనుకూలించు శుభప్రదమైన
నవీననామమునునిర్ణయింపవలయును. ఈనామకరణ
సంస్కారము స్త్రీలకు మాత్రమే. పురుషులకు
పనికిరాదు. ఈ ఆచారము దక్షిణదేశమందు తర
చుగా నున్నది.

## వివాహనిశ్చయవిషయము

శ్లో॥ కులం చ శీలం చ వపు ర్వయశ్చ
విద్యా చ విత్తం ప్రియమైకమత్యం ।
అష్టావిమే తత్ర విచారణీయాః
పక్షద్వయే చాపి వివాహకాలే ॥

వివాహసంబంధమును సమకూర్చుకొను
నపుడు కులము, నడవడిక, దేహదార్ఢ్యము,
వయస్సు, విద్య (తెలివి), స్థితిగతులు, ప్రేమ, ఏక
మత్యము అను ఎనిమిది విషయములును ఉభయ
పక్షములవారును పరస్పరము బాగుగా ఆలోచించు
కొనవలసినవై యున్నవి.

శ్లో॥ సహజా యత్కులేఽహంతాకటూక్త్యభయనిస్త్రపాః ।
సుఖేప్సునా తత్కులోత్థా త్యాజ్యా సమ్రాడ్సుతాప్యరమ్ ॥

ఏవంశమందు అహమిక (గర్వము), పరుష సంభాషణ, నిర్దయ, నిర్భయము, నిర్లజ్జ పరంపరగా సహజములై యుండునో ఆవంశమున జన్మించిన కన్యక చక్రవర్తికూతురైనను సుఖాభిలాషగల వానిచే అతిశీఘ్రముగా విడిచిపెట్టతగినది.

శ్లో॥ విదేశయాతు ర్ధూర్తస్య ముముక్షో ర్దీర్ఘరోగిణః ।
షట్త్రింశమూర్ధ్వవయసః షండస్య న దిశే త్సుతామ్ ॥

దేశాంతరసంచారి, మోసముచేయువాడు, మోక్షాభిలాషగలవాడు (విరక్తుడు), దీర్ఘరోగి, 36 సం. వయస్సు దాటినవాడు, నపుంసకుడు వీరికి కన్యకను ఇవ్వకూడదు.

## దంపతులవయస్సుతేడావిషయము

శ్లో॥ స్వదేహాద్వాయతాం ఖర్వాం నోద్వహేత వయోధికాం ।
స్వవర్షా ద్ద్విత్రిపంచాష్టదశాబ్దోనాం సముద్వహేత్ ॥

తనకంటె పొడవైనది, చూచుటకు అందగించని మరుగుజ్జుగా నున్నది, వయస్సుచే పెద్దది అగు కన్యను వివాహము చేసుకొనకూడదు. తన వయస్సుకంటె 2, 3, 5, 8, 10 సంవత్సరములు

 

తక్కువ వయస్సుగల కన్యను వివాహము చేసుకొన వలయును.

## దాంపత్యాన్యోన్యవిషయము

శ్లో॥ స్త్రీభాదే ర్వరభాద్గణ్యం కాలామృతే వరోడుతః।
గణ్యం స్యా త్పాదభేదేన ఫలం తారాబలం యథా॥

దాంపత్యాన్యోన్యవిషయమై స్త్రీయొక్క జన్మనక్షత్రము మొదలు పురుషునియొక్క జన్మ నక్షత్రమువరకు లెక్కించి 9చే భాగించి ఫలమును తారాబలమువలెనే తెలియవలయును. నక్షత్ర గణనప్రకారము కుదరనియెడల పాదగణనరీత్యా చూడవలయును. పూర్వకాలామృతాదులలో పురుషనక్షత్రము నుండికూడ చూడవచ్చునని చెప్పబడినది. దీనికే దినకూటమనియు, దినపాంత మనియు నామములు. పాదగణన ప్రాచీన సాంప్రదాయముగా వాడుకలో నున్నది.

## ఏకోదరవివాహవిషయము

శ్లో॥ శుభకృ త్పుత్రికోద్వాహాత్ పశ్చా త్పుత్రకరగ్రహః।
ఏకతిథ్యా మపి ప్రాహ భార్గవో భిన్నవేళయా॥

ఒకేరోజున కుమారు వైవాహనంతరము

కుమారుని వివాహమును కాలభేదముచే చేయ వచ్చునని భృగుమహర్షి చెప్పెను.

శ్లో॥ వివాహోపనయౌ యత్రి త్వేకస్మి న్దివసే యది ।
మేఖలాబంధనం పూర్వం పరం వైవాహికం జగుః ॥

ఉపనయన, వివాహములు రెండును ఒకే రోజుయందు గావించు పక్షమందు ముందుగా ఉపనయనమును చేసి పిమ్మట వివాహమును చేయ వలయును.

## ఉపనయనకర్తలు

శ్లో॥ పితైవోపనయే త్పుత్రం తదభావే పితుఃపితా ।
తదభావే తు తద్భ్రాతా తదభావేపి సోదరః ॥
పితుః పితామహభ్రాతా సకుల్యో గోత్రజో గురుః ।
ఉపాయనాధికారా స్స్యుః పూర్వాభావే పరంపరః ॥
కుమారస్యోక్తకాలస్య పితా దూరస్థితో యది ।
మాతా జ్ఞయోపనయనం కుర్యా త్పూర్వేషు కశ్చన ॥
బ్రహ్మచార్యప్యపత్నీకః కన్యాదానం పితాదికం ।
యథోక్తవిధినా కుర్యా త్కుండద్వా నాత్ర సంశయః ॥

తండ్రియే కుమారునికి ఉపనయనమును చేయవలయును. తండ్రి లేకున్న పితామహుడు, అతడు లేకున్న పినతండ్రి పెదతండ్రులు, వారు

లేకున్న సోదరులు, వారు లేకున్న పితృపితామహుడు, అతడు లేకున్న సకుల్యులు, వారు లేకున్న గురువు ఉపనయనమును చేయుట కధికారులు. పుత్రునకు ఉపనయనకాలము వచ్చునప్పటికి తండ్రి దూరదేశమందుండెనేని తల్లి అనుమతిపైన పూర్వోక్తాధికారులలో ఎవరైనను ఉపనయనమును చేయవచ్చును. ఆదిశబ్దముచే వ్రతోద్యాపనహోమనూతనగృహప్రవేశాదు లూహ్యంబులు.

## కన్యాదాతలు

శ్లో|| పితాపితామహో భ్రాతా పితృవ్యో గోత్రజో గురుః।
మాతామహో మాతులోవా కన్యాదా బాంధవాః క్రమాత్ ॥
పూర్వోక్తానామభావేతు కన్యా కుర్యాత్స్వయంవరం।
ఆచార్యా బహవః ప్రాహు రేవం మహతి సంకటే॥

తా॥ తండ్రి, పితామహుడు, సోదరుడు, పినతండ్రి, పెదతండ్రి, సగోత్రీకుడు, గురువు, మాతామహుడు, మేనమామ, బంధువులు- కన్యాదానమును చేయుటకు అర్హతగలవారు. గతిలేని పక్షంలో కన్యకయే స్వయంవరమును గావించుకొనవలయును. ఇట్లని అనేకమంది మహామహులు చెప్పియున్నారు.

## గాంధర్వవివాహకాలము.

శ్లో॥ చాతుర్మాస్యే న దూష్య స్స్యాత్ గాంధర్వాఖ్య
కరగ్రహః,
మానసప్రధానకర్మాణి కర్తవ్యాని మనీషిభిః ॥

తా॥ ఆషాఢ, శ్రావణ, భాద్రపద, ఆశ్వయుజమాసములు నాలుగును అష్టవిధవివాహములలోనిదైన గాంధర్వవివాహము దూష్యము కాదు. ఈ 4 మాసములయందును మానసప్రధానములయిన కర్మల నాచరింపవచ్చును.

## అష్టవిధవివాహములు.

శ్లో॥ బ్రాహ్మోదైవస్తథైవార్షః ప్రాజాపత్యస్తథాసురః।
గాంధర్వో రాక్షసశ్చైవ పైశాచశ్చాష్టధోద్వహః ॥

తా॥ ఈశ్లోకాభిప్రాయమును ఈదిగువ వివరణప్రకారము తెలియవలయును.

(1) ప్రార్థనపూర్వకముగా పిలిచి ఇవ్వబడిన కన్యను గ్రహించి వివాహము చేసుకొనబడినది బ్రాహ్మ్యవివాహము.

(2) యజ్ఞయాగాదులను స్వతంత్రముగ నెరవేర్చగలవానికి యాగసమయమందు వాగ్దానము

చేసి ఇవ్వబడిన కన్యకను గ్రహించి వివాహము చేసుకొనబడినది దైవవివాహము.

(3) గోమిథున సహితముగా ఇవ్వబడిన కన్యను గ్రహించి చేసుకొనబడినది ఆర్ష వివాహము.

(4) పెద్దలఆజ్ఞానుసారము జీవయాత్రను సాగించుట కంగీకరించి కన్యను గ్రహించి చేసుకొనబడి నది ప్రాజాపత్యవివాహము.

(5) కన్యయొక్క తల్లితండ్రులకు ద్రవ్యమిచ్చి కన్యనుకొనిచేసుకొనబడినదిఆసురవివాహము.

(6) ఇతరుల ప్రసక్తిలేకుండా దంపతు లొకరినొకరు ప్రేమించి చేసుకొనబడినది గాంధర్వ వివాహము.

(7) కన్యకయొక్క తల్లితండ్రులను, వారిబంధువు లను కొట్టి బలాత్కారముగా కన్యకను ఎత్తుకొనిపోయి చేసుకొనబడినది రాక్షస వివాహము.

(8) కన్యక నిద్రావస్థలో ఒడలు తెలియకుండనున్న సమయమున దొంగతనముగా మంచము సహితముగా తెచ్చి చేసుకొనబడినది పైశాచిక వివాహము.

మొదటి నాలుగు వివాహములకుమాత్రమే స్మార్తశ్రౌతకర్మాధికారము కలదు.

శ్లో॥ శస్తం వాపి విధివ్యస్తం ఆద్యోద్వాహచతుష్టయం ।
యయోస్స్మార్తాదికర్మాణి న సిధ్యంతి తయోర్ధ్రువ ॥

తా॥ మొదటి బ్రాహ్మ్యాదివివాహములు నాల్గును ప్రశస్తములైనప్పటికిని ఆవివాహములు విధ్యుక్తముగా జరుగనివానికి స్మార్తాదికర్మలు సిద్ధింపవు; నిశ్చయము. శేషించిన నాల్గు వివాహముల విషయము చెప్పనగత్యములేదు.

శ్లో॥ పుత్రీవివాహాత్పరత స్తథైవ
శుభప్రదం పుత్రవివాహకృత్యం ।
పుత్రీద్వయం నైవ మృతుత్రయేపి
పుత్రద్వయం చాపి కదాచిదేవ ॥

కుమార్తె వివాహానంతరము వెంటనే కుమారుని వివాహము శుభప్రదము. ఒకేసంవత్సరమందు ఇద్దరు కుమార్తెలకుగాని, ఇద్దరుకుమారులకుగాని 6 మాసములలోగా వివాహము పనికిరాదు.

శ్లో॥ నిర్గమః స్త్రీ వాహాస్స్యాత్ ప్రవేశః పుంవివాహకం ।
న ప్రవేశాత్పరం కుర్యాత్ నిర్గమం వత్సరాంతరే ॥

స్త్రీవివాహమునకు నిర్గమము అనియు, పురుష వివాహమునకు ప్రవేశము అనియు శాస్త్రనిర్ణయము గాన వరివేశా (పురుషవివాహా)నంతరము సంవత్సరములోగా నిర్గమము (స్త్రీవివాహము) పనికిరాదు.

శ్లో॥ ఏకలగ్నేపి భిన్నాంశే వసిష్ఠాత్రిపరాశరాః।
తయోర్వివాహ మిచ్ఛంతి పృథగ్గ్రామేథ మంటపే॥

ఒకేలగ్నమందు నవాంశభేదముచే ఏకోదర కన్యకలకు వేరు వేరు గ్రామములయందుగాని, వేరు వేరు ఇండ్లయందుగాని, వివాహములను వసిష్ఠాదులందరును అంగీకరించిరి.

శ్లో॥ కుమార్యోస్సుతయోః పుత్రపుత్ర్యోరేకోదరస్థయోః।
వివాహోబ్దాంతరేశస్తః తయో రుద్వాహమంగళమ్॥

ఏకగర్భజనితులైన కుమార్తెలకుగాని, కుమారులకుగాని, పుత్రపుత్రికలకుగాని సంవత్సర భేదముచే వివాహమును గావింపవచ్చును.

శ్లో॥ ఫాల్గునే చైత్రమాసేచ పుత్రోద్వాహోపనాయనే।
భేదాదబ్దస్య కుర్వీత నార్తుత్రయవిడంబనమ్॥

సంవత్సర భేదముచే ఫాల్గున, చైత్రమాసములయందు పుత్రులకు ఉపనయనములుగాని, వివాహములుగాని, ఒకనికి ఉపనయనము, మరొక

నికి వివాహముగాని, పుత్రికలకు వివాహములు గాని, పుత్రోపనయన, పుత్రికావివాహములను గాని చేయవచ్చును. (6) మాసముల వ్యవధితో పనిలేదు.

## ఏకనక్షత్రవివాహము

శ్లో॥ రాశ్యైకక్యేచే ద్భిన్నమృక్షం ద్వయో స్స్యాత్
నక్షత్రైక్యే రాశియుగ్మం తథైవ ।
నాడీదోషో నో గణానాం చ దోషో
నక్షత్రైక్యే భిన్నపాద శ్శుభ స్స్యాత్ ॥

నక్షత్రభేదముగల ఏకరాశియు, రాశిభేదము గల ఒకే నక్షత్రము ఏకనక్షత్రమునందు పాద భేదము అయినచో ఆదంపతుల వివాహవిషయమై నాడీదోష గణ (కూట) దోషములు చూడ నగత్యములేదుగాన వివాహము శుభప్రదము.

## వివాహలగ్న బలము

శ్లో॥ శుక్రోవాపి గురు స్సౌమ్యః పాణిగ్రహణలగ్నగః ।
ఆయురారోగ్యసత్పుత్రధనధాన్యప్రదో భవేత్ ॥

శుక్రుడుగాని, బృహస్పతిగాని, బుధుడు గాని వివాహలగ్నమం దున్నయెడల ఆయు

రారోగ్య, సత్పుత్ర, ధన, ధాన్యములను కలుగ
జేయుదురు.

## ద్వాదశకూటములు

శ్లో॥ స్త్రీదీర్ఘ వేధాదినరజ్జువర్ణ
మహేంద్రనాడీ గణయోనివశ్యాః ।
రాశీశరాశ్యాహ్వయనామకూటాః
విచక్షణై ర్ద్వాదశధా ప్రదిష్టాః ॥

(1) స్త్రీదీర్ఘకూటము (2) వేధాకూటము
(3) దినకూటము (4) రజ్జుకూటము (5) వర్ణకూటము
(6) మహేంద్రకూటము (7) నాడీకూటము
(8) గణకూటము (9) యోనికూటము (10) వశ్య
కూటము (11) గ్రహకూటము (12) రాశికూటము.

## నిర్ణీతకూటములు

శ్లో॥ గ్రహమైత్రం ద్విజాతీనాం క్షత్రియాణాం గణస్తథా ।
స్త్రీదీర్ఘ కూటం వైశ్యానాం శూద్రాణాం యోనిరేవచ ॥

పై నవివరింపబడిన ద్వాదశకూటములలోను
బ్రాహ్మణులకు గ్రహమైత్రకూటము, క్షత్రియు
లకు గణకూటము, వైశ్యులకు స్త్రీదీర్ఘకూటము,
శూద్రులకు. యోనికూటము ముఖ్యము. గ్రహ

ముల మిత్రశత్రుసమత్వములకే గ్రహమైత్రకూటము అని సంజ్ఞ.

శ్లో॥ మిత్రత్వం తు ప్రశస్తం స్యాత్
సమత్వం మధ్యమం స్మృతం।
శత్రుత్వం వర్జనీయం స్యాత్
దాంపత్యానోఽన్యవీక్షణే ॥

దంపతుల అన్యోన్య విషయము నాలోచించునప్పుడు గ్రహమిత్రత్వము ప్రశస్తము; సమత్వము మధ్యమము; శత్రుత్వము విడువతగినది.

## గణకూటము

శ్లో॥ పునర్వసుద్వయం స్వాతికరశ్రవణతారకాః।
పౌష్ణమైత్రేందుదస్రాఖ్యాస్తారాదేవగణాస్స్మృతాః ॥
రోహిణీత్రిణీ పూర్వాణీ భరణీ రౌద్రిమేవ చ।
త్రిణ్యుత్తరాణి విజ్ఞేయా మానుషాః పరికీర్తితాః ॥
అగ్నిపూర్వమఘాచిత్రా ద్విధైవేంద్రాశ్చ మూలభం।
శ్రవిష్ఠా వారుణం చైవ రాక్షసాఖ్యగణాస్స్మృతాః ॥

పునర్వసు, పుష్యమి, స్వాతి, హస్త, శ్రవణము, రేవతి, అనూరాధ, మృగశిర, అశ్విని- ఈ తొమ్మిది దేవగణ నక్షత్రములు. రోహిణి, పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, భరణి, ఆర్ద్ర,

ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర ఈ తొమ్మిది మనుష్యగణనక్షత్రములు. కృత్తిక, ఆశ్లేష, మఘ, చిత్త, విశాఖ, జ్యేష్ఠ, మూల, ధనిష్ఠ, శతభిషం ఈ తొమ్మిది రాక్షసగణనక్షత్రములు.

## స్త్రీదీర్ఘకూటం

శ్లో॥ నింద్యమధ్యశుభాని స్యుః నవకా న్యాదితః క్రమాత్,
చతుర్దశర్క్షాదుపరి స్త్రీదూరాఖ్య మిదం స్మృతమ్ ॥

వరుని జన్మనక్షత్రము వధువు జన్మనక్షత్రముయొక్క మొదటి నవకములో నున్నయెడల నింద్యము. మధ్యనవకములోనున్నయెడల మధ్యమము. మూడవ నవకములో నున్న శుభప్రదము. 14 నక్షత్రములకు పైనున్నను శుభప్రదము.

## యోనికూటము

శ్లో॥ అశ్వనీశతతారాశ్వ భరణీరేవతీ గజౌ ।
కృత్తికాపుష్యమీ ఛాగా రోహిణీంయా భుజంగమౌ ॥
మూలార్ద్రా చ తథా శ్వానౌ మఘాపూర్వా చ మూషకౌ
సార్పాదిత్యే చ మార్జాలౌ స్వాతీహస్తౌ చ మాహిషౌ ॥
విశాఖాచిత్రిభే వ్యాఘ్రౌ మృగౌ జ్యేష్ఠానురాధకే ।
ఉత్తరోత్తరభాద్రౌ చ గావౌ చ పరికీర్తితౌ ॥

అభిజిచ్చోత్తరాషాఢా నకులౌ పరికీర్తితౌ ॥
పూర్వాభాద్రవసూ సింహౌ పూర్వాషాఢాహరిః కపీ ।

అశ్వని శతతారలు గుఱ్ఱములు, భరణీరేవతులు ఏనుగులు, కృత్తికాపుష్యములు మేకలు, రోహిణీమృగశిరలు పాములు, మూలార్ద్రలు కుక్కలు, మఘపుబ్బలు ఎలుకలు, ఆశ్రేషాపునర్వసులు పిల్లులు, స్వాతిహస్తలు దున్నలు, విశాఖచిత్తలు పెద్దపులులు, జ్యేష్ఠానూరాధలు లేళ్లు, ఉత్తరోత్తరాభాద్రలు గోవులు, అభిజిదుత్తరాషాఢలు ముంగిసలు, పూర్వాభాద్రాధనిష్ఠలు సింహములు, పూర్వాషాఢాశ్రవణములు కోతులు.

శ్లో॥ గోవ్యాఘ్రం గజసింహ మశ్వమహిషం శ్వైనం చ బభ్రూరగౌ
వైరం వానరమేషకం చ సుమహత్తద్వద్బిడాలోందురం ।
లోకానాం వ్యవహారతోన్యదపి చ జ్ఞాత్వా ప్రయత్నాధికం
దంపత్యోః ర్నృపభృత్యయో రపి సదా వర్జ్యం గృహాదే స్తథా ॥

గోవ్యాఘ్రములు, గజసింహములు, అశ్వమహిషములు, శ్వానహరిణములు (కుక్కలు లేళ్లు), ముంగిస సర్పములు, వానర మేషములు

(కోతులు మేకలు), మార్జాలమూషకములు ఇవి పరస్పరవైరముకలవి. ఇవిగాక లోకవ్యవహారానుసారముగా మిత్రశత్రుత్వముల నెఱింగి, దంపతులకును, రాజు తత్సేవకులకును, గృహ, గృహయజమానులకును శత్రుత్వమేర్పడిన యోనికూటమును విడిచిపెట్టవలయును.

## కుజదోషవిషయము

శ్లో॥ ధనే వ్యయే చ పాతాళే జామిత్రే చాష్టమే కుజః।
దోష స్స్యాత్ తేషామ్యకవ్యాం కంన్యానకన్యగుణస్థలే॥

జాతకమందు లగ్నరీత్యా 2, 12, 4, 7, 8 స్థానములయందున్న కుజుడు దోషియగుట, బుధ శుక్రాంగారక గురుస్థానములైన కన్యామిథున తులా వృషభ మేష వృశ్చిక ధనుర్మీన కర్కాటమకరలగ్నజాతకులకు మాత్రమే అని తెలియవలెను.

శ్లో॥ కన్యామిథునయో ర్ధనే తులావృషభయో ర్వ్యయే।
కీటజయో శ్చతుర్థే - సప్తమే కర్కినక్రయోః॥
ధనుర్మీనద్వయోర్మృత్యౌ న దోష స్సింహకుంభయో॥
ఏవం చ జాతకవశా త్కుజదోషః ప్రకీర్తితః॥

కన్యామిథునలగ్నజాతకులకు ద్వితీయమందును, తులావృషభలగ్నజాతకులకు వ్యయమందును,

వృశ్చిక మేషలగ్న జాతకులకు చతుర్థమందును, కర్కాటకమకరలగ్న జాతకులకు సప్తమమందును ధనుర్మీనలగ్న జాతకులకు అష్టమమందును కుజుడు, దోషప్రదుడు. సింహలగ్న కుంభలగ్న జాతకులకు కుజదోష మనునది లేదు.

## అ ప వా ద

శ్లో॥ భౌమస్థితో దయాధీశే కేంద్రే కోణేపి వా స్థితేః ।
లగ్నే వా చరరాశౌ వా కుజదోషో న విద్యతే ॥

తా॥ కుజుడున్న రాశ్యధిపతి కేంద్రముల యుండుగాని, కోణములయుండుగాని, చరరాశుల యుండుగాని, లగ్నమందుండుగాని ఉన్నయెడల కుజ దోషము లేదు.

శ్లో॥ న దోషా ఽశ్విమృగపునః పుష్యసర్పోత్తరానిలే ।
మిత్రితోయవ్రంద్రిశ విశాఖ్యాంతే భవస్య చ ॥

తా॥ అశ్విని, మృగశిర, పునర్వసు, పుష్యమి ఆశ్లేష. ఉత్తర, స్వాతి, అనూరాధ, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శ్రవణం, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రజాతకులకు కుజదోష మనునది లేదు.

శ్లో॥ సింహేవాపి ఘటే భౌమే గురుణాపి బుధేన వా ।
చంద్రేణ వా యుతే దృష్టే కవినా నైవ దోషదః ॥

తా॥ కుజుడు సింహమందుగాని, కుంభ మందుగాని ఉండియున్నను, గురు బుధ చంద్రు లలో ఏ ఒకనితోనైనను కలసిగాని, మాంతబలము గాని ఉండియున్నను కుజదోషములేదు.

శ్లో॥ కుజదోషో యది భవేత్ లగ్నరాశిభజాతకైః,
దంపత్యో ర్యది వాన్యోన్యం భౌమదోషో న విద్యతే॥

లగ్నము రాశి నక్షత్రము జాతకము వీటిలో దేనిని అనుసరించి అయినాసరే దంపతులిద్దరి జాతకములలోను కుజదోష మున్నచో కుజదోషసందేహములేదు.

## జ్యేష్ఠాధికదోషము

శ్లో॥ త్రిచతుఃపంచజ్యేష్ఠత్వం సమ్మతం న కరగ్రహే।
ద్విజ్యేష్ఠంమధ్యమం ప్రోక్తం జ్యేష్ఠ ఏకశ్శుభావహః॥

వివాహవిషయమున దంపతులకు జ్యేష్ఠత్రయము, జ్యేష్ఠచతుష్టయము, జ్యేష్ఠపంచకము పనికిరాదు. జ్యేష్ఠద్వయము మధ్యమము. ఏకజ్యేష్ఠ శుభప్రదము.

శ్లో॥ అద్యగర్భద్వయోర్యత్ర వివాహం కారయే ద్యది।
మాసాధిపతిమిత్రత్వవశా దతి శుభావహాః॥

దంపతులిద్దరు జ్యేష్ఠులైనప్పటికిని వారిదస్త

మాసాధిపతులకు మిత్రత్వమున్నచో వివాహము శుభప్రదము. శ్లో॥ 'జన్మమాసాదివారేశః సమాసాధిపతి స్స్మృతః' దంపతులకు జన్మమాసప్రారంభ వారాధిపతియే ఆమాసమునకు అధిపతి.

## జ్యేష్ఠత్వనిర్ణయము.

శ్లో॥ జ్యేష్ఠత్వం గర్భతః పశ్యేత్
న భేద స్త్రీపుమా నితి ।
స్రావం పాతం న గణ్యం స్యాత్
న జీవన్మృతచింతనా ॥

తా॥ జ్యేష్ఠత్వము కానుపుల ననుసరించి చూడతగియున్నది. ఆడ, మగ అను భేదము పనికిరాదు. సంతానము నిలచినను, నిలువకున్నను మొదటి కానుపునుండియే లెక్కింపవలయును. గర్భపాతము, గర్భస్రావము లెక్కకురావు. స్త్రీలకు స్త్రీలు, పురుషులకు పురుషులు వేరుగా లెక్కింపబడరాదు. స్త్రీపురుష భేదము లేకుండ కాన్పుల వరుసను లెక్కింపవలయును.

## జామిత్రశుద్ధివిషయము.

శ్లో॥ జామిత్రశుద్ధి మిచ్ఛంతి వివాహే చంద్రలగ్నయోః ।
సత్యత్ర శుభజామిత్రం అంగీకృతం మనీషిభిః ॥

తా॥ వివాహలగ్నమునకును, చంద్రునకును సప్తమస్థానమున గ్రహము లుండకూడదనుట పాద గ్రహవిషయము. శుభగ్రహస్థితి గ్రంథముల చేతను, అన్ని దేశములయందలి పండితులచేతను అంగీకరింపబడినది- ఈవిషయము పూర్వకాలా మృతము తృతీయబిందువుయందు 18వ శ్లోకంలో చెప్పబడినది.

## వివాహమందు లగ్నచంద్రనిషేధము

శ్లో॥ గ్రంథేషు కేషుచి త్ప్రోక్తా లగ్నచంద్రనిషేధతా।
యథోపనయనే పాణిగ్రహే పి గ్రంథకర్తృభిః॥

తా॥ కొంతమంది గ్రంథకర్తలచే ముహూర్తమార్తాండ విద్యామాధవీయాది గ్రంథములయందు ఉపనయనమునందువలెనే వివాహమునందును లగ్నచంద్రనిషేధము నిర్ణయింపబడినది.

## నక్షత్రకల్పన

శ్లో॥ అజ్ఞాతజన్మతారాణాం నామభం పరికల్పయేత్।
తేనైవ చింతయే త్సర్వం రాశికూటాదిజన్మవత్॥

తా॥ జన్మనక్షత్రము తెలియనివాంకి నామ

నక్షత్రమును నిర్ణయించి దానిద్వారా జన్మనక్షత్రముచేతవలెనే రాశికూటాదివిచారణ గావింపవలెను.

## నామనక్షత్రవివేకము

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| చూ | చే | చో | ల | అశ్వని | హూ | హే | హో | ఢ | పుష్యమి |
| లీ | లూ | లే | లో | భరణి | డి | డు | డె | డో | ఆశ్లేష |
| అ | ఈ | ఊ | ఏ | కృత్తిక | మా | మీ | మూ | మే | మఘ |
| ఓ | వా | వీ | వు | రోహిణి | మో | టా | టీ | టు | పుబ్బ |
| ఎ | వో | కా | కి | మృగశిర | టె | టో | పా | పి | ఉత్తర |
| కు | ఖం | ఙ | ఛ | ఆర్ద్ర | పూ | షం | ణా | ఢా | హస్త |
| కె | కో | హా | హి | పునర్వసు | పే | పో | రా | రి | చిత్త |
| | | | | | రూ | రే | రో | తా | స్వాతి |

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| తీ | తు | తే | తో | విశాఖ | జూ | జే | జో | ఖ | శ్రవణం |
| న | ని | నూ | నే | అనూరాధ | గ | గి | గు | గే | ధనిష్ఠ |
| నో | య | యీ | యు | జ్యేష్ఠ | గో | సా | సి | సు | శతభిషం |
| యే | యో | బా | బి | మూల | సే | సో | దా | ది | పూ. భా |
| బూ | ధ | భా | ఢా | పూ. షా | దు | శం | ఝా | గ | ఉ. భా |
| బె | బో | జా | జి | ఉ. షా | దే | దో | చ | చి | రేవతి |

దీనికే "అవకహడా చక్రము" అని పేరు. పేరుయొక్క మొదటి అక్షరము ఏనక్షత్రజనితము నకు సంబంధించి యున్నదియు ఊహించి తెలుసు

కొని, ఆనక్షత్రమును, ఆపాదమును నిర్ధారణ చేయ వలయును.

శ్లో॥ అజ్ఞాతజన్మతారా యే తేషాం నామ గవేష్యతే ।
సంయోగాక్షరజే నామ్ని జ్ఞేయం తత్రాదిమాక్షరమ్ ॥

జన్మనక్షత్రము తెలియనివారలకు నామ నక్షత్రము నిర్ణయించబడినది. పేరునందు మొదట సంయుక్తాక్షరము ఉండియున్నచో దానియందలి ప్రథమాక్షరమును గ్రహింపవలయును. ఉదాహారణ:- ప్రద్యుమ్ననామమున 'ప' అను అక్షరము గ్రాహ్యము. హృషీకేశనామమున 'హ' గ్రాహ్యము.

శ్లో॥ బహూని యస్య నామాని స్యు ర్నరస్య కథంచన ।
తస్య పశ్చాద్భవం నామ గ్రాహ్యం శాస్త్రవిదో జనాః ॥

ఒకని పేరులో బహునామము లున్న యెడల కడపటి పేరు గ్రాహ్యము. ఉదాహారణ- శివరామ కృష్ణమూర్తి, వెంకటనరసింహమూర్తి. వీటిలో కడపటినామము కృష్ణమూర్తి, నరసింహమూర్తి గ్రాహ్యములు.

శ్లో॥ జన్మనా జన్మ కుర్వీత నామ్నా నామైవ యోజయేత్ ।
దుర్లభే యది జన్మర్క్షే పుంజస్య స్త్రీషు నామతః ॥

దంపతులలో పురుషుని జన్మనక్షత్రము మున్నప్పుడే స్త్రీజన్మనక్షత్రముతోను, పురుషునికి జన్మనక్షత్రము లేనప్పుడు స్త్రీకి జన్మనక్షత్రము ఉన్నను దానిని విడిచిపెట్టి స్త్రీనకూడ నామనక్షత్రకల్పన చేసి, తారాబల, రాశికూటాదికమును విచారింపవలయును. జన్మనక్షత్రములరీత్యా తారాబలాదికము కుదరనిచో (తగిన సంబంధము బహుర్లభము కాకుంటే) స్త్రీకి నామనక్షత్రకల్పనచేసి పురుషుని జన్మనక్షత్రముచేతను, స్త్రీకి కల్పితమైన నామనక్షత్రముచేతను తారాబలాదికము చూడవలయును. పురుషజన్మనక్షత్రమూర్పు పనికిరాదు.

శ్లో॥ నచేద్వరస్య జన్మర్క్షం న స్త్రీతారాప్రయోజనం ।
తదాపి ముభయో ర్నామనక్షత్రైణైవ చింతయేత్ ॥

వరునికి జన్మనక్షత్రము లేనప్పుడు స్త్రీకి జన్మనక్షత్రముఉన్నను ప్రయోజనములేదు. కాన అట్టిపరిస్థితిలో దంపతులిద్దరికిని నామనక్షత్రములతోనే తారాబలాదికము నాలోచించవలయును.

శ్లో॥ పితృష్వసృసుతాయాశ్చ సుతాయా మాతులస్య చ ।
వివాహో దినకూటాదీన్ అవిచార్య ప్రవర్తతే ॥

మేనత్తకూతురు, మేనమామకూతురు వీరిని

దినకూటాదికము కుదరక పోయినను వివాహము చేసుకొనవచ్చును.

శ్లో॥ నిజకూటాదసంబంధాం అన్యగోత్రసముద్భవాం।
వివహే ద్భావదూష్యేపి సా కుసంజ్ఞా న దోషదా ॥

తన జేష్ఠులతో సంబంధము లేకుండా అన్యగోత్రమునందు జనించిన కన్యకను భావదూష్యమైనను వివాహము చేసుకొనవచ్చును. అట్టి భావదూష్యము దోషము కాదు.

## అన్యగోత్రసంబంధనిషేధము

శ్లో॥ సాపత్న్యమాతుశ్చ పితృవ్యపత్న్యాః
స్వసారం మప్యాశ్చ స్తనయాం వినైవ।
తద్భిన్నబంధుష్వపి వా కుసంజ్ఞా
తద్భావదూష్యత్వ మశంకనీయమ్ ॥

సవతితల్లి చెల్లెలు, పినతండ్రిభార్య చెల్లెలు, వీరికుమార్తెలు— వీరిని వివాహము చేసుకొనరాదు. పింకంటు ఇతర బంధువర్గములో భావదూష్యమున్నను ఆభావదూష్యత్వమును గురించి సంశయింపనిలేదు.

శ్లో॥ స్వోపనేతాన్యగోత్రో వా నోద్వహేత్తత్సుతాంవామ్
తద్గోత్రే తత్కులే చాపి చోద్వహేన్నాత్ర సంశయః

ఉపనయనము చేసినవాడు అన్యగోత్రీకు డైనను వాని కుమార్తైను వివాహముచేసుకొన కూడదు. అతనియొక్క గోత్రమందుగాని, కుల మందుగాని జన్మించిన కన్యకను వివాహముచేసు కొనవచ్చును. గోత్రమనగా సోదరులు మొదలగు బంధువర్గము; కులమనగా బంధువులు.

## కుసంజ్ఞోద్వాహప్రతిబంధకం

శ్లో॥ కుసంజ్ఞోద్వాహతశ్చాన్య
సంజ్ఞాఽఽయాతి విపర్యయా।
తద్బంధుత్వాగ్ర్యా భూయాత్
భూయో భూయో భవిష్యతామ్॥

అన్యగోత్రసృష్టితో సన్నిహితబంధువులతో శావదూష్యవివాహము జరిగినచో అంతకు పూర్వ మేర్పడియున్న 'వావి' అంతరించి వ్యత్యస్తమైన మరియొక క్రొత్తవావి ఏర్పడును. దానివలన ముందుముందు బయలుదేరబోవువారలకు అను కూలించు బంధుత్వఘటన చెడిపోవుట తటస్థపడును.

శ్లో॥ వాగ్దానానంతరం యత్ర కులయోః కస్యచిన్మృతిః।
స్యాచ్చేత్తత్రశ్చ తదుద్వాహం నాత్ర కార్యా విచారణా॥

వివాహనిశ్చయానంతరము ఇరుపక్షముల లోను ఏపక్షమందైనను సన్నిహితబంధుమరణము తటస్థపడినయెడల ఆసంబంధమును రద్దుపరచవలయును. ఇందెంతమాత్రమును ఆలోచింపవలసిన పనిలేదు.

శ్లో॥ ప్రత్యుద్వాహో న కర్తవ్యః
నైకస్మై స్తుహితృద్వయం,
న చైకజన్యయోః పుంసోః
నైకజన్యే తు కన్యకే ॥

పిరాయింపుపెళ్లి (బావమరదులు ఒకరి సోదరిని, ఒకరు వివాహము చేసుకొనుట) పనికిరాదు. ఒకే వరునికి ఇద్దరు ఏకోదరసోదరీలను ఇవ్వకూడదు. ఏకగర్భజనిత సోదరులకు అక్కచెల్లెళ్లను ఇవ్వ కూడదు. సవతితల్లుల పిల్లలయినయెడల పనికి వచ్చును.

శ్లో॥ దత్తతా యది శాస్త్రీయా నిజసోదరదత్తయోః।
ఏకగర్భజసోదర్యా దిశం త్యత్ర న దూష్యతా ॥

హోమపురస్సరముగా శాస్త్రీయమైన దత్తతజరిగినచో ఆదత్తునికిని, జనకసోదరునికిని ఏకోదరకన్యకల నిచ్చి వివాహము గావింపబడుచున్నది. ఇది దూష్యము కాదు.

శ్లో॥ దత్తా దారభ్య తద్వంశ్యాః త్రిపూరుష మసంశయం ।
కన్యకాం నోద్వహే ద్దత్త జన్మగోత్ర సముద్భవామ్ ॥

తా॥ దత్తుడు మొదలుకొని నిస్సందేహముగా మూడు పురుషముల (దత్తుడు, అతనిపుత్రుడు, పౌత్రుడు) వరకును దత్తుని జన్మగోత్రమందు జనించిన కన్యకను వివాహము చేసుకొనకూడదు.

శ్లో॥ అన్యగోత్రస్య దత్తో వా స్వజన్మపితృగోత్రజాం ।
కన్యకాం తు కదావాపి నోద్వహే దాత్రిపూరుషాత్ ॥

తా॥ అన్యగోత్రికునకు దత్తుడైనప్పటికిని మూడు పురుషముల పర్యంతము (దత్తునిసంతతి) దత్తునిజనకతండ్రియొక్క గోత్రముగల కుటుంబమున జనించిన కన్యను వివాహము చేసుకొనకూడదు.

## కాలాతీతశుభ విషయము.

శ్లో॥ త్యక్త్వా మాఘాదికం స్వేచ్ఛం తారాబలయుతే దినే ।
గౌణాద్ధోర్ధ్వవ్రతోద్వాహౌ ప్రాయః కుర్వంతినిశ్చయాః ॥

శూన్యమాసాధికమాస మాఘాద్యములను విడిచిపెట్టి తారాబలానుకూలలగ్నమందు వారి వారి యిష్టానుసారము తరచుగా గౌణకాలాతీ

తమున్నైన ఉపనయనవివాహములను నిర్భయులై చేయుచున్నారు.

శ్లో॥ నిషేధకాభావతయా బుధాంగీ
కారేణ విత్తశ్రమలాఘవేన,
పరస్పరేషా మనువర్తనేన
సాంకర్యమేత్యద్య సమస్త కర్మ ॥

కూడదను అనతగినవారు (వారివారట చెల్లనందున) తటస్థులగుట, కొంతమందివిద్వాంసులంగీకరించుట, ద్రవ్యము- శ్రమ కలసివచ్చుట, అశాస్త్రీయాచరణాగావించినవారిని చూచి మరొక కార్యము నవలంబించుట- వీటివలన ఈకలియుగమున శ్రౌత స్మార్తకర్మలు సంకరము లగుచున్నవి.

## దత్తతార్హులు కానివారు.

శ్లో॥ స్త్రియశ్చ దత్తతా జ్యేష్ఠ సుతస్యైకసుతస్య చ ।
కదాచిన్నైవ కుర్వీతే త్యుక్తం సర్వై ర్మహర్షిభిః ॥

తా॥ స్త్రీయొక్కయు, జ్యేష్ఠపుత్రునియొక్కయు, ఒకేకుమారుడై యుండగా ఆ ఏక పుత్రునియొక్కయు, దత్తత ఎన్నడును పనికిరాదని మహర్షులందరును చెప్పియుండిరి.

## ఆషాఢమాసవర్జ్యము

శ్లో॥ వివాహానంతరాషాఢే నవోఢా శ్వశ్రుమందిరం ।
ప్రవిశేన్నైవచేత్యేవం ప్రాహుస్సర్వేమహర్షయః ॥

వివాహానంతరమువచ్చిన మొదటి ఆషాఢ మాసమున నూతనవధువు అత్తవారింటికి వెళ్ళ కూడదని మహర్షులు చెప్పియున్నారు.

శ్లో॥ దృశ్యతే ద్రవిడాచారే నియమోయం విపర్యయః ।
ఆనీయ ప్రథమాషాఢే వరం సంమానయంతి తే ॥

తా॥ ఆషాఢవర్జ్యనియమము ద్రవిడులలో మార్పుగా కనిపించుచున్నది. వారిలో వివాహా నంతరాషాఢమున (కర్కాటసంక్రమణదివసమున) వరుని తీసుకొనివచ్చి 'ఆవడపండుగ' అను పేరుతో సన్మానించుట గోచరించుచున్నది.

### జెడ్డలు

(1వ జెడ్డ) 1 పేరుడు (పితృపక్షం)

| | | | |
|---|---|---|---|
| 2. | రాముడు | అన్నతమ్ములు | లక్ష్మణుడు |
| 3 | కాముడు | అన్నచెల్లెలు | కావేరి |
| 4. | ఇంద్రుడు | బావమరదలు | శచి |
| 5. | చెన్నయ్య | అన్నచెల్లెలు | అంగన |
| 6. | శ్రీహరి | బావమరదలు | ఇందిర |

(2వ జట్టు) 1 వీరుడు (మాతృపక్షం)

2. రాముడు అన్నచెల్లెలు శాంత
3. కల్యాణి బావమరదలు కాముడు
4. లక్ష్మి అన్నచెల్లెలు చంద్రుడు
5. గౌరి బావమరదలు శివుడు
6. దత్తుడు అన్నచెల్లెలు మంజరి

(3వ జట్టు) 1 వీరుడు (అన్యగోత్రపక్షము)

2. అంజలి అక్కచెల్లెలు అంగన
3. మరీచి అక్కతమ్ముడు గిరీశం
4. లలిత వదినమరదలు వనిత
5. శూరుడు బావలు వీరుడు
6. బాలుడు అన్నచెల్లెలు సుకన్య

పాఠకులకు సుబోధకమిత్తమై పై జట్లు చూపబడినవి. సంతాన భేదముచే జట్లలోని పావులు మార్పునొందును. కూటస్థుడు అనగా సంతాన భేదము (ఆడ, మగ) కలవాడు.

## పితృపక్షమాతృపక్షనిర్ణయము

శ్లో॥ కూటస్థగణనాకాలే మనుష్య పితరం తథా ।
మాతరం చ సముద్దిశ్య విద్యాత్పక్షద్వయక్రమమ్ ॥

తా॥ మనుష్యునికి తండ్రిద్వారా పితృపక్షమును, తల్లిద్వారా మాతృపక్షమును ఏర్పడుచున్నవి.

శ్లో॥ స్వసారం మాతరం పుత్రీం నోద్వహేత
ద్విపక్షయోః।
కేచి దాహుః క్వచిద్దేశే పుత్రికా ముద్వహే దితి॥

తా॥ పితృపక్షమాతృపక్షములు రెండింటి యందును చెల్లెలు, తల్లి, కూతురు వావివచ్చిన స్త్రీని వివాహము చేసుకొనరాదు. కొన్నిదేశముల యందు కొందరు కూతురువావి పనికివచ్చుననిరి.

శ్లో॥ చతుర్థీ ముద్వహే త్కన్యాం చతుర్థః పంచమీ మపి।
పారాశర్యమతా త్షష్ఠీం పంచమో నతు పంచమీమ్॥

తా॥ 4వ పురుషుడు 4వ స్త్రీని, 5వ స్త్రీని కూడ వివాహము చేసుకొనవచ్చును. పరాశర మహర్షిమతానుసారము 6వ స్త్రీనికూడ వివాహము చేసుకొనవచ్చును. 5వ పురుషుడు 5వ స్త్రీని వివాహము చేసుకొనరాదు.

నిర్వచనము :- మొదటిజెట్టులో 4వ వాడైన ఇంద్రుడు మరదలువరుసను 4వదైన శచిని, కూతురు వరుసను 5వదైన అంగనను, మనుమరాలు వరుసను 6వదైన ఇందిరను వివాహము చేసుకొనవచ్చును. 5వ వాడైన చెన్నయ్య పితృపక్షముచే చెల్లెలు వావివచ్చిన 5వది యగు అంగనను వివాహము

చేసుకొనకూడదు. నాలుగవదైన శచికి కూతురై
5వదియగు అంగనను 'శచి' తనకు మేనమా
కుమారుడు బావ యగు 4వ ఇందునికి కూతు
వరుస ఇచ్చి వివాహము గావింపబడుచున్నది.

పురుషుడు తన కుమార్తెను తన మే
మామ కుమారునికిచ్చి వివాహమును జరుపు
న్నట్లే స్త్రీకూడ తనకుమార్తెను తన మేనమా
కుమారునికిచ్చి వివాహము జరుపబడుచున్నది.

శ్లో॥ తృతీయాం వా చతుర్థీం వా పక్షయో రుభయో రపి ।
వివహేత్తాం మనుః ప్రాహ పారాశర్యోంగిరాయమః ।

తా॥ మాతృపక్షంలో 3వ వాడైన కామ
నకు, మేనమామకూతురైన 3వ కల్యాణికిని, పితృ
పక్షంలో 4వవాడైన ఇందునకు, మేనత్తకూతురైన
4వ శచికిని వివాహము పనికివచ్చును.

శ్లో॥ అసంబంధా చ యా మాతు రసంబంధా చ యా పితుః ।
స్వసృసంజ్ఞాం మాతృసంజ్ఞాం నోద్వహేదితిగౌతమః ।

తా॥ మాతృపక్ష, పితృపక్షములలో సంబం
ధము లేనప్పుడు (అసపిండమందు) చెల్లెలువావి
తల్లి వావివచ్చినను వివాహము పనికివచ్చును.

శ్లో॥ పంచమః పంచమీం కన్యాం నోద్వహేదితి యద్వచః ।
పితృపక్షే నిషేధోయం మాతృపక్షే న తద్భవేత్ ॥

5వ పురుషుడు 5వ స్త్రీని వివాహము చేసు కొనకూడ దనుమాట పితృపక్షమునకు సంబంధిం చినది; మాతృపక్షమునకు సంబంధించినదికాదు అనియు సప్తమహర్షులలో 5వ వాడగు గౌతముని భార్య అహల్యావృత్తాంతము చే ఈ నిషేధము నిర్ణ యింపబడినదేమో అని తోచుచున్నది.

## వి వా హ వే ది క

శ్లో॥ వితస్త్యుచ్చం పితుర్హస్తైర్వ్యాప్తాం కల్యాణవేదికాం ।
విశాలోర్వ్యాశం గృహస్యారాత్ కుర్యాత్పంకుచితే గృహే ॥

వివాహసమయమున బంధుమిత్రాదులు కూర్చుండుటకు ఇంటివిశాలము చాలనప్పుడు ఇంటి సమీపమున ఇంటితో సంబంధించియున్న ప్రదేశ ముందు 4 మూరలు (2 గజములు) చతురముగల ట్లు అడుగును జాన ఎత్తు కలిగియుండునట్లు నిర్మింపవలయును. ప్రాచీనగ్రంథములలో మూర ఎత్తు చెప్పబడినది.

గరిమెళ్ళ రామకృష్ణశాస్త్రి (పురోహిత్)

## సర్వసామాన్యశుభనక్షత్రములు

శ్లో॥ మూలాశ్వినీరోహిణిహస్తచిత్తా
స్వాత్యుత్తరారేవతిపుష్యవైద్యాః ।
మృగానురాధా శ్రవణం ధనిష్ఠా
పునర్వసు స్సప్తదశ ప్రసిద్ధాః ॥

మూల అశ్వని రోహిణి హస్త చిత్త స్వాతి ఉత్తర ఉత్తరాషాఢ ఉత్తరాభాద్ర రేవతి పుష్యమి శతభిషం మృగశిర అనూరాధ శ్రవణం ధనిష్ఠ పునర్వసు- ఈ 17 నక్షత్రములును సర్వదా శుభకార్యములయందు పనికివచ్చును.

## నిషిద్ధనక్షత్రములు

శ్లో॥ పుష్యో వివాహే గమనే చ చిత్తా
తథైవ మూలామిథునక్రియాయాం ।
గృహప్రవేశే పరివర్జనీయాః
స్వాత్యర్కదస్రాదితివైష్ణవా స్స్యుః ॥

వివాహమందు పుష్యమి, ప్రయాణమందు చిత్త, గర్భాధానమందు మూల, నూతనగృహ ప్రవేశమందు స్వాతి, హస్త, అశ్వని, పునర్వసు, శ్రవణం ఎంతమాత్రముచు పనికిరావు.

# పెండ్లి కుమారుని, పెండ్లి కుమార్తెను చేయుటకు

శ్లో॥ కుర్యాన్నేందా్వఽఽరభృగుషు వరం పీతం న తాడయేత్ ।
వివాహ స్సర్వవర్ణానాం శుక్రవారే ప్రశస్యతే ॥

సోమ, మంగళ, శుక్రవారములయందు పెండ్లికుమారుని, పెండ్లికుమార్తెను చేయకూడదు. పసుపుకొమ్ములను చిదుకకొట్టరాదు. సర్వవర్గముల వారికిని శుక్రవారము వివాహమునకు ప్రశస్తమైనది.

## శుభత్రయనిషేధము

శ్లో॥ శుభత్రయం నైకగేహే నైక స్సత్రి శుభత్రయం ।
నైవాచరే ద్వత్సరార్ధే ఇతి ప్రాహు ర్మనీషిణః ॥

12 మాసములలోగా ఒకే ఇంటియందు 3 శుభకార్యములు పనికిరావు. ఒకే గృహస్థు 3 శుభకార్యములను చేయకూడదు. ఇట్లని ప్రాజ్ఞులు చెప్పుచున్నారు.

శ్లో॥ మండపాగ్ని హోత్రిణాం
యతీనాం బ్రహ్మచారిణాం ।
దారాణాం విధవానాం చ
గృహశల్యోలదం త్రియమ్ ॥

మంచములు, దీపములు, అగ్నిహోత్రములు, సన్న్యాసులు, బ్రహ్మచారులు, ద్వారములు, పూర్వ సువాసినీలు (విధవాంగనలు) ముగ్గుడుగల ఇల్లు అల్ల కల్లోల్లమై యుండును.

శ్లో॥ కేశఖండనసీమంతవివాహోపనయా న్బుధాః ।
సుమంగళ మిత్యాహుః తదన్యల్లఘుమంగళమ్ ॥

కేశఖండన (చౌలము), సీమంతము, వివాహము, ఉపనయనము ఈనాలుగును సుమంగళములనియు, వీటికంటె ఇతరములైనవి లఘుమంగళములనియు పండితులు చెప్పుచున్నారు.

శ్లో॥ పితృయజ్ఞక్రియాయాశ్చ జ్యేష్ఠమంగళతః పరం ।
ఋతుత్రయం పునర్యావత్ న కుర్యాల్లఘుమంగళమ్ ॥

పితృయజ్ఞమునకును, జ్యేష్ఠమంగళమునకును పరమందు ఆరుమాసములకులోగా మాసపరిధానకర్మగాక తదితరములైన లఘుమంగళములను చేయకూడదు.

## మాసపరిధానకర్మలు

శ్లో॥ పరిసమాప్తిప్రయాణే చ మాసప్రోక్తేషు కర్మసు ।
నాస్తాశౌచాధిమాసాదిదోషః కాలవిధే ర్బలాత్ ॥

పురిటినిమిత్తమైన ప్రయాణము, మాస ప్రధానకర్మలు వీటియందు సంవత్సరసూతకము, అధికమాసము, మౌఢ్యము, శూన్యమాసము మొదలగువాటియొక్క దోషము కాలవిధి యొక్క బలమువలన లేదు.

శ్లో॥ సర్పాసురాదిగ్రహరోగశాంతి
ష్వలభ్యయోగే గ్రహణాభిషేకే।
దోషప్రయుక్తేష్వఖిలవ్రతేషు
చోత్పాతశాంతౌ నచ మౌఢ్యదోషః॥

ఆశ్లేష, మూల మొదలయిన గండనక్షత్రములు, దుష్టగ్రహసంచారము, రోగము వీటియొక్క జప, హోమదానాదిశాంతులయందును హఠాత్సిద్ధములైన సూర్యగ్రహణాదిశాంతులయందును, దోషయుక్తప్రాయశ్చిత్తాదులయందును, ప్రమాదకరమైన పక్షిశాంతి మొదలగు వాటియందును మౌఢ్యాదిదోషము లేదు.

శ్లో॥ గర్భేవార్ధుషికే కృత్యే శ్రాద్ధకర్మణి మాసికే।
సపిండకరణే నిత్యే నాధిమాసం వివర్జయేత్॥

గర్భిణిస్త్రీమాససంఖ్య. నాకరుజీతము., ఆబ్దికము, మాసికము, సాపిండము (దినవారము),

నిత్యకర్మ వీటియందు అధికమాసమును విడిచి పెట్టకూడదు.

## వివాహానంతరగౌరీపూజ

శ్లో॥ నభోమాసి సమూఢే వా వివాహానంతరాగతే,
పూజితత్వాద్వివాహాదౌ గౌరీ పూజ్యా న సంశయః॥

వివాహమునకు ముందుగానే 'గౌరీతపస్సు' అను పేరుతో గౌరీపూజ ప్రారంభింపబడియున్నందున వివాహానంతరమున వచ్చిన శ్రావణమాసము మౌఢ్యమైనను కుజగౌరీవ్రతమును నిస్సందేహముగా చేయవచ్చును.

## ప్రతిశుక్రదోషము.

శ్లో॥ ఏకగ్రామే చతుశ్శాలే వివాహే యజ్ఞకర్మణి।
దుర్భిక్షే రాజకలహే ప్రతిశుక్రం న విద్యతే॥

గ్రామములోనే జరుగు గృహప్రవేశమందును, చతుశ్శాలయందును, యజ్ఞకర్మయందును దుర్భిక్షమందును, రాజకలహమందును ఎదురు శుక్ర-వాలుశుక్ర అను దోషము లేదు.

## సింహగురుదోషాపవాద

శ్లో॥ మఘార్ధయుక్తసింహస్థం గురుం యత్నేన వర్జయేత్।
తదూర్ధ్వసింహభాగేషు వివాహాది ర్విధీయతే॥

బృహస్పతి సింహరాశిలో మఘానక్షత్రము
నందున్నంతవరకే వివాహాదులు పనికిరావు.
పుబ్బానక్షత్రమందు ప్రవేశించినది మొదలు
సింహరాశిగతుండైనను వివాహాదులను చేయ
వచ్చును.

## రాత్రికాలనిషిద్ధకర్మలు

శ్లో॥ కృషిం బీజవాపం నరేంద్రాభిషేకం
కలాగారనిర్మాణదేవప్రతిష్ఠాః ।
వ్రతం నామచౌలం వ్రతాని క్షపాయాం
న కుర్వం త్యమీషు ప్రధానోఽష్టశుద్ధిః ॥

వ్యవసాయ ప్రారంభము, విత్తులుచల్లుట,
లతావృక్షాదిస్థాపన, ఉద్యోగారంభము, విద్యా
ప్రారంభము, శంకుస్థాపన, దేవతాప్రతిష్ఠ, ఉపన
యనము, నామకరణము, చౌలము, వేదవ్రతములు
(ఆగ్నేయ ప్రాజాపత్య సౌమ్య వైశ్వదేవవ్రత
ములు) వీటిని రాత్రికాలమున చేయకూడదు.

## విశేషవిధి

శ్లో॥ కుర్యా ద్రాత్రే తృతీయాంశే బీజావాపం కృషిం
గృహం ।
ఉదయాత్పరతశ్చౌలం నామోద్యోగం కలాం వ్రతమ్॥

గరిమెళ్ళ రామకృష్ణశాస్త్రి (...

విత్తులుచల్లుట, లతావృక్షాదిస్థాపన, కృషి ప్రారంభము, శంకుస్థాపన వీటిని రాత్రియొక్క మూడవభాగమున చేయువచ్చును. ఉపనయనము, ఉద్యోగారంభము, విద్యాప్రారంభము, నామకరణము, చౌలము (కేశఖండన) వీటిని సూర్యోదయానంతరము చేయవలెను.

శ్లో॥ శ్రోణోత్తరాత్రయేశేజ్యవిధిష్వర్కేందువారయోః ।
సర్వబీజాని ఫలినః గురౌ శుక్రే లతాదికమ్ ॥

ఆదివారసోమవారములతో కూడిన శ్రవణ ఉత్తర ఉత్తరాషాఢ ఉత్తరాభాద్ర ఆర్ద్ర పుష్యమి రోహిణి నక్షత్రములయందు ఏవిధమైనపైరు నాటబడినను సమృద్ధిగా ఫలించును. గురువారశుక్రవారములతో కూడిన పై నక్షత్రములయందు పుష్ప ప్రధానములైన లతావృక్షాదులను నాటవలయును.

## సుముహూర్త విషయము

శ్లో॥ ఉద్వాహాదిషు చైకవింశతిమహాదోషాన్విసృజ్యేతరాన్
స్వల్పాన్దోషగణాన్గుణాంశ్చ గణితాన్నిశ్చిత్య శాస్త్రోత్థితం ।
లగ్నం యత్రిగుణాధికం చ సకలైః గ్రాహ్యం దోషాధికం
బ్రహ్మావ పరిహర్తుమత్ర సకలాన్దోషాంశ్చ మర్త్యో నహి ।

ఏకవింశతి మహాదోషములుగాక తక్కిన స్వల్పదోషములను, సుగుణములను శాస్త్రరీత్యా నిర్ణయించి ఏలగ్నమందు దోషములకంటె సుగుణములధికముగ నుండునో ఆలగ్నమును గ్రహింపవలయును. దోషము లధికముగానున్న లగ్నమును విడువవలయును. స్వల్పదోషములైనను లేకుండునట్లు లగ్నమును నిర్ణయించుటకు బ్రహ్మకూడ సమర్థుడు కాడు.

శ్లో॥ యావత్స్పందతి లోచనం సుఖకరం తత్కోటిభాగో భవేత్
తల్లగ్నే శుభకాల ఏవ సతతం బ్రహ్మా న జానాతి తం।
అన్యే కిం పునరేవ కస్తు రథ తత్కాల స్ఫుటో వా శుభః
పూర్వాదృష్టవశా ద్భవే త్సమయవి త్తత్సాక్షిమాత్రం సదా ॥

సుఖకరముగా కదల్పబడిన కనురెప్పపాటులో కోటివంతు పరిమాణకాలము లగ్నమునందుగల శుభకాలపరిమాణము. ఆశుభకాలమును బ్రహ్మకూడకనిపెట్టలేడు. అట్టిశుభకాలమును మనుష్యులు కనిపెట్టగలరని చెప్పుట కవకాశములేదు

గాన వారివారి జన్మాంతరపుణ్యపాపకర్మననుసరించి లగ్నము తటస్థపడును. లగ్ననిర్మాత సాక్షి మాత్రుడేకాని లగ్నసంధాత కాడు.

శ్లో॥ పరిత్యజ్య మహాదోషాన్ శేషయో ర్గుణదోషయోః।
గుణాధికస్స్వల్పదోషం సకలం మంగళప్రదమ్॥

ఏకవింశతి మహాదోషములను విడిచిపెట్టి తదితరములైన గుణదోషములను పరిశీలించి గుణములు అధికముగా కలది, దోషములు స్వల్పముగా కలది అగు సుముహూర్తము గ్రహింపతగినది.

## గ్రాహ్యముహూర్తము

శ్లో॥ కేంద్రత్రికోణభవనేషు శుభగ్రహేషు
పాపగ్రహేషు చ తథా త్రిషడాయగేషు।
దృష్టేషు లగ్నశశిలగ్నపతిష్వపాపైః
సౌమ్యేషు పాపిషు జయేషు చ తదుక్తబుద్ధౌ॥

శుభగ్రహములు కేంద్రములయందును, కోణములయందును, పాపగ్రహములు 3, 6, 11 స్థానములయందును ఉండి లగ్నము, చంద్రుడు, లగ్నాధిపతి శుభులచే (పూర్ణచంద్ర, బుధ, గురు, శుక్రులచే) చూడబడుచుండి లాభస్థానమున (11వ యింట) శుభులును, పాపులును ఉండి,

కర్మలకు, ఏయే స్థానశుద్ధులు చెప్పబడినవో ఆశుద్ధి కలిగియున్న లగ్నము గ్రాహ్యము-1,4, 7, 10 స్థానములకు, కేంద్రములనియు, 1,5,9 స్థానములకు కోణములనియు, 3,6,11 స్థానములకు ఉపచయములనియు సంజ్ఞ.

## త్యాజ్యముహూర్తము

శ్లో॥ పాపగ్రహాక్రాంతభపాపలగ్న
పాతోదయాస్తాంశకదుర్ముహూర్తాః ।
అవక్రశుద్ధిగ్రహణాష్టమేందు
గండాంతదోషా స్సకలాస్తమాష్యాః ॥

పాపగ్రహాక్రాంతనక్షత్రము, పాపగ్రహస్థితలగ్నము, వ్యతీపాత, ఉదయాస్తాంశశుద్ధి రాహిత్యము, దుర్ముహూర్తము, విషఘడియలు, వక్రితశుద్ధిలేకుండుట, గ్రహణదూషితనక్షత్రము, అష్టమచంద్రుడు, గండయోగము- ఇట్టి లక్షణములుగల లగ్నము సర్వకర్మలయందును విడిచిపెట్టతగినది.

## పుష్యమీనక్షత్రప్రశంస

శ్లో॥ గ్రహైర్విద్ధోప్యశుభాన్వితోపి
విరుద్ధతారోపి విలోమగోపి ।

కరోత్యవశ్యం శుభకార్యసిద్ధిం
విహాయ పాణిగ్రహమేవ పుష్యః ॥

పుష్యమీనక్షత్రము, గ్రహావేధ, పాపగ్రహసంబంధము, తారాదోషము, ఇతరదోషములు కలిగియున్నప్పటికిని తలంచిన కార్యసిద్ధిని తప్పక నెరవేర్చును. ఈనక్షత్రమందు వివాహముహూర్తము పనికిరాదు.

## లగ్నవిషఘడియలు

శ్లో॥ అజవృషభధనుఃకన్యకాదౌ భుజంగః
ఝషమకరకుళీరే వృశ్చికాంతే చ రాహుః ।
మిథునఘటతులానాం సింహమధ్యేతు గృధ్రః
సకలమునిమతం స్యా త్సర్వకార్యేషు వర్జ్యమ్ ॥

మేష, వృషభ, ధనుః, కన్యాలగ్నముల యందు మొదట 'భుజంగము'; మీన, మకర, కర్కట, వృశ్చికములుచివర 'రాహువు'; మిథున కుంభ, తుల, సింహ లగ్నములకు మధ్య 'గృధ్రము' అనుపేర్లుగల దుర్ముహూర్తములు 30 విఘడియలు. వీటిని దాటించియే ఆయా లగ్నపుష్కరలు నిర్ణయింపబడెనవి.

## లగ్నపుష్కరఘడియలు

శ్లో॥ కర్కాట్యాంద్వాదశవృశ్చికే విఘటికాశ్చైకావృషేద్వాదశ ద్వావింశద్యువతౌ మృగే సగమితి ర్మేషే సగేషు ర్ద్వయం । సింహేష్వార్గజవహ్నయశ్చ కలశే రాజా తు నాడీత్రయం, యుగ్మే తౌళిగృహే చతుర్దశ చతుర్మీనే ద్విపంచాంబరమ్॥

| గం. ని. | లగ్నములు | | |
|---|---|---|---|
| 1 – 12 | కర్కాటకం | 3–38 | సింహం |
| 1 – 12 | వృశ్చికం | 3–38 | ధనుస్సు |
| 1 – 12 | వృషభం | 3–16 | కుంభం |
| 2 – 22 | కన్య | 4–14 | మిథునం |
| 2 – 07 | మకరం | 4–14 | తుల |
| 2 – 57 | మేషం | 0–52 | మీనం |

## జన్మతారాప్రాధాన్యత

శ్లో॥ జన్మర్క్షం జన్మమాసశ్చ సదా జన్మదినం శుభం ।
స్త్రీణాం జన్మత్రియం శ్రేష్ఠం వివాహే సర్వసమ్మతమ్॥

జన్మనక్షత్రము, జన్మమాసము, జన్మతిథి అను ఈమూడును వివాహవిషయమై స్త్రీలకు అతి ముఖ్యము. దీనికే జన్మత్రయం అని సంజ్ఞ.

శ్లో॥ ధూనంబంధే వ్రతే చౌలే ప్రాశనే కృషికర్మసు ।
విద్యారంభే తథోద్యోగే జన్మతారా ప్రశస్యతే॥

భూమితో సంబంధించిన గృహాదివ్యాపారము, ఉపనయనము, చౌలము (కేశఖండన, అన్నప్రాశన, వర్తకవ్యవసాయోద్యోగాదిః) విధకృషులు, విద్యారంభము వీటియందు జన్మతార ముఖ్యము.

## వివాహలగ్న నవాంశ

శ్లో॥ గోయుగ్మకన్యావణిజ శ్చరాదిః
శుభా నవాంశేషు వివాహలగ్నే ।
మృగత్రయాజాహరికర్కికీటాః
ధనుః పరం వామతృశాం వివాహే ॥

వివాహవిషయమై స్త్రీలకు, వివాహలగ్నమందు వృషభ, మిథున, కన్యా, తులానవాంశలును, ధనుర్నవాంశ పూర్వభాగమును ప్రశస్తములు. మకర కుంభ మీన మేష సింహ కర్కాట వృశ్చిక నవాంశలును, ధనుర్నవాంశాపరభాగమును నింద్యములు. పూర్వకాలామృత తృతీయ బిందువునందలి 76వ శ్లోకమును చూచి సవిస్తరముగా తెలుసుకొనవలెను.

## మౌఢ్యనిర్ణయము

శ్లో॥ గురావస్తంగతే వాపి శుక్రేవస్తంగతే తథా ।
తన్మాఢమితి తత్కాలం సర్వదేశేషు విశ్రుతమ్ ॥

తా॥ గురుడు అస్తమించినపుడు గురుమౌఢ్యం అనియు, శుక్రుడు అస్తమించినపుడు శుక్రమౌఢ్యం అనియు సంజ్ఞ.

## మూఢాపవాద

శ్లో॥ ఏకో మూఢో భవే దన్యః స్వోచ్చమిత్రాంశగో యది ।
స్వకీయక్షేత్రసంస్థో వా మూఢదోషో న విద్యతే ॥

తా॥ గురుశుక్రులు ఇద్దరిలోను ఒకరు అస్తమించియుండగా రెండవవాడు ఉచ్ఛస్థుడైగాని, మిత్రక్షేత్రవర్తియైగాని, మిత్రాంశవర్తియైగాని స్వక్షేత్రవర్తియైగాని ఉన్నయెడల మౌఢ్యదోషము లేదు.

## మౌఢ్యవర్జ్యములు

శ్లో॥ వాపీకూపతటాకయాగగమనక్షౌరప్రతిష్ఠావ్రతం
విద్యామందిరకర్ణవేధనమహాదానం వనస్థాపనం ।
తీర్థోద్వాహజపాభిషేక మఖిలాన్దోషప్రయుక్తేతరాన్
దూరేణైవ జిజీవిషుః పరిహరే దార్యే స్తగే వా సితే ॥

తా॥ బృహస్పతిగాని, శుక్రుడుగాని అస్తంగతుడై యుండగా, దీర్ఘాయువునుకోరువాడు దిగుడు బావులు, నూతులు, చెరువులు, యజ్ఞయాగాది క్రతువులు, దూరదేశప్రయాణము, క్షౌరము,

దేవతాప్రతిష్ఠ, ఉపనయనము, నూతనవిద్యాప్రారంభము, గృహనిర్మాణము, కర్ణవేధ, షోడశమహాదానములు, వనస్థాపన, తీర్థయాత్ర, వివాహము, మంత్రోపదేశము, పట్టాభిషేకము, దోషనివారణార్థమై చేయబడు శాంతులవంటి ఇతరకార్యములు వీటిని చేయక విడిచిపెట్టవలయును.

## షోడశమహాదానములు

శ్లో॥ కన్యోర్ణాయు సువర్ణలాంగలగజక్ష్మాకాలచక్రోర్వరా
శయ్యామందిరమేషవాజిశకటాశ్వామిత్రికృష్ణాజినం
సాలగ్రామశితేతి కేచన వినా శయ్యోర్వరా శ్యాఖినో
రథాశ్వంశ్చోభయతోముఖీతిలశిలాః కాలాత్మదాసీర్జగుః॥

కన్య, గొఱ్ఱె, సువర్ణము, నాగలి, ఏనుగు, భూమి, కాలచక్రము (యమదండము), పంటతో నిలిచియున్న భూమి, మంచము, గృహము, మేక, గుఱ్ఱము, బండి, దున్నపోతు, కృష్ణాజినము, సాలగ్రామము— ఈపదహారును మహాదానములు. కొందరు మంచము, పంటభూమి, సాలగ్రామము, కృష్ణాజినము, గొఱ్ఱె— వీటికి బదులుగా ఉభయతోముఖి, తిలలు, పర్వతము, కాలపురుషుడు, దాసి అనువానిని చెప్పుచున్నారు. ఆవు ఈనుచుండగా దూడ భూ

పతనముగాకుండ రెండు ముఖములు ఏర్పడియున్న సమయమున ఉభయతోముఖి అనియు, లెక్కింపకుండా కుప్పగాపెట్టిన నాణెములకు శిల (పర్వతము) అనియు సాంప్రదాయము.

## వన (సంజ్ఞ) భోజనవిషయము

శ్లో॥ సాశ్వత్థనింబామలకామ్రబిల్వ
కపిత్థవాపీతటతింత్రిణీకే ।
వనే ద్విజైర్బంధుభి రూర్జమాసే
భోక్తా వనీశ శ్శతజన్మసు స్యాత్ ॥

రావి, వేప, పెద్దఉశిరిక, మామిడి, మారేడు, వెలగ, నుయ్యి, మఱ్ఱి, చింత- వీటితో కూడియున్న వనమందు కార్తికమాసమునందు ఏరోజునైనాసరే ఏగృహస్థుడు బ్రాహ్మణులతోను, బంధువులతోను కూడి భోజనము చేయునో ఆ గృహస్థుడు వరుసగా నూరుజన్మలయందు జగదీశ్వరుండై జన్మించును. దీనికి దృష్టిదోష మనున దెంతమాత్రమును లేదు. ఇది సనాతనాచారసిద్ధ విషయము.

## వివాహానంతరవిషయము

శ్లో॥ పత్నీవియోగే ప్రథమే చ వర్షే
నోచేద్ద్వితీయే పునరుద్వహేత్సః ।
అయుగ్మమాసేషు శుభం వదంతి
వసిష్ఠగర్గాదిమునీంద్రవర్యాః ॥

కళత్రవియోగము తటస్థపడిన పురుషుడు సరి బేసి మాస వివక్షలేకుండ మొదటి సంవత్సరమున ద్వితీయవివాహము చేసుకొనవచ్చును. రెండవ సంవత్సరమం దైనచో భార్య చనిపోయినది మొదలు బేస మాసములలో చేసుకొనవచ్చును.

శ్లో॥ ఏకగ్రామే పృథాకారే న సపిండ శ్శుభం చరేత్ ॥
తదానీ మితరగ్రామే శ్రేయస్సాకుమ శ్శుభం చరేత్ ॥

జాతాశౌచమృతాశౌచము లను వదలుకొన్నవారైనను ఒక్కేగ్రామమున సగోత్రికుని ఆబ్దికము జరుగుచుండగా వివాహము పనికిరాదు. ఆరోజునే వివాహము తప్పనిసరి అయినయెడల అన్యగ్రామమున చేయుట శ్రేయస్కరము.

## నూతనవధూగృహప్రవేశము

శ్లో॥ వివాహాత్షోడశాహస్సు విశేత్పతిగృహం వధూః ।
ఏకత్రిపంచమాష్టేవా న పశ్చాచ్ఛాత్రశోధనమ్ ॥

నూతనవధువు వివాహదినము మొదలు 16 రోజులకు లోగా అత్తవారింట గృహప్రవేశము కావలయును. అట్లు జరుగనియెడల 1, 3, 5 సంవత్సరములలో ప్రవేశింపవలయును. అటుపైన శాస్త్రప్రశంసతో పనిలేదు. ఇది రజస్వలాపూర్వము వివాహము కాబడిన స్త్రీవిషయము.

## సద్యస్కాలావశ్యక ముహూర్తము

శ్లో॥ ప్రాప్తే హఠా జ్జాతు విదేశయానే
దురామయే విప్లుతేపి లగ్నే ।
ప్రాప్యార్థనష్టేంగబలవ్యపాయే
శుభం వరే దేవగృహే చరంతి ॥

తలవనితలంపుగా దేశాంతరగమనము తటస్థపడినప్పుడును, జీవితాశలేని అసాధ్యవ్యాధి సంప్రాప్తమైనప్పుడును, నిశ్చితలగ్నము కారణాంతరముచే అడ్డిపోయి శూన్యమాసమౌఢ్యాదులచే కాలవిలంబమేర్పడుటవలన, సిద్ధపరచుకొనబడిన భోజనసామగ్రి చెడిపోవుటవల్లను, నివాసపరివర్తనచే కార్యమునకు సరిపడునట్లు రాబోవు ద్రవ్యమునకు భంగము కలుగబోవునప్పుడును, విభక్త్యాది వ్యవహారముచే అంగబలము చెదరిపోవునప్పుడును

గొంరను దేవతాగారమున అప్పటికప్పుడు శుభ
ముహను నెరవేర్చుచున్నారు.

## అభిజిద్గోధూళీలగ్నములు

శ్లో॥ సూర్యాచ్చతుర్థం యల్లగ్నం అభిజిత్సంజ్ఞికం హి తత్ ।
సూర్యాత్సప్తమలగ్నం చ గోధూళిక మితిస్మృతమ్ ॥

సూర్యోదయలగ్నముతో సహా 4వ లగ్నము అభిజిల్లగ్నమనియు, 7వ లగ్నము గోధూళికలగ్నమనియు చెప్పబడినది.

## అభిజిన్ముహూర్త విశేషము

శ్లో॥ ఉత్పాతవిష్టివ్యతిపాతపూర్వాన్
నిహంతి దోషానభిజిన్ముహూర్తః ।
వ్రతంచ యామ్యా మపహాయ కార్య
కర్తుః ప్రయాతు ర్దిశతి స్వహృద్యమ్ ॥

అభిజిన్ముహూర్తము- ఉత్పాతదోషములు, విష్టికరణము, వ్యతీపాతదోషము మొదలగువాటిని పోగొట్టును. ఉపనయనము, దక్షిణాదిక్ప్రయాణము గాక తదితరములైన పనులను గావించినను, ఏదిక్కునకు ప్రయాణమైపోయినను, కార్యకర్తకును,

ప్రయాణికునకును ఏకోరికలు కలవో వాటినన్నిటిని
నెరవేర్చును.

శ్లో॥ స్యాదప్యంగో భిదాహ్వయే చ నిలయే ధిష్ణ్యే ముహూర్తే
తథా
రోగస్స్యాద్యశుభస్య చోత్తరదళాద్యృక్షేషు పంచస్వపి
దుఃఖం దక్షిణదిక్ప్రయాతు రథవా నాన్యత్ర యాతు
స్త్వయం
మీనేచేదథ సర్వదిక్షుగమనం యాతుశ్చ వక్రింభవేత్ ॥

అభిజిల్లగ్నమందును, అభిజిన్నక్షత్రమం
దును, అభిజిన్ముహూర్తమందును ప్రయాణము
చేయువారికి శుభకరమనియు, ధనిష్ఠానక్షత్రోత్త
రార్థము మొదలు రేవతివరకుగల పంచకమందు
దక్షిణదిక్కునకుపోవువారికి రోగకరమనియు,దక్షిణ
దిక్కుగాక ఇతరదిక్కులకు పోవువారలకు శుభకర
మనియు పక్షాంతరముచే మీనమందు చంద్రుడుం
డగా ప్రయాణమును ఏదిక్కునకైనాసరే చేయు
వారికిసమస్తకోరికలుసిద్ధించుననియు తెలియవలెను.
ఈశ్లోకము పూర్వకాలామృతము పంచమబిందువు
177 శ్లోకము.

## ప్రయాణానర్హ తిథులు

శ్లో॥ ప్రయాణే పాడ్యమీ షష్ఠీ చాష్టమీ ద్వాదశీ తథా ।
పంచ పర్వాణి రిక్తాశ్చ నవమీ చ వినిందితాః ॥

ప్రయాణ విషయమై పక్షద్వయగత పాడ్యమి, అష్టమి, ద్వాదశి, పంచపర్వములు, రిక్త తిథులు, నవమి నిందితములుగా చెప్పబడినవి.

## ప్రయాణానర్హ నక్షత్రములు

శ్లో॥ భరణీ కృత్తికార్ద్రా చ సర్పద్వయభగత్రయం ।
చిత్తాస్వాతివిశాఖేంద్రాః ప్రయాణే దూష్యతారకాః ॥

భరణి, కృత్తిక, ఆర్ద్ర, ఆశ్లేష, మఘ, పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, చిత్త, స్వాతి, విశాఖ, జ్యేష్ఠ ఈనక్షత్రములు ప్రయాణ విషయమున నిందితములు.

శ్లో॥ క్షీరం క్షౌరం గుడం మద్యం భక్ష్యం మాంసం పరాన్నకం ।
అభ్యంగం కలహం చైవ ప్రయాణదివసే త్యజేత్ ॥

క్షీరపానము, క్షౌరము, పానకము (బెల్లం), మద్యము, భక్ష్యం (మిఠాయి, బొబ్బట్లుమున్నగునవి) మాంసము, ఇంటినుండి గుమ్మందిగినపిమ్మట తింగి

ంటిలోనికి వెళ్లుట, తలంటుకొనుట, కలహాము
టిని ప్రయాణదినమున విడిచిపెట్టవలయును.

## ప్రయాణనిషిద్ధనక్షత్రములయందు త్యాజ్యఘడియలు

శ్లో॥ శాక్రే సప్తనవేశ్వరే దశ యమే పూర్వాత్రయే షోడశ
త్వాష్ట్రే పంచదశానలే నవదశద్వావింశతిః పైతృభే।
స్వాతౌ ద్వాదశసార్పభే నవదశాప్యైంద్రాగ్నిభే తారకాః
ఏతా యాతృభయార్తిదా అథశుభాస్సంత్యోత్తరా నాడికాః

జ్యేష్ఠకు 7, ఆర్ద్రకు 9, భరణికి 10, పుబ్బ పూర్వాషాఢ పూర్వాభాద్రలకు 16, చిత్తకు 15, కృత్తికకు 19, మఘకు 22, స్వాతికి 12, ఆశ్లేషకు 19, విశాఖకు 27 ఈప్రకారము మొదటి ఘడియలు పోగా మిగిలినఘడియలు ప్రయాణశుభప్రదములు.

## వారశూలలు

శ్లో॥ శనౌ సోమే నచ ప్రాచీం న గురౌ దక్షిణాం దిశం।
న ప్రతీచీం కటౌ భానౌ బుధే భౌమే న చోత్తరామ్॥

శనివార సోమవారములు తూర్పునకును, గురువారము దక్షిణమునకును, శుక్రవార ఆది వారములు పశ్చిమమునకును, బుధవార మంగళ

గరిమెళ్ళ రామకృష్ణశాస్త్రి (పురోహిత)

వారములు ఉత్తరమునకును ప్రయాణము చేయ కూడదు.

అపవాద

శ్లో॥ ద్వావింశతి ర్గురౌ చైవ ద్వాదశేందుజభౌమయోః,
దశపంచ భృగౌ భానౌ మందేంద్వో రష్టనాడికాః॥

గురువారము 22, బుధవార మంగళవారములు 12, శుక్రవార ఆదివారములు 15, శనివార సోమవారములు 8- ఘడియలు పోగా మిగిలిన ఘడియలయందు వారదుర్ముహూర్తము, వర్జ్యము లేకుండ చూచుకొని ప్రయాణమునుచేయవచ్చును.

ప్రయాణోచితవారములు.

శ్లో॥ అంగారకే ప్రాగ్గమనం చ లాభం
సోమే శనౌ దక్షిణ మర్థలాభం।
బుధౌ గురౌ పశ్చిమకార్యసిద్ధి
రవౌ భృగౌ చోత్తరధాన్యలాభః॥

మంగళవారము తూర్పుదిశప్రయాణము లాభదాయకము, సోమవార శనవారములు దక్షిణదిక్ప్రయాణము ద్రవ్యలాభము, బుధవార గురువారములు పశ్చిమదిక్ప్రయాణము కార్యసిద్ధి

151

ఆదివార శుక్రవారములు ఉత్తరదిక్ప్రయాణము
ధాన్యలాభము.

## ప్రయాణోచితనక్షత్రములు

శ్లో॥ మృగాశ్వినీపుష్యపునర్వసూ చ
హస్తానురాధాశ్రవణం చ మూలా ।
ధనిష్ఠరేవత్యకృతే ప్రయాణే
ఫలం లభే చ్ఛీఘ్రపునర్వర్తనం చ ॥

అర్థము సులభగ్రాహ్యము.

## తిథ్యాదిదోషములకు అపవాద

శ్లో॥ తిథ్యర్థదోషా ఉదయే చ కాలే
నక్షత్రదోషా అభిజిన్ముహూర్తే ।
గోధూళికే లగ్నముఖాదిదోషాః
న వారదోషాః ప్రభవంతి రాత్రౌ ॥

ప్రాతఃకాలమున తిథిదోషమును, అభిజిన్ముహూర్తమున నక్షత్రదోషమును, గోధూళిలగ్నమున లగ్ననవాంశాదిదోషములును, రాత్రిభాగమున వారదోషములు లేవు; అనగా బాధింపవు. ఇది ప్రయాణవిషయమున మాత్రమే నిర్ణయింపబడినది. వివాహవిషయమున సమంజసములు కావు.

## నిర్గమవిషయము.

శ్లో॥ కవచం చోత్తరీయం వా కించిద్వీత్తసమన్వితం,
నిధాయాన్యగృహే లగ్నే తద్గృహీత్వా వ్రజేత్తతః॥

ప్రయాణాలగ్నమందు కవచమునుగాని, కంచుకమును (చొక్కాను, రవికను) గాని, కండువానుగాని, స్వల్పద్రవ్యముతో వెళ్ళబోవుగ్రామమునకు త్రోవనున్నండు గృహమందుంచి ప్రయాణ సమయమున దానిని ధరించి వెళ్ళవలయును.

శ్లో॥ ప్రస్థానే తు కృతే పశ్చాత్ మహాదోషదినేపి వా,
కుర్యాదసంశయం యాత్రాం దోషోనాస్త్యత్ర కశ్చన॥

నిర్గమము చేయబడిన పిమ్మట ఎటువంటి మహాదోషముగల దినమందైనను నిస్సందేహముగా ప్రయాణమును చేయవచ్చును; ఎంతమాత్రము సందేహములేదు.

## ఉద్యోగాదివిషయము

శ్లో॥ నృపాలోకే చ సేవాయాం కుశీదే క్రయవిక్రయే,
గేహే చోద్వాహనిర్దిష్టనక్షత్రాణి విదుర్బుధాః॥

రాజదర్శనము, ఉద్యోగారంభము, వర్తకవ్యాపారము, క్రయవిక్రయములు, గృహారంభము

నిటియందు వివాహమునకు చెప్పబడిన నక్షత్ర
ములనుంచిని.

## నూతనవస్త్రధారణ

శ్లో॥ వత్సరాద్యుత్సవాహాస్సు సత్కారేపి శుభేషు చ ।
ధార్యం వస్త్రాదికం సద్యః న దుర్వారాదిచింతనా ॥

సంవత్సరాది మొదలగు పండుగురోజులు, హఠాత్సిద్ధమైన సన్మానపూర్వక వస్త్రాభరణములు, వివాహాది శుభకార్యముల మధ్యదినములలో గావింపబడిన సన్మానము వీటిని తత్క్షణమే ధరింప నగును. తిథివారనక్షత్రముల విచారణతో పనిలేదు.

## గాడిపొయ్యి

శ్లో॥ తాత్కాలికోపయోగార్థం నైమికాశ్యగ్నికల్పనాత్ ।
శుభే కర్మణ్య దోష స్స్యాత్ గర్భిణ్యామపి మందిరే ॥

ఇంటియందు గర్భవతి యగు స్త్రీ ఉండి యున్నను శుభకార్యసమయమందు తాత్కాలికోపయోగము నిమిత్తమై గాడిపొయ్యిని నిర్మించుటవలన ఎట్టి దోషమును లేదు.

శ్లో॥ గర్భిణ్యాం మందిరేసత్యాం ప్రాక్చుల్లీ దోహదం వినా ।
న కల్ప నే న్నవాం చుల్లీం ఛాంతితిరితి విద్యతే ॥

2) గరిమెళ్ళ రామకృష్ణశాస్త్రి (పురోహిత్)

గర్భిణీస్త్రీ ఇంటియందుండగా పాతపొయ్యిని మరమ్మత్తును చేసుకొనవచ్చునుగాని, క్రొత్త పోట్లు క్రొత్తపొయ్యిని నిర్మింపకూడ దను ప్రతీతి కలదు.

## శూర్పగ్రహణము

శ్లో॥ సువాసినీమృతౌ దత్తం శూర్పం గ్రాహ్యం సబాంధవైః
క్రయాద్వాపితునగ్రాహ్యం కుటుంబే గర్భిణీ యది॥

గర్భిణీస్త్రీకి ముఖ్యబంధువులైనవారు సువాసినీ మరణమందు గాని దత్తేన పంచిపెట్టబడు చేటను గ్రహింపకూడదు; మరియు క్రొత్త చేటను కొనకూడదు.

## కాలవివక్ష

శ్లో॥ పంచ పంచ ఉషఃకాలః సప్తపంచారుణోదయః ।
అష్టపంచభవే త్ప్రాతః శేషస్సూర్యోదయస్స్మృతః॥

తొలిరోజు సూర్యోదయము మొదలు 55 ఘడియలకు ఉషఃకాలము, 57 ఘడియలకు అరుణోదయము, 58 ఘడియలకు ప్రాతఃకాలము, ఆపైన సూర్యోదయముఅని సంజ్ఞ.

## నూతనవస్త్రోపయోగసమయము

శ్లో॥ వస్త్రవాహనఛత్రాది ధార్యాణి సకలాన్యపి ।
సద్య ఏవోపయుంజీత పంచపాత్రానాదికమ్

ఆభరణములు, వాహనములు, బళ్లు, జట్కాలు, సైకిళ్ళు, కార్లు, గుఱ్ఱములు, ఎద్దులు మున్నగు పశు సముదాయము, గోడుగులు, కళ్ళజోళ్ళు, కాళ్ళజోళ్లు మొదలైనధరింపతగినవస్తువులు, మంచములు, పాత్ర సామాను, కుర్చీలు, బెంచీలు మొదలైనవి వీటిని సంపాదించిన (స్వస్థానమునకు చేరిన) వెంటనే ఉప యోగింపవలయును. వెంటనే వాడెడు పక్షంలో తిథివారనక్షత్రాదుల మంచిచెడ్డలతో పనిలేదు.

## గ్రహణమును చూడకూడనివారు

శ్లో॥ గ్రహణర్క్షే తు యే జాతాః స్త్రియో వా పురుషా అపి।
గ్రహణం ఛిద్రకాంతిం చ న పశ్యే ద్గర్భిణీస్త్రియః॥

గ్రహణనక్షత్రమునందు పుట్టినస్త్రీలు, పురుషులు, గర్భిణీస్త్రీలు వీరు గ్రహణమునుగాని, ఆచ్ఛాదనసందులనుండి ఏర్పడిన ఎండ, వెన్నెల తాలూకు మెరిగల కాంతినిగాని చూడకూడదు. కాంతి అనగా నీడచుక్కలు.

## వల్మీకాదిజననము

శ్లో॥ దృష్టా యది స్యు ర్మధు పంచరాత్రి
వల్మీకకాధేయకపక్షిణశ్చ।

గృహస్యమధ్యే శివవాయుకాల
పూర్వానలాశాసు న దర్శనీయాః ॥

ఇంటియొక్క మధ్యభాగము, ఈశాన్య వాయు దక్షిణ పూర్వాగ్నేయదిశలలో ఏదిశయందైనా సరే తేనెపట్టు, మొండిచెయ్యి, పుట్ట, కుక్క, పక్షులు (గెద్ద, రాబందు, గుడ్లగూబ), తేతువుపిట్ట కనిపించకూడదు. మొండిచెయ్యి ఎరుపుగా నున్నచో రామహస్తమనియు, నల్లగా నున్నచో రావణహస్తమనియు ప్రతీతి. రామహస్తముకంటె రావణహస్తము దోషకరము.

శ్లో॥ తద్దోషం పరిహృత్య తత్ర భవనే నిష్కాస్యవల్మీకం
క్షీరైస్తత్ర విశోధ్య వా ఖగముఖం రుద్రాభిషేకం చరేత్ ।
ఏవంచేద్గృహమేధినా మతితరాం తద్దోషశాంతిర్భవేత్
పద్మావాససమీపసద్మసు న జాత్వేతాదృగంహోభయమ్ ॥

అవన్నికాదులను పెల్లగించి పారవేసియు, పక్ష్యాదులను పారద్రోలియు ఆప్రదేశమును ఆవుపాలతో శుద్ధిచేసి పక్షిశాంతిని చేయవలయును.

రెండవ పక్షంలో రుద్రాభిషేకమును చేయించవల యును. చేపలబజారు, పక్షులు నివసించు చెట్లకు సమీపము అయి ఉన్న ఇండ్లవిషయమున పక్షి దోష మెంతమాత్రమును లేదు.

## వల్మీకాదిజననమందు గృహవర్జ్యకాలము

శ్లో॥ మాసషట్కం త్రిమాసం చ
త్యాజ్యం పక్షత్రయం గృహం ।
శాంతిం కృత్వాతైవ వసే
దిత్యాహుః కతిచిద్బుధాః ॥

పండితులలో కొందరు 6 మాసములును, కొందరు 3 మాసములును, కొందరు 3 పక్షము లును ఇంటిని విడిచిపెట్టవలయుననియు, కొందరు ఇంటిని విడిచిపెట్టనక్కరలేకుండా శాంతిని చేసి కాపుర ముండవచ్చుననియు చెప్పుచున్నారు.

శ్లో॥ నిర్మాణాది పరంపరా నివసితా గారస్య వర్జ్యక్రియా
దుష్టేష్వపి నైవ మృత్యువిషయే వారాద్భవాదావపి ।
కించాద్లింగశమం చరే ద్గృహముఖం వాస్త్వర్చనం శక్తితః
చైకైకం సకలవ్యథా ప్రశమనం రుద్రాభిషేకాదికమ్॥

గృహప్రవేశము చేసినది మొదలుకొని

గాని కొనబడిన యిల్లైనచో ఆయింట ప్రవేశించి
నది మొదలుకొనిగాని, విడిచిపెట్టకుండా కాపుర
మున్న ఇండ్లను దుష్టనక్షత్రమృతి దోషవిషయ
మైగాని, వల్మీకాదిదోషవిషయమైగాని విడిచిపెట్టి
పోనవసరములేదు. ఉదకశాంతి, గ్రహముఖము,
రుద్రాభిషేకము, వాస్తుపూజ శక్త్యనుసారము
అన్నిటినిగాని, కొన్నిటినిగాని చేసి కాపురముండ
వలయును. వీటిలో ఒక్కొక్కటియే సకలదోష
ములను పోగొట్టు సామర్థ్యముకలది. సమర్థతకల
దేని వేదపారాయణ, సూర్యనమస్కారములుకూడ
చేయనగును.

శ్లో॥ వేదార్త శూన్యసదనం మృత్యుపక్ష్యాదిదూషితం ।
గోమూత్రనద గవాదిభ్యా విలిప్యాత్తై్రవ సంవసేత్ ॥

వేదార్హతలేనివారి గృహము మృతి పక్ష్యాది
దూషితమైనచో ఆయింటిని గోమూత్రనదీజలము
లతో అలికి విడిచిపెట్టకుండ యథాప్రకారము
కాపురముండవచ్చును. రుద్రాభిషేకము చేయుట
మంచిది. నదీజలము సందర్భముకాని తావుల
యందు దేవాలయమునకు సంబంధించియున్న
చెరువునీరుగాని, నూతినీరుగాని వాడవలెను.

## సర్పప్రవేశదోషము

శ్లో॥ సింహద్వారా త్ప్రవిష్టశ్చేత్ ఆశీవిషః ఫణీగృహం।
శాంతిం కృత్వా చరేన్నాగభూషణ స్యాభిషేచనమ్॥

త్రాచుపాము సింహద్వారము నుండి, ఇంటియందు ప్రవేశించినయెడల (వెంటనే) గ్రహమఖమును చేసి నాగాభరణాలంకృతుడైన ఈశ్వరునకు ఏకాదశరుద్రాభిషేకమును గావించి శక్త్యనుసారము బ్రాహ్మణసమారాధన చేయవలయును. లభ్యమైనచో ఆబోతునకుకూడ ఆహారము నొసంగవలయును.

## తీతువుపిట్టకూత

శ్లో॥ ఆషాఢాదిత్రియా దూర్ధ్వే శ్రుతే తిత్తిరకూజితే।
ద్వారకాం వా ఘీరపల్లిం త్రిస్స్మరేత్ కృష్ణజన్మగామ్॥

ఆషాఢ శ్రావణ భాద్రపద మాసములు దాటినపిమ్మట 'తీతువుపిట్టకూత' వినబడెనేని తద్దోషపరిహారార్థమై శ్రీకృష్ణపరమాత్మ యొక్క జన్మస్థానమైన ద్వారకనుగాని, పెంచబడిన రేపల్లెనుగాని మూడుసార్లు స్మరింపవలయును. అనగా ఇది 'శ్రీకృష్ణపరమాత్ముడు జనించిన ద్వారకాపట్నం

ద్వారకాపట్నం ద్వారకాపట్నం' లేక, ఇది 'పరమాత్మ పెరిగిన రేపల్లెవాడ రేపల్లెవాడ రేపల్లె వాడ' అని స్మరింపవలెను. ఆషాఢాది నాలుగు మాసములు (గోదావరికి క్రొత్తనీటి కాలముగాన) దోషము లేదు. కార్తీకాది జ్యేష్ఠమాసము వరకు ఈ కూత నిషేధము.

## కార్యానుసంధానవిధానము

శ్లో॥ తిథివారర్క్షయోగాది దౌర్బల్యేపి శుభోచితః ।
గార్హ్యే శివోదితః కాలః తత్స్వకార్యం సముద్ధరేత్॥

తిథివార నక్షత్ర యోగాదులచే అనుకూల సమయము లభ్యము కానప్పుడు గృహస్థుల యొక్క అత్యవసర కార్యనిర్వాహణకై తాత్కాలిక సమంజస కాలము, గౌరీపంచాంగ, ఆనందాది యోగముల ద్వారా శివునిచే గౌరికి చెప్పబడినది. వాటివలన గృహస్థులు వారివారి కార్యములను నెరవేర్చుకొనవలయును.

శ్లో॥ స్మృతి స్సనాతనాచారః శక్యం చ సుఖ మాత్మనః ।
ఏవం చతుర్విధం ప్రోక్తం మునిభి ర్ధర్మలక్షణమ్॥

ధర్మశాస్త్రము, పూర్వీకాచారము, తానవ లంబించుటకు శక్యమైనది, శుభకరమైనది-

ముగా మహర్షులచే ధర్మాచరణ నాలుగు ప్రకార
ములుగా నిర్ణయింపబడినది.

శ్లో॥ తత్కాలాకరణే వ్యర్థాః తత్కాలే తాన్మతాంతరైః।
సంస్కృత్య దశదోషే వా స్వార్థా నిర్వర్తయేత్సుధీః॥

అప్పటికప్పుడు చేయనిచో చెడిపోవు కార్య
ములను పంచాంగదశదోషములున్నను, వాటిని
లెక్కచేయక బుద్ధిమంతులైన (ఛాందసములేని)
వారు మతాంతరముచే సంస్కరింపబడిన కాల
మందు వెంటనే తనకార్యమును నెరవేర్చుకొన
వలయును.

శ్లో॥ నైకో ఋషి ర్యస్య మతం ప్రమాణం
నేత్యేవ శంకా సకలం ప్రమాణం।
తత్తన్మతేష్వాత్మసుఖానుకూలం
గ్రాహ్యం స్వమతం జాయు రివామయానామ్॥

ధర్మశాస్త్రకర్త ఒకడేకాదు. (1) మనువు
(2) అంగిరసుడు (3) వ్యాసుడు (4) గౌతముడు
(5) అత్రి (6) ఉశనసుడు (7) యముడు (8) వసి
ష్ఠుడు (9) దక్షుడు (10) సంవర్తుడు (11) శాతా
తపుడు (12) పరాశరుడు (13) విష్ణువు (14) ఆప
స్తంబుడు (15) హారీతుడు (16) శంఖుడు (17)

కాత్యాయనుడు (18) భృగువు (19) పరిశేషుడు (20) నారదుడు (21) యోగి (22) బోధాయనుడు (23) పితామహుడు (24) సుమంతుడు (25) కణ్వుడు (26) బభ్రువు (27) పైఠీనుడు (28) వ్యాఘ్రుడు (29) సత్యవ్రతుడు (30) భరద్వాజుడు (31) గార్గ్యుడు (32) కార్ష్ణాజినుడు (33) జాబాలి (34) జమదగ్ని (35) లోకాక్షి (36) బ్రహ్మసంభవుడు (37) వత్సుడు (38) మరీచి (39) దేవలుడు (40) పారస్కరుడు (41) పులస్త్యుడు (42) పులహుడు (43) ఋష్యశృంగుడు (44) విజితుడు (45) భాగలేయుడు (46) ఆత్రేయుడు. ఈ 46గురు కాక ఇంకా అనేకులు కలరు. వీరందరిలో ఎవరి మతము ప్రమాణము అని సందేహింప నగత్యము లేదు. అందరిమతములును ప్రమాణములే. కాని, పలువిధములైన మందులలో వ్యాధికి అనుకూలించు మందువలె; ఆమతములలో తనకు ఉపయోగమైన మతమునవలంబించి స్వకార్యమును నెరవేర్చుకొన వలయును. ఈమహర్షి మతములకు పరస్పర విరోధ మేర్పడినప్పుడు మతభేదము అని తెలియవలయును.

## శాస్త్రద్వైవిధ్యము

శ్లో॥ విశేషమితి సామాన్యం ద్విధా శాస్త్రం ప్రవర్తతే।
సామాన్యాద్యదిచేద్బాధా విశేషేణ వినిశ్చయేత్ ॥

విశేషవిధి, సామాన్యవిధి అని శాస్త్రము రెండువిధములు. సామాన్యవిధిచే బాధకలిగి నపుడు విశేషవిధి నవలంబించి ముహూర్తధర్మాదు లను స్థిరపరచవలెను.

## సంకల్పతిథినిర్ణయము

శ్లో॥ యస్మిన్కర్మణి యః కాలః తత్కాలవ్యాపినీ తిథిః।
తయా కర్మాణి కుర్వీత హ్రాసవృద్ధీ న కారణమ్ ॥

నిత్యకర్మానుష్ఠాన విషయమునగాక తదితర ములైన కర్మలయందు కర్మారంభకాలమునకు వ్యాపించియున్న తిథియే ప్రధానము. కాన ఆతిథిని సంకల్పించియే కర్మను నెరవేర్పనగును. తిథియొక్క వృద్ధిక్షయములతో సంబంధములేదు. వారవిషయముమాత్రము 'ద్వౌ భాగౌ పూర్వ వాసరే' అను నిర్ణయప్రకారము రాత్రికాలము యొక్క మొదటి రెండుభాగములును పూర్వదిన మందును, మూడవభాగము నుపరదినమందునుచ్చ రింపవలెను. కొందరు 'ఉదయాదుదయం వారః' అని

అందురు. అది వారసూలవిషయము. సహస్రగాయ
త్రిని చేయువారు రాత్రిమూడవభాగమందే స్నానము
చేసి సూర్యోదయ సమయమున సూర్యోపస్థానము
నకు అనుకూలించునట్లు సహస్రగాయత్రిని పూర్తి
చేయుదురు. అట్టివారు పరవారమునే ఉపయో
గింతురుగాన 'ద్వ్యాభాగాపూర్వవాసరే' అనుమతమే
సమంజసముగా తోచబడుచున్నది.

## క్షయమాసాంతర్గతజననమరణములు

శ్లో॥ తిథ్యర్థే ప్రథమే పూర్వః ద్వితీయార్థే తదుత్తరః ।
మృతజన్మనావితి జ్ఞేయం క్షయమాసస్య మధ్యగే ॥

క్షయమాసాంతర్గత (యుగళీభూత) సంసర్ప
మాసమందు జన్మించినవారికగాని, మృతి చెందిన
వారికిగాని ఏమాసమగునో తెలుసుకొనుటకు తిథిని
రెండు సమానభాగములుగా చేసి పూర్వభాగమును
మార్గశిరమనియు, ఉత్తరభాగమును పుష్యమ
నియు తెలియవలయును. తిథిద్వయము సంభవిం
చిన రోజున పూర్వతిథివారు పూర్వతిథిని, పరతిథి
వారు పరతిథిని సంకల్పించి ప్రత్యాబ్దికాదులను
నెరవేర్చుకొనుచున్నట్లే యుగళీభూత సంసర్ప
మాసమందును, శ్లో॥ 'తావేవ పక్షౌ ద్వావేవ

...య త్రింశ దేవహా’ అనగా అపతుమునే, అతిథినే
...కల్పించి మార్గశిరమునాడు మార్గశిరమనియు,
...పుష్యమినాడు పుష్యమిఅనియు ప్రత్యాబ్దికాదులను
...రవర్పవలయును. ఎప్పుడైనను మార్గశిరమే
...యమాసమగును. గర్భధారణ విషయమున నవ
...మాసపూర్తియందును, మాసవారీజీతమునందును
...నియమము పనికిరాదు.

## శకునములు

శ్లో॥ గోకన్యాఫలపుష్పయానవృషభక్షీరైక్షవక్షత్రియాః
జ్వాలాశంఖదధిద్విపాశ్వజలజక్ష్మాదేవయుగ్మాక్షతాః ।
వైశ్యఛత్రిసువాద్యతార్క్ష్యగణికాః పూర్ణాంబుకుంభ
ద్వయం
యాత్రాయాం శుభదాః పతత్రికులకం దృగ్గోచరా
స్సన్త్విది ॥

గోవు, పెండ్లికానికన్య, ఫలములు, పుష్ప
ములు, పల్లకి (సవారి), బండి, కావు, ఎద్దు, ఆబోతు,
...లు, బెల్లము, చెరుకుముక్కలు, క్షత్రియుడు,
...ంట, శంఖము, పెరుగు, ఏనుగు, గుఱ్ఱము, చేపలు,
...బ్రాహ్మణద్వయము, అక్షతలు, కోమటి, గొడుగు,
...ంగళధ్వని, గరుడపక్షి, వేశ్య, నీటికడవల జంట,

నకులబాహు- ఇవి ప్రయాణసమయమున సింహ ద్వారము దాటునరికి కనిపించినచో శుభప్రదములు.

## అపశకునములు

శ్లో॥ కార్పాసాంధకురూపమూకబధిరోన్మత్త క్షుధార్తాయుధాః
మార్జాలోరగభగ్నకుంభలవణవ్యాధ్యన్వితక్షౌరకాః ।
తైలైకద్విజనగ్నధూమవిధవా ముండీశిఖండీ రిపుః
దృగ్లక్ష్యస్స్వరయః ప్రయాణసమయే కార్యాంత
రాయ స్స్మృతః ॥

ప్రత్తి, గ్రుడ్డివాడు, అంగవిహీనుడు, మూగవాడు, చెవిటివాడు, పిచ్చివాడు, ఆకొన్నవాడు, ఆయుధము, పిల్లి, పాము, అంచులేనికుండ (బిందె), ఉప్పు, రోగి, మంగలి, నువ్వులు, నువ్వులనూనె, ఒంటిబ్రాహ్మణుడు, దిగంబరి, పొగ, భర్తృవిహీనురాలు, ముండి, పేడివాడు, శత్రువు వీరు ప్రయాణసమయమున చూడబడిలేని కార్యవిఘ్నము కలుగును.

## అపశకునదోషపరిహారము

శ్లో॥ స్మృత్వా గ్రామస్థితం దైవం శ్రీరామం చ పునః పునః ।
పాదౌ ప్రక్షాల్య విశ్రమ్య గుడం భుక్త్వా ప్రవ్రజేత్తతః ॥

అపశకునమైన వెంటనే గ్రామమునందుగల

...వమును, శ్రీరామచంద్రుని ముమ్మారుస్మరించి పాదములను కడుగుకొని. బెల్లమునుతిని, కొంచెము సేపు విశ్రమించి వెళ్ళవలయును.

## కాకిశకునము

శ్లో॥ కాకః ప్రయాణసమయే రుదన్నభ్యేత్య మంగళం ।
యాత్యూర్ధ్వే దక్షిణం సవ్యాత్ కార్యసిద్ధిర్న
సంశయః ॥

ప్రయాణమై వెళ్లుచుండగా కాకి అరచుచు ఎదురుగా వచ్చినయెడల మంచిదికాదు. ఎదురుగానున్న పైభాగమున ఎడమనుండి తనకు కుడిభాగముగా పోయిన కార్యసిద్ధి అగును.

## బల్లిపాటు

శ్లో॥ బ్రహ్మస్థానే భవే ద్రాజ్యం స్థానే లాభో లలాటకే ।
కర్ణయో ర్భూషణావాప్తి ర్నేత్రయోః ప్రియదర్శనం॥
నాసికాయాం సుగంధాప్తి ర్ముఖే మృష్టాన్నభోజనం ।
కపోలయో ర్భవే త్సౌఖ్యం హనుదేశే మహద్భయం॥
భృకుట్యాం విగ్రహశ్చైవ కంఠే వా వ్యసనాగమః ।
కశేరుకే సుఖం పృష్ఠే దక్షే వామే గ[illegible] ॥
దక్షాంసే విజయో నిత్యం వామాంసే శత్రుజంభయం।
ఇష్టలాభో భుజే సవ్యే కూర్పరే మణిబంధకే ॥
దక్షే కరతలే ద్రవ్యం తత్పృష్ఠే సద్వ్యయో భవేత్ ।

వామే భుజే కూర్పరే చ మణిబంధే ధనక్షయః ॥
వామే కరతలే హాని స్త్రత్సృష్టె పార్థనాశనః ।
హృదయే రాజసన్మానం సౌభాగ్యం దక్షిణే స్తనే ॥
దక్షపార్శ్వే చ రోగాప్తి స్తనే వామే యశోధనం ।
వామపార్శ్వే భవే త్పీడా వామకుక్షౌ శ్శో స్తథా ॥
దక్షకుక్షౌ సుతావాప్తి రుదరే చ విశేషతః ।
వస్త్రాప్తి ర్దక్షకట్యాం చ వామకట్యాం సుభిక్షయః ॥
నాభ్యాం మనోరథావాప్తి ర్వస్తౌ గర్భచ్యుతి ర్భవేత్ ।
గుహ్యే మృత్యు ర్గుదే రోగో దక్షోరా ప్రీతివర్ధనం ॥
వామోరౌ మృత్యుతో దుఃఖం దక్షజానౌ సుఖావహం ।
పశుహాని ర్వామజానౌ దక్షిణే జఘనే సుఖం ॥
ద్వేశస్సా ద్వామజంఘాయాం స్ఫిజదక్షే ప్రవృద్ధికృత్ ।
స్ఫిజి వామే స్త్రీవియోగో దక్షే గుల్ఫే ప్రియాగమః ॥
ఉపప్లవో వామగుల్ఫే పాదయో ర్గమనం భవేత్ ।
ఏతదేవ ఫలం వింద్యా త్సరటస్య ప్రరోహణే ॥

బల్లిపాటునకు ఫలము— బ్రహ్మరంధ్రమందు రాజ్యము, లలాట(ముఖ)మందు లాభము. చెవులయందు అలంకారప్రాప్తి, నేత్రములయందు బంధుమిత్రదర్శనము, నాశికయందు సుగంధావాప్తి. మూతియందు మృష్టాన్నము, గండస్థలమందు చెంపలయందు సౌఖ్యము, రొండలయందు మహా

యము, బొమ్మముడి (కనుబొమ్మలమధ్య) వివాద,
కంఠమందువ్యసనము, వెన్నెముకయందువిరోధము
దక్షిణపృష్ఠమందు సుఖము, వామపృష్ఠమందు
రోగము, కుడిభుజముపైన శత్రుజయము, ఎడమ
భుజముపైన శత్రుభయము, కుడి అరచేతియందు
ద్రవ్యము, ఎడమజబ్బయందు ఇష్టలాభము, కుడి
మోచేతిదిగువను ఇష్టవస్తుప్రాప్తి, ఎడమమోచేతి
దిగువను ధనక్షయము, ఎడమఅరచేతియందు
హాని, ఎడమతుంటియందు ధననష్టము, హృదయ
మందు రాజసన్మానము, దక్షిణస్తనమందు
సౌభాగ్యము, ఎడమపార్శ్వమందు పీడ, కడుపునకు
కుడిభాగమున సంతతి, కడుపున కెడమభాగమున పీడ,
కుడిపిర్రియందు వస్త్రలాభము, ఎడమపిర్రి
యందు సుఖనాశము, బొడ్డుయందు ఇష్టసిద్ధి,
పొత్తికడుపుయందుగర్భచ్యుతి, గుహ్య(సంభోగావ
యవ) మందు మరణము, గుద (ముడ్డి) యందు
రోగము, కుడిగుండెయందు ప్రీతి, ఎడమగుండె
యందు వ్యాధి, కుడిమోకాలు సుఖము, ఎడమ
మోకాలు పశునష్టము, కుడిపిక్కయందు సుఖము,
ఎడమపిక్కయందు క్లేశము, దక్షిణపుతుంటిపైభాగ

ముందు వృద్ధి, ఎడమతుంటిపై భాగమున స్త్రీవియోగము, కుడిసీలమండయందు ప్రియాగమనము, ఎడమసీలమండయందు ఉపద్రవము, పాదములయందు ప్రయాణము, కాలివేళ్లయందు హాని.

శ్లో॥ ఇత్థం పల్ల్యాః ప్రపతనే ఫలం జ్ఞేయం విచక్షణైః ।
ఏతదేవ ఫలం విన్ద్యాత్ సరటస్య ప్రరోహణే ॥

ఈ ప్రకారముగా బల్లి పడుట వలన కలుగు ఫలములు తెలియవలయును. తొండ ప్రాకుట వలనకలుగు ఫలముకూడ ఇదే అని తెలియవలెను.

శ్లో॥ ఏవం పల్లీసరటయోః
ఫలం విస్తృత్య కీర్తితమ్ ।
తయోః పంచమయోః స్పర్శే
స్నాత్వా శాంతిం సమాచరేత్ ॥

ఈప్రకారము బల్లిపాటు, తొండ ప్రాకుట వీటిని గురించి విస్తరించి చెప్పుట అయినది. వీటిలో నల్లనివాటికి మాలబల్లి అనియు, మాల తొండ అనియు వాడుక. తెల్లవాటిదోషము కంటె వీటిదోషమే ప్రబలమైనదిగాన నల్లబల్లి యొక్కగాని, నల్లతొండయొక్కగాని స్పర్శ తగిలిన వెంటనే స్నానముచేసి సాధ్యమైనంత శీఘ్రముగా

శాంతిని చేయించవలయును. శాంతిఅనగా రుద్రాభిషేకము.

## మృతివిషయమున గృహవర్జ్యకాలము

శ్లో॥ మాసం భరణ్యాం ద్విపదే త్రిపాదే
మాసత్రయం వాసవపంచకే తు ।
షణ్మాస మాహు ర్మృతగేహవర్జ్యం
త్రిపాదభే కేచన మాసషట్కమ్ ॥

మృతివిషయమై భరణియందు 1 మాసము, ద్విపాత్త్రిపాన్నక్షత్రములయందు 3 మాసములు, ధనిష్ఠాపంచకమందు 6 మాసములు మృతి సంభవించిన ఇంటిని విడిచిపెట్టవలయును. త్రిపాన్నక్షత్రమందు 6 మాసములు విడిచిపెట్టవలెనని కొందరు.

### పక్షాంతరము

శ్లో॥ షణ్మాస మాహు ర్వసుభే త్రిమాసం
ప్రాచేతసే ప్రోష్ఠపదే త్రిపక్షమ్ ।
మాసం నిశాస్యాంతిమభే చ పక్షం
ద్విపా త్త్రిపాదం తకభే పురోక్తమ్ ॥

ధనిష్ఠయందు 6 మాసములు, శతభిషము నందు 3 మాసములు, పూర్వాభాద్రయందు 3 పక్షములు, ఉత్తరాభాద్రయందు 1 మాసము, రేవతి

యందు 1 పక్షము, ద్విపాత్రిపాన్నక్షత్రముల యందును, భరణియందును పూర్వోక్త ప్రకారము మృతగేహమును విడిచిపెట్టవలయును. ఈ నక్షత్రములయందు నూతనముగా వైధవ్యమునొందిన స్త్రీని చూచుట, పరామర్శ పనికిరాదు. సంవత్సర విమోకము దాటినపిమ్మటగాని, కేశ ఛేదముగాని స్త్రీవిషయమునగాని ఈనియమముతో పనిలేదు.

## మృతచక్రము




శ్లో॥ చతుర్థావరణం కృత్వా దిక్షు చత్వారి సూర్యతః ।
విదిక్షు త్రీణి పూర్వాదేః మృతక్షాద్వామతో న్యసేత్ ॥

మృతప్రదేశమందు 4 ఆవరణలు ఏర్పరచి సూర్యస్థితనక్షత్రము మొదలు మృతనక్షత్రము

వరకు, దిక్కులయందు 4, విదిక్కులయందు 3 చొ॥ ప్రథమ పాలుగా, అభిజిన్నక్షత్రముతోసహా పూర్వదిశలగాయితు విన్యసింపవలయును. కొంద రీశాన్యాదిగా చూచుచుందురు. రెండుపక్షములు నాడికలోనున్నవి. రోహిణియందు సూర్యుడు ఉండగా విశాఖ మృతనక్షత్రమైనప్పుడు ఉదాహరణ ఇవ్వబడినది.

శ్లో॥ చతురావరణే ష్వేవం అంతరాదే గృహక్రమాత్ ।
అనుపాతాదఘం వింద్యాత్ ఏకద్విత్రిచతుర్గుణమ్ ॥

పై 4 ఆవరణాలలోను బహిర్ముఖముగా 1వ ఆవరణనుండి క్రమానుసారము 4వ ఆవరణ వరకు ఏకోత్తరహ్రాసముగా, గృహావర్జ్యకాలమును నిర్ణయింపవలయును. అనగా 1వ ఆవరణయందు పూర్తిగాను, 2వ ఆవరణయందు 3 వంతులకాలమును, 3వ ఆవరణయందు 2 వంతులకాలమును 4వ ఆవరణయందు 1 వంతుకాలమును ఇంటిని విడిచిపెట్టవలెను. శిలావాసస్సులను పరిహరింపక ముందు (10 రోజులలోపల) శ్రాద్ధకర్త ఏ ఇంటిలోనికి వచ్చునో ఆ ఇల్లు మృతగృహముతో సమానముగాన మృతమందిరమును దాటి రాకూడదు.

## పరామర్శవిషయము

శ్లో॥ మిథునస్య శ్వశురయోః మృతౌ తజ్జనకౌ మిథః ।
స్త్రీమృతౌ స్త్రీపుమాంస్తద్వత్ నామృతర్క్షాగమాద్వ్రజేత్॥

భార్యాభర్తలయొక్క తల్లితండ్రులు గతించినపుడు వారితల్లిదండ్రులలో పరస్పర స్త్రీపురుష గమనము పోయిన నక్షత్రము తిరిగి వచ్చువరకు పనికిరాదు. అనగా వియ్యపురాలు పోయినపుడు వియ్యపురాలు, వియ్యంకుడు పోయినపుడు వియ్యంకుడు వెళ్లకూడదనుట. నక్షత్రము తిరిగి వచ్చువరకు అనిచెప్పుటవలన రెండవమాసములో వెళ్లకూడదు. ద్విపాత్త్రిపాన్నక్షత్రములు, ధనిష్ఠా పంచకము పనికిరావు. సంవత్సర మధ్యంలో ఎప్పుడు వెళ్లినను బేసి మాసములలో వెళ్లవలెను.

శ్లో॥ సకేశీం విధవాం పశ్యేత్ పర్వా న్విషఘటీర్వినా ।
శుక్రమంగళవారౌ చ భుక్త్వా నార్క్షాదిచింతనా ॥

పంచపర్వములు, వర్జ్యదుర్ముహూర్తములు, శుక్రవార, మంగళవారములు వీటిని విడిచిపెట్టి సకేశిగానున్న విధవాస్త్రీని తాను భుజించినపిమ్మట వెళ్లిచూడవచ్చును. ద్విపాత్త్రిపాన్నక్షత్రవిచారణ అవసరంలేదు.

శ్లో॥ హఠాచ్చేన్ముండితాదృష్టా పశ్యేత్సూర్యంతు దుర్దినం ।
స్మరే న్నక్తం చాగ్నిహోత్రం తథైవ యది వీక్షితా ॥

కేశసహితురాలైన విధవాస్త్రీ హఠాత్తుగా కనిపించినచో సూర్యదర్శనమును చేయవలయును. దుర్దినమైన (మబ్బువల్ల సూర్యదర్శనముకాని) చో సూర్యుని స్మరింపవలయును. రాత్రిభాగమైన యెడల అగ్ని (దీప) దర్శనమును చేయవలయును. అగ్ని (దీపము) లబ్ధముకాని తావులలో అగ్నిని స్మరింపవలయును.

## పితృశ్రాద్ధాధికారవిషయము

శ్లో॥ ఏకభర్తృకపత్నీనాం సర్వాసాం సంతు పై సుతాః ।
పితు ర్మరణకాలే తు జ్యేష్ఠపత్నీసుతోగ్రజః ॥

బహుపత్నీకుడు మృతినొందినప్పుడు చిన్నవాడైనను జ్యేష్ఠభార్యకుమారుడే జ్యేష్ఠుడుగా ంచబడుచున్నాడు. తక్కిన భార్యల కుమాళ్లు జ్యేష్ఠభార్యకుమారునికంటె పెద్దవారైనను వారికి ముఖ్యకర్తృత్వము లేదు.

## ఊనత్రియవిషయం

శ్లో॥ త్రైపక్షికోన షాణ్మాసికోనాబ్దికమితి త్రయం ।
కాలాతిక్రమణే తేషాం న పునః కరణం స్మృతమ్ ॥

త్రైపక్షికము, ఊనషాణ్మాసికము, ఊనాబ్దికము- ఈమూడును ఆశౌచాదులచే దాటిపోయిన యెడల వాటిని పెట్టనగత్యములేదు.

## ఊనత్రియకాలము

శ్లో॥ త్రిపక్షే ద్వాదశే పక్షే చతుర్వింశతిపక్షకే ।
ఊనత్రయం చరే దాద్య పంచకేవాంత్యపంచకే ॥

మూడవపక్షము, పన్నెండవపక్షము, ఇరవైనాలుగవ పక్షము-వీటియందు క్రమానుసారముగా మొదటి పంచకము, రెండవ పంచకము, మూడవపంచకములలోగాని, పక్షాంతరముచే అంత్యపంచక, మధ్యపంచక, ఆదిపంచకములలోగాని ఊనత్రియమును జరిగింపవలయును. అనగా మృతతిథికి 31వ రోజునుండి 35వ రోజులలో త్రైపక్షికమును, 171వ రోజునుండి 175వ రోజులలో ఊనషాణ్మాసికమును, 356వ రోజునుండి 359వ రోజులలో ఊనాబ్దికమును జరిగింపవలెను. రెండవ పక్షంలో 41వ రోజునుండి 45వ రోజులలోగా త్రైపక్షికమును, 171వ రోజునుండి 175వ రోజులలోగా ఊనషాణ్మాసికమును, 346వ

రోజునుండి 350వ రోజులలో ఊనాబ్దికమును జరిగించవలయును. నెలవారీగా ఉంచబడు మాసికము దాటిపోయిన యెడల ఊనత్రియమువలె విడిచి పెట్టక పై మాసికముతో కలిపి పెట్టవలయును.

శ్లో॥ నాకృతం మాసికం త్యాజ్యాత్ మాసికే నోత్తరేణ చ ।
యోజయిత్వా ప్రకుర్వీత్తై హ్యతిపన్నమితి బ్రువన్ ॥

కారణాంతరముచే దాటిపోయిన మాసికమును దానిపై మాసికముతో కలిపి అతిపన్న శబ్దమును పురస్కరించుకొని జరిగించవలయును.

శ్లో॥ సంవత్సరవిమోకాఖ్యం అకృత్వా ప్రథమాబ్దికం ।
యచ్ఛ్రాద్ధం కురుతే మోహాత్ కృతః ప్రాక్కర్మ నిష్ఫలమ్ ॥

360వ రోజున సంవత్సరీకమును జరిగింపక అజ్ఞానముచే 361వరోజున ప్రథమాబ్దికమును జరిగించినయెడల అంతకు పూర్వము చేయబడియున్న ప్రేతకర్మ అంతయు నిష్ఫలమగును.

శ్లో॥ తిథిద్వయే తు సంప్రాప్తే పృథక్పాకాత్పృథక్పృథక్ ।
విమోకం పురతః కృత్వా పశ్చాదాబ్దికమాచరేత్ ॥

సంవత్సరీకమును జరుపతగిన 360వ రోజున తిథిద్వయము సంప్రాప్తమైనయెడల వేరు వేరు

వంటలతో ముందు సంవత్సరీకమును జరిపి పిమ్మట ఆబ్దికమును జరిపింపవలయును.

శ్లో॥ పూర్వతిథ్యో ర్మృతతిథేః యస్యాం శూన్యాపి వా తిథిః ।
కార్యస్తత్రియం కర్మైవ కుర్వీతైవ దినత్రయే ॥

మృతతిథికి వెనుకగల రెండు (359, 360) దినములలో ఏరోజున శూన్యతిథి అయినప్పటికి వరుసగా (359, 360, 361) రోజులలో ఊనాబ్దిక సంవత్సరీకప్రథమాబ్దికములను జరిగింపవలయును.

## మలమాసమృతాబ్దికవిషయము

శ్లో॥ వర్షే వర్షే చ యచ్ఛ్రాద్ధం మృతాహే చ మలిమ్లుచే ।
కుర్యాత్తత్ర ప్రమీతానాం నాన్యేషాం తు కదాచన ॥

మలమాసమందు మృతి నొందినవాని యొక్క ప్రత్యాబ్దికమును అధిక మాసమందే సమంత్రకముగా పెట్టవలయును. మలమాసమందు మృతులుకానివారికి సమంత్రకముగా చేయరాదు. శుద్ధమాసమందే సమంత్రకముగా చేయవలయును.

## విభక్తశ్రాద్ధవిషయము

శ్లో॥ పిత్రోః శ్రాద్ధం పృథక్కుర్యాత్ విభక్తాశ్చ ధనాదిభిః
ఏకత్వాద్యది కుర్వ్యన్తే పతితా స్స్యుర్న సంశయః ॥

సోదరులు పరస్పరం తగాదాలను, క్షేత్ర, విత్త, గృహాదులను పంచుకున్న పిమ్మట తల్లిదండ్రుల ఆబ్దికమును కలిసి పెట్టరాదని పండితులు చెప్పుదురు.

శ్లో॥ అవిభక్తాః పృథగ్గ్రామాః స్వస్వార్జితధనాశనాః ।
కుర్యస్తే భ్రాతరశ్శ్రాద్ధం మాతాపిత్రోః పృథక్పృథక్ ॥

సోదరులు అవిభక్తులైనను వేరు వేరు గ్రామాదులలో ఎవరంతటవారు స్వార్జితధనముతో జీవించుచుండిరేని తల్లిదండ్రుల ఆబ్దికములను వేరు వేరుగా పెట్టవలయును. పంచుకోవలసిన చరస్థిరాస్తులు లేకున్నను ఇంతటినుంచి ఎవరిధనఋణములు, ఎవరి సంపాదన వారిదే అని నిర్ధారణ చేసుకున్న పిమ్మట కూడ తల్లిదండ్రుల ఆబ్దికములను కలసి పెట్టకూడదు.

## అవిభక్తశ్రాద్ధం

శ్లో॥ సర్వైరనుమతిం లబ్ధ్వా జ్యేష్ఠేన యది చేత్కృతం ।
విత్తేనైవావిభక్తేన సర్వైరేవ కృతం భవేత్ ॥

సోదరులు వ్యష్టిజీవితమును నిర్ణయించుకొనని యప్పుడు అందరిసంపాదనయందును సోదరులందరికిని భాగమేర్పడియున్నందున అన్యత్ర (ఉద్యోగాదికేతుఁ) ఇతరస్థలమందు స్వతంత్రముగా ఆబ్దిక

గరిమెళ్ళ రామకృష్ణశాస్త్రి (పురోహిత్)

మును నెరవేర్చుటకు అవరోధము తటస్థపడినప్పుడు తమ్ముల అనుమతిని స్వీకరించి జ్యేష్ఠుడు తల్లి దండ్రుల ఆబ్దికమును జరిగించినచో సమిష్టిద్రవ్య సాదృశ్యముచే సోదరులందరును ఏకీభవించి చేసినట్లేయగును. అనేకమంది సోదరులుండి ఒకరి కొకరు అందుబాటుప్రాంతములలో లేనప్పుడు, తమ్ముని అనుమతిపై వానికంటె పెద్దవాడైన అన్న గారు జరిగించవచ్చునుగాని, అన్నగారిఅనుమతి తమ్మునికి పనికిరాదు. ఇట్లని ధర్మప్రవృత్తి ధర్మ శాస్త్రగ్రంథమున కలదు. ఆబ్దికమును జరిగించని వాడుకూడ స్నానసంధ్యావందనములచే ఏక భుక్తముమున్నగు శ్రాద్ధనియమములను పాటించి బ్రాహ్మణునకు ఫలమును, దక్షిణను పితృదేవతల నుద్దేశించి ఇచ్చు ఆచారము దక్షిణదేశమునందు కలదు.

శ్లో॥ విభక్తైర్వాప్యవిభక్తైర్వా కార్యం ప్రేతక్రియాదికమ్।
సపిండీకరణం కుర్యాత్ సద్వైకం ద్వాదశేహని॥

అన్నదమ్ములు విభక్తులైనను తల్లిదండ్రుల యొక్క దహనాది సపిండీకరణాంతము కలసియే చేయవలయును. సంవత్సర విమోకపర్యంతము

అని తెలియవలయును. సంవత్సరాంతమువరకు శ్రాద్ధకర్మ, ఉండునో ఉండదో అనుభయముచే కర్మలోపము తటస్థపడకుండ సంవత్సరాంతమందు చేయతగిన సాపిండము ఆపద్ధర్మము ననుసరించి గౌణకాలమైన 12వ రోజున జరిగింపబడుచున్నను శాస్త్రతః 12 మాసములు పూర్తిఅయినపిమ్మట గాని ప్రేతకు పితృలోకప్రాప్తి లేదు.

## శుద్ధుల విషయము

శ్లో॥ అజ్ఞాతం శుచిసర్వమాపణిగతం భైక్షంగుడంమాక్షికం
శృంగం ఒర్మపతత్రిఖండితఫలం కారోఃకరం స్త్రీ
ముఖం।
దంతస్థాః పృషతశ్చ వేదవిదుషామాచామతోశా శ్శుభాః
శయ్యా వస్త్రవధూకమండలుసుతాస్త్వయాశ్చ మేధ్యాః
శ్శుభాః॥

చూచునప్పటికి పవిత్రముగా నున్నది, దుకాణమందున్నది, మధుకరాన్నము, బెల్లము, తేనె, గొఱగడికొమ్ము, కృష్ణాజినము, చిలుకకొరికిన పండు, కంసాలివానిక్రింది ముంజేయి, స్త్రీ ముఖము, వేదోచ్చారణచేయునప్పుడు నోటినుండి చెదరిన తుంపరలు, ఆచమనముచేయునప్పుడు

చెదరిపడిన ఉదకబిందువులు, పట్టుబట్ట, భార్య, తాను నిత్యము వాడుకొనుచున్న చెంబు, కుమారుడు వీరు సర్వదా పవిత్రత కలవారు.

శ్లో॥ తస్మాత్కుంభశతం జలం పరిహరేత్ కూపాది దోషే తదా
దద్యాత్తత్ర చ పంచగవ్యమసకృత్ తీర్థం చ సర్పిః పచేత్,
ప్రోక్ష్య క్షౌమకటాదితూలమలినే సంశోధయే దాతపే
హస్తోచ్ఛిష్టజలం పదంబుపతనా ద్దంశేషు నాస్పృశ్యతా ॥

నూతులు, చెరువులు అపవిత్రమైనప్పుడు వాటినుండి నూరుకడవలజలమును పరిహరించి, శేషించిన నీరుగల కూపాదులయందు పంచగవ్యములను చల్లవలయును. పాలు, నెయ్యి కాచుట చేతను, పట్టుబట్టలు, పీతాంబరములు, చాపలు, పరుపు మున్నగునవి నీళ్ళుచల్లి ఎండలో వేయుట వల్లను, ఎంగిలిచేతిని కడిగినచోట కాళ్లుకడుగుట చేతను శుద్ధి ఏర్పడుచున్నది. ఈగలు మున్నగునవి ఎంగిలి తాకించినను, అపవిత్రపదార్థములను స్పృశించి పవిత్రపదార్థములపై వాలినను దోషములేదు.

## ఫలతుల్యములు

శ్లో॥ కందమూలఫలాన్యంబుపిష్టకాఘృతశర్కరాః ।
గుడం లాజాశ్చ పృథుకాః అష్టావేతే ఫలోపమాః ॥

నిషిద్ధములుకాని దుంపలు, పచ్చికాయల లోని నీరు, పిండితో తయారుకాబడిన రొట్టె, ఉప్పుడుపిండి, వాసినిపోలు, గుగ్గిళ్లు, పంచదార, బెల్లము, పేలాలు, అటుకులు ఈ ఎనిమిది ఫలములతో సమానముగాన ఉపవాసభక్ష్యములు.

## స్పర్శదోషరాహిత్యము

శ్లో॥ తీర్థోద్వాహసభాయాగశాలాదేవాలయాధ్వసు ।
నౌకానాం యంత్రశకటే స్పర్శదోషో న విద్యతే ॥

పుణ్యతీర్థ, పుణ్యక్షేత్రములు, వివాహము, సభ, యాగశాల, దేవాలయము, మార్గము, పడవ (లాంచీస్టీమరు), కారు, రైలు వీటియందు స్పర్శదోషములేదు.

## పాడిపశువులవిషయము

శ్లో॥ ఆత్మస్తన్యం పిబంతీం గాం వృషారోహాం పయస్వినీం
ఊర్ధ్వాస్యోత్పన్నవత్సాంగాం వత్సయుగ్మప్రసూతికాం
ఆదౌపుష్యప్రసూతాం గాం మహిషీం మాఘసూతికాం।
జ్యేష్ఠప్రసూతాం దాసీం చ శ్రావణేబడబాం త్యజేత్॥

దానిపాలును అదేతాగునది, ఎద్దుపై ఎక్కునది, కాళ్ళు నెత్తిపైనలేకుండ కేవల ఎదురుముగముతో పుట్టినదూడగలది, రెండుదూడలు పుట్టినది, పుష్యమాసములో తొలిఈత ఈనినది అయిన ఆవును; మాఘమాసములో తొలిఈత ఈనిన గేదెను; జ్యేష్ఠమాసములో ప్రథమసంతానముకలిగిన దాసిని, శ్రావణమాసములో తొలి ఈతఈనిన గుఱ్ఱమును విడిచిపెట్టవలయును.

## క్షుత (తుమ్ము) విషయము

శ్లో॥ ఈశాన్యోదక్ప్రతీచీషు శుభం ద్వంద్వం న కేవలం
డింభేత్వరీసూతికానాం శుభమిత్యుదితం క్షుతం ॥
ఔషధే వాహనారోహే వివాదే శయనేశనే ।
బీజావాపే నిత్యపాఠే శుభదం సప్తసు క్షుతమ్ ॥

ఈశాన్యము, పశ్చిమము, ఉత్తరము ఈదిశల నుండి తుమ్ము వినిపించినను, తుమ్మువారు కనిపించినను దోషములేదు. ఒకతుమ్ము మంచిదికాదు, రెండుతుమ్ములు మంచివి. అన్నప్రాశనకానిపిల్లలు, వ్యభిచారిణి, నెలపురిటి బాలింతరాలు వీరితుమ్ము దోషములేదు. మరియు ఔషధసేవ, వాహనారోహణ, కలహము, పడక, భోజనము, విత్తులు

చల్లుట, నిత్యపాఠము ఈ పెడింటియందును తుమ్ము ఒకటిఅయినా సరే అంతకంటె అధికమైనా సరే మంచిది.

## విషఘడియలలో చేయతగినవి

శ్లో॥ స్నానే దానే జపే హోమే వైశ్వదేవే సురార్చనే।
ప్రాయశ్చిత్తే తథా శ్రాద్ధే విషనాడీ ప్రశస్యతే॥

స్నానము, కన్యాప్రదానముగాక తదితరములైన దానములు, జపము, వైశ్యదేవాదిహోమము, దేవతార్చన, ప్రాయశ్చిత్తము, శ్రాద్ధము వీటికి విషఘడియలు మంచివి.

## గంతవ్యాగంతవ్యకార్యములు

శ్లో॥ అనాహూతోధ్వరం గచ్ఛేత్ ఆహూత శ్శుభకర్మణి।
అనాహూతోపి వాహూతః న గచ్ఛేచ్ఛ్రాద్ధకర్మణి॥

యజ్ఞయాగాదికర్మలకు పిలువబడకుండగను, శుభకార్యములకు పిలువబడియు వెళ్ళవలయును- బంధుత్రయేతర శ్రాద్ధకర్మలకు పిలువబడకున్నను, పిలువబడియు వెళ్ళకూడదు.

## బంధుత్రయము

శ్లో॥ పితుః పితృష్వసాపుత్రాః పితుర్మాతృష్వసాసుతాః।
పితుర్మాతులతత్పుత్రాః విజ్ఞేయాః పితృబాంధవాః।

తండ్రికి మేనత్తలు, వారి సంతానము, తండ్రికి పినతల్లి పెదతల్లులు, వారి సంతానము, తండ్రికి మేనమామలు, వారిసంతానము పితృ బంధువులు.

శ్లో॥ మాతుః పితృష్వసాపుత్రాః మాతుర్మాతృష్వసాసుతాః।
మాతుర్మాతులతత్పుత్రాః విజ్ఞేయా మాతృబాంధవాః॥

తల్లికి మేనత్తలు, వారిసంతానము, తల్లికి, పినతల్లి పెదతల్లులు, వారిసంతానము, తల్లికి మేనమామలు వారిసంతానము మాతృబంధువులు.

శ్లో॥ పితృష్వసా చ తత్పుత్రాః తథా మాతృష్వసాసుతాః।
మాతులశ్చాపి తత్పుత్రాః విజ్ఞేయా ఆత్మబాంధవాః॥

తనయొక్క మేనత్తలు, వారిసంతతి, పినతల్లి పెదతల్లులు, వారి సంతతి, మేనమామలు, వారిసంతతి ఆత్మబంధువులు.

## దుష్టగ్రహస్థితినివారకరత్నములు

శ్లో॥ మాణిక్యముక్తాఫలవిద్రుమాణి
గారుత్మకం పుష్యకవజ్రనీలం।
గోమేధవైడూర్యక మంగుళీయే
నిక్షిప్య ధార్యం గ్రహదోషశాంత్యై॥

రవికి మాణిక్యము, చంద్రునికి ముత్యము,

కుజునికి పగడము, బుధునికి గారుత్మతము (పచ్చ), బృహస్పతికి పుష్యరాగము, శుక్రునకు వజ్రము, శనికి ఇంద్రనీలము, రాహువునకు గోమేధికము, కేతువునకు వైడూర్యము– ఈప్రకారము రవ్యాది గ్రహములలో ఏగ్రహబలము చాలదో ఆ గ్రహమునకు చెప్పబడిన రత్నమును ఉంగరమం దమర్చి ఆగ్రహబలము చక్కపడువరకు ధరింప వలయును.

## సువాసినీభోజనవిధి

శ్లో॥ సువాసిన్యాం మృతాయాం తు బ్రాహ్మణై స్సహభోజనే
సువాసినీం తతః పశ్చా దమంత్రిక మథార్చయేత్ ॥
యావజ్జీవతి తద్భర్తా భోజయేచ్చ సువాసినీం ।
తదూర్ధ్వం బ్రాహ్మణానేవ భోజయేన్న సువాసినీమ్ ॥

సువాసినీమరణ విషయమై బ్రాహ్మణులతో పాటు మంత్రములేకుండా సువాసినిని కూడ అర్చించి బ్రాహ్మణులతోపాటు భుజింపచేయవల యును. మృతస్త్రీయొక్క భర్త గతించిన పిమ్మట బ్రాహ్మణభోజనమేగాని సువాసినీభోజనము అవ సరములేదు.

## దానకాలగ్రాహ్యాంగములు

శ్లో॥ అశ్వం కర్ణే గజం దంతే దాసీం కేశే హ్యజాం గళే
గృహంస్తంభే వృషంస్కంధేగాంపుచ్ఛేకన్యకాంకరే ॥
శయ్యాం దారుణి సన్నద్ధదారుం చ శకటే హలే ।
స్పృష్ట్వైతాని దానాని తిష్ఠన్కుర్యాద్విచక్షణః ॥

గుఱ్ఱమునకు చెవి, ఏనుగునకు దంతము, దాసీకి జుట్టు, మేకకు మెడక్రిందనున్న చన్ను, గృహమునకు స్తంభము, వృషభమునకు మూపురము, గోవునకు తోక, కన్యకకు హస్తము, మంచమునకు పట్టె, బండికి, నాగలికి కాడి- వీటిని స్పృశించుచు నిలువబడి దానమును చేయువలెను.

## ఋతుస్నానదినమునకన్యాదానవిషయము

శ్లో॥ కన్యాదాత్రీ స్నానవారే తు రాత్రౌ
నక్షత్రాణాం దర్శనాదేవ సద్యః ।
కుంచత్రీణి వ్రీహిఘాతం చరిత్వా
కన్యాదానం కారయిష్యంతి సంతః ॥

ఋతుస్నానదినమున సాయంకాలమువరకు ఉపవాసముచేసి నక్షత్రదర్శనముకాగానే మూడు సోలల ధాన్యమును దంపిన పిమ్మట అభ్యంగనము చేసుకొన్నతరువాత ఆమెచే చాలమంది

పండితులు కన్యాప్రదానమును చేయించు చున్నారు. భార్యయొక్క రవికను దగ్గరనుంచుకొని ఋతుస్నాత యగు భార్య సమక్షమందు కన్యా దాత ఒకడే కన్యాదానమును చేయుటకూడ చాలచోట్ల కలదు. ఈపద్ధతిలో కన్యాప్రదాత భర్తతో పీటమీద కూర్చుండకున్నను వైభవ మును చూచి ఆనందించు అవకాశమున్నందున ఈ పద్ధతినామోదించిరని ఊహింపతగియున్నది.

## దీపప్రాధాన్యత

శ్లో॥ దీపస్యారాధనం కృత్వా శుభకర్మ సమారభేత్ ।
గృహీత్వా ఫలతాంబూలం ప్రయోగం విధివచ్చరేత్॥

దీపారాధన చేసి ఫలసహితతాంబూలమును చేబట్టి శుభకర్మ నారంభింపవలయును.

## గేహళీస్పర్శఫలము

శ్లో॥ గేహళీం న స్పృశే త్పద్భ్యాం తస్యాం నోపవిశేత్ స్త్రియః ।
అనివార్యస్తు దోషోయం ఇతి ప్రాహు ర్మనీషిణః ॥

స్త్రీలు పాదములతో గడపను తాకరాదు. గడపపైన కూర్చుండరాదు. ఈదోషము నివారింప శక్యముకానిదని పండితులు చెప్పుచున్నారు.

## మాసఫలము.

శ్లో॥ పంథాను భోజ్యం తనుతాపశౌర్యే
విద్యా చ వస్త్రం విపులం చ శోకం ।
అనంతపుణ్యం చ మహాఫలం చ
నవేతి మాసస్య ఫలాని చాహుః ॥

జన్మనక్షత్రము (నామనక్షత్రము) మొదలు మాస ప్రారంభదిననక్షత్రమువరకు లెక్కించి ఆసంఖ్యను 9చే భాగించి, శేషించిన సంఖ్యలవలన ఫలమును తెలియవలయును- (1) ప్రయాణము (2) మంచిభోజనము (3) జ్వరము (4) శౌర్యము (5) విద్య (6) వస్త్రలాభము (7) శోకము (8) అనంతపుణ్యము (9) గొప్పఫలము తటస్థపడును.

## సుస్వప్నములు

(గ్రంథవిస్తరభీతిచే శ్లోకములను విడిచిపెట్టడమైనది. నదులను సముద్రములను దాటుట, ఆకాశమున ఎగురుట, సూర్యుడు చంద్రుడు నక్షత్రములు కనబడుట, మేడలు రాజభవనములు దేవాలయములు వీటిపైన ఎక్కుట, వీటివలన కార్యసిద్ధిని పొందును. మద్యపానము, మాంసభక్షణ, రక్తమును మలమును పూసుకొనుట, పెరుగు తెల్ల

బట్టలు మంచిగంధము రత్నములు ఆభరణములు దేవతలు బ్రాహ్మణులు గొడుగు పద్మములు రాజులు ఆభరణములను ధరించినస్త్రీ వృషభము పర్వతము పాలు అద్దము మాంసము పుష్ప మాలికలు ఆవాలు తమలపాకులు కర్పూరము కనిపించుట, ఫలవృక్షములనెక్కుట, గుఱ్ఱము ఏనుగు గోవు సువర్ణము కనపడుట, ఏడ్చుట, తెల్లని సర్ప ముచే కరువబడుట. తామరాకుయందు భుజించుట, కొంగ కోడి గొలుసుతో కట్టబడుట, తాను కూర్చుండు ఆసనము మంచము వాహనము గుఱ్ఱము సైకిలు కారు శరీరము గృహము కాలి పోవుట, పాముకోళ్లు చెప్పులు గొడుగు ఆయు ధము రథముకనిపించుట- ఇట్టిస్వప్నములు మంచివి.

## దుస్స్వప్నములు

ప్రత్తి, మజ్జిగ, బూడిది, ఇనుముకనిపించుట; గంగరావి, పారిజాతము, మోదుగు పీటిపైన ఎక్కుట; రక్తవస్త్ర ధారణ, సూర్యచంద్రులు కాంతివిహీనులై కనిపించుట; నక్షత్రములు ఆకా శమునుండి భూమిపై బడుట; తలవెంట్రుకలు రాలి పోవుట; దంతములు ఊడిపోవుట; గాడిదలు, దున్న

పోతులు వీటిని కట్టిన రథము నెక్కుట; శరీరావయవ ములు భేదింపబడుట; బురదలో దిగుట - ఇట్టిస్వప్నము మంచిదికాదు. వ్యాధియందు, పగటిభాగమందు కలిగిన స్వప్నములు మంచివైనను, చెడ్డవైనను వాటికెంతమాత్రమును ఫలములేదు. మంచిస్వప్న మైనచో తిరిగి నిద్రింపరాదు. ప్రాతఃకాలము నందు బ్రాహ్మణునితో చెప్పి వాని ఆశీర్వాద మును పొందవలెను. దుస్స్వప్నమైనచో ఎవరి తోను చెప్పకుండ మరల నిద్రింపవలయును.

## అంగస్ఫురణ

శ్లో॥ భ్రూమధ్యాక్షిశిరశ్శ్రుతౌ పదగళాంగాంసాస్యజం ఘ్రాస్త్రిక
దృక్ప్రాంతోదరహస్తనాశికభుజాపాంగాధరోరస్థలే।
అంగస్పందనమర్థదం భయకరం నాభౌ కటౌ జానని
స్త్రీణాం వామతనౌ తదన్యకరణే పుంసాం సదా దృశ్యతే॥

కనుబొమ్మలమధ్య ప్రదేశము, కన్ను, శిరస్సు చెవి, పాదము, కంఠము, శిశ్నము, భుజశిరస్సు, పిక్క-ఎముక, కంటిపార్శ్వము, ఉదరము, చెయ్యి, ముక్కు, భుజము, కంటికొన, అధరోష్ఠము, వక్షః

స్థానములు, బొడ్డు, తుంట్లు, పిక్క — పురుషులకు కుడి భాగమందును, స్త్రీకి ఎడమభాగమందును అదరినచో లాభము. ఈచెప్పబడిన స్థానములకు వ్యతిరేకస్థానములయందు అదరినయెడల మంచిదికాదు.

## గ్రహములకు మూర్తి నిర్ణయము

శ్లో॥ జన్మారిరుద్రేషు సువర్ణమూర్తిః
ద్విపంచనందా రజతం శుభం స్యాత్ ।
త్రిసప్తదిక్తామ్ర ముశంతి కష్టం
వేదార్కరంధ్రేషు చ లోహమూర్తిమ్ ॥

గోచారఫలము నాలోచించినప్పుడు గ్రహములయొక్క మూర్తిభేదము ననుసరించి ఫలితము నూహింపవలయును. జన్మరాశిమొదలు 1-6-11 రాసులలోనున్న గ్రహము సువర్ణమూర్తి అనియు, 2-5-9 రాసులయందున్న గ్రహము రజితమూర్తి అనియు చెప్పబడును. సువర్ణ, రజతమూర్తులు శుభప్రదములు. 3-7-10 రాసులలోనున్న గ్రహము తామ్రమూర్తి అనియు, 4-12-8 రాసులలోనున్న గ్రహము లోహమూర్తి అనియు చెప్పబడును. తామ్రలోహ మూర్తులు కష్టప్రదములు.

## ప్రతిగ్రహదోషములేనివి

శ్లో॥ కన్యాంబరస్వర్ణసరస్వతీనాం
అన్నోపవీతాజినభూగృహాణాం ।
ప్రతిగ్రహస్యోభయతారకత్వాత్
న దోషశంకా గ్రహణే నవానామ్ ॥

కన్యక, వస్త్రము, సువర్ణము, విద్య, అన్నము, యజ్ఞోపవీతము, కృష్ణాజినము, పంట భూమి, గృహము- ఈ తొమ్మిదింటియొక్కయు ప్రతిగ్రహము దాతను, ప్రతిగ్రహీతనుకూడ తరింపజేయునదగుటవలన ప్రతిగ్రహదూష్యమెంత మాత్రమును లేదు.

## రజకానీతవస్త్రశుద్ధి

శ్లో॥ సాయంకాలసమానీతం శుచిప్రక్షాళితాంబరం ।
రజకేన చ తద్ధార్యం వినాంబుప్రోక్షణం నను ॥

చాకలి ఉతికి సాయంకాలము తెచ్చిన బట్టలు పవిత్రములుగాన నీళ్ళుచల్లకుండా ధరింపవచ్చును.

శ్లో॥ రజక ధృతవస్త్రాణి క్రావేన శపదాయుణా ।
శుద్ధిం కరోతి తద్ధర్మః పారంపర్యం విధీయతే ॥

చాకలి మధుపర్కములు మున్నగు శుభ వస్త్రములను గంజితోను, శవదహనము గావించిన కట్టెలతోను శుభ్రపఱచుచున్నాడు. ఈధర్మము దేశపరంపరగా వచ్చుచున్నది. ఇక్కడ అమంగళ సందేహములేదు.

## ఆశౌచవిషయము

శ్లో॥ పక్షిణీయోనిబంధూనాం త్రిపూరుషం పరస్పరం।
జ్ఞాతీన్వినా విమాతౄణాం నైవ స్యాత్పక్షిణీ మిథః॥

జ్ఞాతులుకాని యోనిబంధువులు మూడు పురుషములవరకు పక్షిణీదార్లు. తండ్రిగాని, పితామహుడుగాని, మాతామహుడుగాని మరల వివాహము చేసుకొన్నయెడల ఆ భార్యలయందు జనించినవారు పక్షిణీదార్లుకారు. ఆ జ్యేష్ఠవేరు; వారికి వీరును పక్షిణీదార్లు కారు.

తల్లిననుసరించి మాతామహుడు, మాతామహి, పినతల్లి పెదతల్లులు, మేనమామలు, వారి సంతతియు పక్షిణీదార్లు. తండ్రిననుసరించి పితామహుడు, పితామహి, పినతండ్రి పెదతండ్రులు, మేనత్తలు, తనయొక్క సోదరసోదరీలు, వారిసంతతియు పక్షిణీదార్లు.

భార్యననుసరించి అత్తమామలు, స్యాలకులు వక్షి నేదాస్లు.

1. తల్లిదండ్రులకు, కుమార్తెకు శిరో
2. అక్కలకు, చెల్లెళ్లకు శిరో
3. సోదరులకు, సోదరీలకు శిరో
4. మేనత్తకు, మేనల్లుళ్లు, మేనకోడళ్లకు శిరో
5. మేనమామకు, మేనల్లుళ్లు, మేనకోడళ్లకు శిరో
6. మేనమామభార్యకు, భర్తయొక్క మేనల్లుళ్లు, మేనకోడళ్లకు శిరో
7. మాతామహమాతామహీలకు, దౌహిత్రి దౌహిత్రీలకు శిరో
8. పితామహ పితామహీలకు, పౌత్రికకు శిరో
9. మేనత్త సంతతికి మేనమామసంతతికి శిరో
10. పినతల్లి సంతతికి, పెదతల్లిసంతతికి శిరో
11. సోదరీల సంతతిపోతే పినతల్లి పెదతల్లులకు శిరో
12. పినతండ్రి పెదతండ్రులు పోతే స్త్రీకి శిరో
13. పినతండ్రి సంతతిపోతే పెదతండ్రి కూతురికి శిరో
14. పెదతండ్రి సంతతిపోతే పినతండ్రికూతురికి శిరో
15. సోదరపుత్రికపోతే పినతండ్రి పెత్తండ్రులకు శిరో

16. పినతల్లి పెదతల్లులుపోతే "స్త్రీపురుషులకు" 3రో॥
17. అత్తమామలకు అల్లునికి 1రో॥
18. స్యాలకభావుకులకు 1రో॥ (స్యాలకుడనగా భార్య సోదరుడు, భావుకుడనగా సోదరీభర్త) జ్ఞాతుల ఆశౌచమధ్య భార్య ప్రసవించినచో తల్లిదండ్రులు జాతాశౌచమును పూర్తిగా పట్టవలెను.

## ఆశౌచసంబంధములేనివారు

మేనత్తభర్తలకు, సవతిసోదరికి, సవతిమేనమామకు, స్త్రీపురుషులకాశౌచములేదు. స్త్రీలుపినతండ్రిపెదతండ్రిభార్యలు, సోదరభార్యలు, సోదరీభర్తలు, భర్తసోదరీలు, భర్తలయొక్క సోదరపుత్రికలు వీరికాశౌచము పట్టనవసరములేదు. పురుషులు భార్యసోదరీలకాశౌచము పట్టనవసరంలేదు. మేనత్తమగనికివలెనే మేనమామ భార్యకు పక్షిణీ అవసరంలేదని కొందరి పొరపాటు అభిప్రాయము. మేనత్తకు ప్రతియోగిని పినతల్లిగాని పినతల్లిభర్త కాదుకాన పక్షిణీ అవసరంలేదు.

మేనత్త మగనికివలనే మేనమామ భార్యకును పక్షిణీలేదని కొందరి అభిప్రాయము. ఇది శాస్త్రదూష్యము. మేనత్తకు ప్రతియోగిని

పినతల్లి యేగాని ఆమెభర్త పితియోగిని కానం దున పక్షిణిలేదు. మేనమామభార్య మాతృ పితామహ మాతామహీలవలెనే యోని బంధువు రాలై నందున పక్షిణి పట్టవలయునని తెలియ వలయును. ఉపనయనము కాని పురుషునకు, వివాహముకాని స్త్రీకిని పక్షిణి పట్ట నగత్యములేదు; స్నానముతో సరి.

## దత్తునివిషయము

శ్లో॥ నిజపిత్రో స్త్రిరాత్రం చ భ్రాతౄణాం పక్షిణీ తథా ।
దత్తస్య ప్రోచ్యతే సద్భిః తదన్యేషాం తు నేతి చ ॥

దత్తునికి జనకతల్లిదండ్రుల మరణమందు త్రిరాత్రాశౌచమని, జనకసోదరీసోదరులయొక్క మరణమందు పక్షిణి అని, తదితరులకు ఆశౌచములేదని చాలమంది పండితులచే చెప్పబడు చున్నది.

## అస్థినిక్షేపము (ధర్మప్రవృత్తి)

శ్లో॥ యావ దస్థి మనుష్యాణాం గంగాతోయేనుతిష్ఠతి ।
తావద్వర్షసహస్రాణి స్వర్గే లోకే మహీయతే ॥
వత్సరా త్ప్రథమా దర్వా కీర్త్యే చాస్థీని నిక్షిపేత్ ।
వినా గంగా మథాస్థీని ద్వితీయాద్దే న నిక్షిపేత్ ॥

ఎముకలు గంగానదీజలములో ఎన్ని సంవత్సరము లుండునో అన్ని వేలసంవత్సరములు ఆదేహధారి యగు వ్యక్తి స్వర్గమందుండును. మరణము మొదలు సంవత్సరముదాటకుండ అస్థులను గంగయందుంచవలయును. గంగానదియందుగాక ఇతరనదులయందు మొదటి సంవత్సరము దాటిన పిమ్మట అస్థుల నుంచకూడదు. గంగానదియందుంచుటకు సంవత్సరనియమములేదు.

శ్లో॥ జన్మర్క్షే జన్మనో మాసే మాఢ్యే శూన్యేధికే క్షయే ।
తీర్థయాత్రా న కర్తవ్యా గయాం గోదావరీం వినా ॥

గయ, గోదావరిగాక మిగిలిన తీర్థయాత్రల విషయమై జన్మనక్షత్రము, జన్మమాసము, మాఢ్యము, శూన్యమాసము, అధికమాసము, క్షయమాసము పనికిరావు.

శ్లో॥ గురుశుక్రాస్తాదిదోషః ప్రోక్తో యస్తీర్థగామినాం ।
అపూర్వయాయినా మేవ నత్వసౌ పూర్వయాయినామ్ ॥

పైన వివరింపబడిన మాఢ్య జన్మనక్షత్రాది దోషము క్రొత్తగా యాత్రకు బయలుదేరువారికే గాని అంతకు పూర్వం వెళ్లివచ్చినవారికి కాదు.

శ్లో॥ ఋతుద్వయే వ్యతీతే తు న కుర్యాత్స్త్రీకబంధనం ।
అగ్న్యాధానం గయాశ్రాద్ధం వపనం చ వివర్జయేత్ ॥

భార్య గర్భమును ధరించిన నాలుగుమాసములకు పిమ్మట ఉపనయనము, అగ్న్యాధానము, గయాశ్రాద్ధము, క్షౌరము వీటిని విడిచిపెట్టవలెను.

శ్లో॥ పంచమే మాసి చైతన్యం జీవః ప్రాప్నోతి సర్వశః ।
మాతృభుక్తాన్నసారేణ గర్భే పిండః ప్రవర్ధతే ॥

తల్లి భుజించిన ఆహారమును (నాభిసూత్రాల్పరంధ్రముద్వారా) గ్రహించి గర్భస్థపిండము పెంపొందుచున్నది. అయిదవ మాసమున జ్ఞానముత్పన్నమగుచున్నది. పిండచలన మీమాసము నుండియే ప్రారంభమగుచున్నందున జీవప్రవేశము లేని 4 మాసములుమాత్రమే శుభకార్యార్హము లని వైద్యశాస్త్రరీత్యా ఇచ్చట చెప్పబడినదని తోచుచున్నది.

## ఆశౌచకాలనిర్ణయము

శ్లో॥ పితురాశౌచమబ్దం స్యాత్ మాతుష్షాణ్మాసమేవ చ ।
మాసత్రయం తు భార్యాయాః తదర్ధం భ్రాతృపుత్రయోః ॥

తండ్రి గతించినది మొదలు 12 మాసములు తల్లికి, 6 మాసములు భార్యకు, 3 మాసములు

సోదరులకు, పుత్రులకు 45 రోజులు సూతకము ఉండును. ఇది శుభకార్యముల విషయమై నిర్ణయింపబడినది.

## సూతకాంతరితశ్రాద్ధము

శ్లో॥ యది స్యా దాబ్దికప్రాప్తిః సూతకే మృతకేపి వా ।
సూతకానంతరం కుర్యాత్ శ్రాద్ధ మేకాదశేహని ॥

ప్రత్యాబ్దికము పురిటియందుగాని, మైల యందుగాని తటస్థపడినచో శుద్ధిదివసమైన 11వ రోజున జరిగింపవలయును. ఇందొకవిశేషముకలదు. పక్షిణీశుద్ధిరోజున ప్రాత స్సంగవ మధ్యాహ్న అప రాహ్న సాయంకాలములలో 5వదియగుసాయాహ్న ప్రారంభమున శుద్ధిచేసుకొని యజ్ఞోపవీతధారణ చేసి ఆబ్దికమును జరిగింపవచ్చును. వంట ఆకాలము నకు సిద్ధమై ఉండవలెను.

## ఏకదినశ్రాద్ధబాహుళ్యవిషయము

శ్లో॥ పితో ర్శ్రాద్ధే పరిప్రాప్తే నచే త్ప్రప్యుషితేపి వా ।
పితృపూర్వం సుతః కుర్యాత్ అన్యత్రాసతి యోగతః ॥

తల్లిదండ్రుల ఆబ్దికములు ఒకసారి తటస్థ పడెనేని తిథులు ముందు వెనుక అయినను ఏక

కాలమునందు జరిగించవలసివచ్చినప్పుడు మొదట తండ్రి ఆబ్దికమును జరిగించి, పిమ్మట తల్లి ఆబ్దికమునుజరిగించి, తదితరములైన శ్రాద్ధములుంచవలసి వచ్చినచో వారివారి మరణముల వరుస ననుసరించి జరుపవలెను. వంటలు వేరువేరుగా ఉండవలెను.

## శుభానంతరపైతృకవిషయము

శ్లో॥ పుత్రీపుత్రవివాహయోశ్చ పరత షణ్మాసతః పూర్వతః
పిత్రోరాబ్దికసంభవే తు విధివద్దూర్వాక్షతైరర్చయేత్,
సంత్యాజ్యాదపసవ్యతర్పణవిధి ర్దర్భాన్తిలా న్ముండనం
దధ్యన్నేన విధాయ పిండమితరస్థానే చరేత్పైతృకమ్॥

పుత్రునియొక్కగాని, పుత్రికయొక్కగాని వివాహమైన పిమ్మట ఆరు మాసములకులోగా తల్లిదండ్రుల ఆబ్దికము తటస్థపడినచో అపసవ్యము, తర్పణము, దర్భలు, తిలలు, వపనము వీటిని విడిచి పెట్టవలయును. దర్భలకు బదులు దూర్వాలు, తిలలకు బదులు పసుపుతో కలిపిన అక్షతలు, పెరుగుతో కలిపిన పిండములు వీటితో యథావిధిగా ఇతర స్థలమందు జరుపవలెను.

## స్వస్తి

శ్లో॥ ఆపదా మపహర్తారం దాతారం సర్వసంపదాం।
లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహమ్॥

శ్లో॥ మంగళం కోసలేంద్రాయ మహనీయగుణాత్మనే ।
చక్రవర్తితనూజాయ సార్వభౌమాయ మంగళమ్ ॥

శ్లో॥ అపూర్వవిషయా న్దాతా గ్రంథేభ్య స్సద్భ్య ఆత్మధీః ।
ముహూర్తసాధనో వాస్తువిజ్ఞాన ఇత్యభూ ద్ద్విధా ॥

గ్రంథములవల్లను, విద్వాంసులవల్లను అపూర్వములైన విషయములను తెలుసుకొన్న నాబుద్ధి (భ్రమరకీటకన్యాయముగా) సుముహూర్తసాధనము, వాస్తువిజ్ఞానము అను రెండు గ్రంథములుగా రూపొందనది.

శ్లో॥ ఆస్తికానాం కృతే యత్నాత్ అపూర్వవిషయాన్వితే ।
ఇమౌ హూణశకే సృష్టౌ సప్తాద్ర్యంకైకవత్సరే ॥

ఆస్తికులయొక్క ఉపయోగమునిమిత్తమై మిక్కిలి ప్రయత్నముతో, అతి ముఖ్యవిషయములతో కూడిన 'సుముహూర్త సాధనము, వాస్తువిజ్ఞానము' అను ఈ రెండు గ్రంథములును హూణశకమున 1977వ సంవత్సరములో నిర్మింపబడినవి.

## పురోహితులకు ఉపయోగించు శ్లోకములు

### ఉపనయనావశ్యకపరికరములు

శ్లో॥ తాంబూలంగుడతండులోగకలశాదర్పాస్సమిత్తండులాః
చూర్ణం పాత్రఘృతం మధుర్దధిఫలీకర్ణం కుదస్నేహపాః

దండాద్యజినమేఖలాంబరగుడా రక్షాశరావాః పయః
మృద్బీజాన్యుపవీతజీరకశకృచ్చూర్ణేధ్మచూతా స్తుషః ॥

తమలపాకులు, పోకచెక్కలు, అరటిపళ్లు, బెల్లం, బియ్యం, పుణ్యాహవాచనాచమనకలశలు, బర్హిస్సు, సమిధి, బియ్యం, వరిపిండి, ప్రమిదలు, నేతిగిన్నె, తేనె, పెరుగు, తౌడు, ఆవాలు, దండము, రాయి, అజినము, మేఖల, వటువు ధరించు వస్త్రములు, నూలుకండె, రక్షాబంధనము, పాలికలు, పాలు, పుట్టమట్టి, నవధాన్యములు, యజ్ఞోపవీతము, జీలకర్ర, పేడగుడుగులు, ఇధ్మము, ఊక, పిడకలు, మామిడిరొట్ట, పసుపు, కుంకుమ, చెక్కనలి, పెళ్ళిపీట.

## స్నాతకావశ్యకపరికరములు

శ్లో॥ తాంబూలతండులగుడాని ఫలాని మాలా
వస్త్రాణి గంధకలశాంజనదర్పణాని ।
ఉపానహౌ చ ఘృతదండమసూరచూర్ణం
ఛత్రాపి చూర్ణలఘుపాత్రచతుష్టయం చ ॥

తమలపాకులు, పోకచెక్కలు, అరటిపళ్ళు, బెల్లం, పువ్వులదండ, వస్త్రములు, గంధం పుణ్యాహవాచనాచమనకలశలు, కాటుక, అద్దము,

పరిషత్తు, బియ్యము, చెప్పులజోడు, నెయ్యి, చేతి కఱ్ఱ, నలుగుపిండి, గొడుగు, మంగలికత్తి, వరి పిండి, పరిమిదలు, బర్నిస్సు, చెక్కనలి, మామిడి రొట్టలు, దారపుకండె.

**వివాహసమయమున పెట్టెలో నుండవలసినవి**

ఇచ్చు ఉద్దేశ్యమున్న వధువు తాలూకు వృద్ధులకు బహుమతులు, గురుసత్కారబహుమతి వస్త్రములు, కర్పూర దండలు, అగరువత్తులు, సెంటు,గంధపుగిన్నె,పౌడరు,పన్నీరుబుడ్డి, తెలసెల్లా, పీటలమీదకుఅంగావస్త్రం, దారపుబండి, యజ్ఞోప వీతం, మట్టెలు, మంగళసూత్రం, కుత్తికంటు, పట్టు పంచి, చిల్లరి (సంభావనలకు) విడిరూపాయలు, సభా కట్నం రూపాయలు, హారతికర్పూరంపొట్లములు, వధువునకు అలంకారములు, సదస్యం, పోగులు చీరలు.

బుట్టలో నుండవలసినవి :- తమలపాకులు, పోకచెక్కలు, లవంగచూడు, అరటిపళ్లు, మంగళ స్నానమునకు పాతపంచి, తుడుపుకండువా, చెయ్యి తుడుపు గుడ్డ.

## వివాహోపయుక్తార్థములు.

శ్లో॥ తాంబూలం గుడతండులోదకలశా యజ్ఞోపవీతం కుశా,
పాద్యం చందనపాత్రి చూర్ణదధి మధ్వాన్నాని వాసోంతరం।
జీరేణ్వాయుగవాసదీపశివసూత్రాణి ప్రౌఢాక్షతక్షీరకం
యోక్త్రిం రక్షణతండులాంగులిఘృతం లాజాః ఫలం స్థాలికమ్ ॥

తమలపాకులు, పోకచెక్కలు, అరటిపళ్ళు, బెల్లం, బియ్యం, పుణ్యాహవాచనాచమనకలశలు, యజ్ఞోపవీతం, ఉత్తరదంధ్యాలు, ఉంగరం, బ్రహ్మాసన ఇధ్మం, కాళ్లుకడుగు పళ్లెం, చెంబు, గంధం, ప్రమిదలు, వరపిండి, నెయ్యి, తేనె, పాలు, అన్నం, తెరశెల్లా, మధుపర్కములు, జీలకర్ర, బెల్లం, ఇణ్యాం, నాగలికాడి, మంగళసూత్రిం, జ్యోతులు, తలంబ్రాలబియ్యం, పాలు, యోక్త్రిం, రక్షాబంధనం, లాజలు(పేలాలు), ఊక, పిడకలు, చెక్కనలి, మామిడిరొట్టలు, మట్టులు, నల్లపూసలు, పెళ్లిపీట.

## అష్టావధానములు

శ్లో॥ యుక్తిర్వ్యస్తాక్షరీపాఠకవితాగీతలేఖనం।
గణితం చతురంగం చాప్యవధానాన్యమూని హి॥

## స భా ల క్ష ణ ం

శ్లో॥ గాయకః ప్రాక్కథావక్తా విద్వాన్వందీ విదూషకః
పౌరాణికః కవిశ్చేతి సభా సప్తాంగలక్షణా ॥

## ష ణ్మ త ము లు

శ్లో॥ శైవం చ వైష్ణవం శాక్తం గాణాపత్యం చ సౌరకం
కాపాలం షణ్మతానీతి నిర్ణీతా న్యాదిశంకరాత్ ॥

## చక్రములేకుండ వేధను తెలుపు శ్లోకములు

## పంచశలాకచక్రము

శ్లో॥ కృశానుశూర్పే స్వభవాభిజిద్భే హిమాంశువిశ్వే పుర జిజ్జవే చ ।
ఆదిత్యమూలే గురుశుక్రవారే వ్యాళశ్రవిషే పితృ పైష్ణవే చ ॥

శ్లో॥ పుష్యాశ్వినీ చోత్తరరేవతీచ హస్తానిశాస్యే చిఘపూర్వ భాద్రే
సమీరసైద్యోసుహృదంతకాచవేధాన్వితౌ పంచశలాకచక్రే॥

కృత్తిక విశాఖలు, రోహిణి అభిజిత్తులు, మృగశిర ఉత్తరాషాఢలు, ఆర్ద్ర పూర్వాషాఢలు, పునర్వసు మూలలు, పుష్యమి జ్యేష్ఠలు, ఆశ్లేష ధనిష్ఠలు, మఘ శ్రవణములు, పుబ్బ అశ్వినులు,

ఉత్తర రేవతులు, హస్త ఉత్తరాభాద్రలు, చిత్త పూర్వాభాద్రలు, స్వాతి శతభిషములు, అనూరాధభరణులు, పంచశలాకచక్రమున పరస్పరవేధితములు– అనగా కృత్తికయందున్న గ్రహము విశాఖను వేధించును. ఇట్లే తెలియవలెను.

## సప్తశలాకచక్రము

శ్లో॥ కృశానువిష్ణూస్వభవాభిజిద్భ్యః తాంతువిశ్వేశ్వవశంబరేచ ।
అదిత్యమూలే గురుశుక్రభే చ సర్పానురాధా మఘ
యామ్యభే చ ॥

శ్లో॥ పుబ్బాశ్వినీ చోత్తరరేవతీ చ హస్తోత్తరా భాద్రపదా
తతస్తు ।
చిత్రాజపాదా పవనోఽప్యైద్వౌ శూర్పం వసు స్సప్త
శలాకచక్రే ॥

కృత్తికశ్రవణములు, రోహిణీఅభిజిత్తులు, మృగశిర ఉత్తరాషాఢలు, ఆర్ద్రపూర్వాషాఢలు, పునర్వసుమూలలు, పుష్యమిజ్యేష్ఠలు, ఆశ్రేష అనూరాధలు, మఘభరణులు, పుబ్బఅశ్వినులు, ఉత్తరరేవతులు, హస్తఉత్తరాభాద్రలు, చిత్త పూర్వాభాద్రలు, స్వాతీశతభిషములు, విశాఖధనిష్ఠలు సప్తశలాకచక్రమున పరస్పర వేధితములు.

## మృతిస్థలవిషయము

శ్లో॥ వితర్ద్యాం వాప్యళిందాంతే గర్భకుడ్యా ద్బహిర్మృతౌ ।
నాశౌచం తద్గృహస్యేతి వదంతి బహుకోవిదాః ॥

పట్టణములయందును, ఇరకటపు గ్రామము (తావు)లందునుపదబహిర్గతమైనఅరుగుయందుగాని, వసారాలయందుగాని మరణముజరిగెనేని మరణము జరిగినస్థలముననేగాని గర్భముననాశౌచసందేహము లేదని అనేకమంది పండితులు చెప్పుచున్నారు. ఈ ఆచారము పట్టణములయందు ప్రాయికము.

శ్లో॥ దుష్టర్క్షమృతిదోషఘ్నం వారిశాంతిం విధాయ చ ।
తద్గేహే నివసేత్ప్రీతి నాత్ర కార్యా విచారణా ॥

ఇంటిగర్భమందే దుష్టనక్షత్రమృతి జరిగినచో ఆశౌచానంతరము గ్రహమఖమును (నవగ్రహశాంతిని) చేసి ఆరోజునగాని, మరుచటిరోజునగాని దుష్టనక్షత్రమృతిదోషసంహారకమైన ఉదకశాంతి నాచరించి ఇంటిని విడిచిపోనక్కరలేకుండ యథాప్రకారము నివసింపవచ్చును. దీనివిషయమై ఆలోచించుటగాని, సందేహించుటగాని అవసరము లేదు. ఈ ఆచారము సమస్తపట్టణములయందును, పల్లెలయందును సుప్రసిద్ధమైయున్నది. శిలావాసస్సులు పరిహరింపబడువరకు (దశరాత్రములలోపల)

ముఖ్యకర్త ఇంటిగర్భములోనికి రాకూడదు. వసారాలు, అరుగు వీటిలో మసలవచ్చును.

## వస్త్రాదిశుద్ధివిషయము (ధర్మప్రవృత్తి)

శ్లో॥ తూలికా ముపధానం చ పుష్పరక్తాంబరం తథా ।
శోషయిత్వాతపే కించి త్కరై స్సమ్మార్జయేన్ముహుః ॥

శ్లో॥ వేలవచ్చర్మణాం శుద్ధి ర్వైదళానాం తథైవ చ ।
శాకమూలఫలానాం చ శుద్ధి స్స్యా జ్జలసేచనాత్ ॥

శ్లో॥ ఆవికం పట్టకూలం చ పవిత్రం సర్వదాపి చ ।
అమేధ్యలేపనం స్యాచ్చే త్తావత్ప్రక్షాళనం స్మృతమ్ ॥

ఆశౌచగృహమందలి పరుపులు, తలగడలు, (కాగితపు) పువ్వులు, ఫోటోలు, విలువగలవస్త్రములు వీటిని ఎండలోవేసి పలుమారు దులుపవలయును. తోలుసంచులు, దుప్పట్లు, బూర్నిసులు, రగ్గులు, కూరగాయలు, దుంపలు, ఫలములు వీటిని కడుగుట చేతను, జలమును చల్లుటచేతను శుద్ధియగును. ధావళీలు, పట్టుశాలువలు, సిల్కుబట్టలు ఇవి ఎల్లప్పుడును పవిత్రములైనవిగాన వీటికి ఆశౌచదోషము లేదు. ఎక్కడ మలినసంపర్కము కలిగినదో అక్కడ ప్రక్షాళనచేసిన చాలును. ఆశౌచగృహమున గల కుండలు, వాటియందలి పదార్థములు, (ఊరగాయలు) పనికిరావు.

## సుముహూర్తఫలవిషయము

శ్లో॥ నిర్విఘ్నశుభసాంగత్యం ఫలం లగ్నం బలస్య తు ।
న ప్రాక్కర్మవిపర్యాసశక్తిర్లగ్నేన విద్యతే ॥

తలపెట్టినకార్యము నిర్విఘ్నముగా నెరవేరుటయే నిర్ణీతలగ్నముయొక్క బలమునకు తార్కాణము. పూర్వాదృష్టమును మార్పుచేయగల శక్తి లగ్నమందు లేదు.

## దోషాదులకు అపవాదబలము

శ్లో॥ దోషా భవంతి కతిచి ద్దేశాచారేణ దుర్బలాః ।
దేశభేదేన కతిచి దపవాదబలాచ్ఛుభాః ॥
కతకా దంబుమృత్తైలా న్నిర్యాస శ్చౌషధా ద్గదః ।
నివర్తంతే తథాలగ్న దోషాశ్శాస్త్రశాసనాత్ ॥

లగ్నగతదోషములలో కొన్ని దేశాచారముచేత, మరికొన్ని దేశభేదములచేత, కొన్ని శాస్త్రాపవాదచేత బలశూన్యములై శుభార్హములగుచున్నవి. ఇండుగగంధముచే నీటియందలి బురదయు, నువ్వులనూనెచే పనసజిగురును, ఔషధముచే వ్యాధియు తొలగిపోవుచున్నట్లే శాస్త్రశాసనముచే లగ్నగతదోషములును పూర్తిగా తొలగిపోవుచున్నవి; ఎంతమాత్రము సందేహములేదు.

శ్లో॥ ఆచారదూరదోషాదీన్ అదేశ్యా న్దేశవర్జితాన్ ।
అధీత్య పండితంమన్యాః చక్రాంకుర్వంత్యసంగతాన్ ॥

ఆచారదుర్బలములు, దేశీయములు కానివి, దేశమునందు విడిచిపెట్టబడినవి ఏవియో కొన్ని దోషములను చక్రములను (వాటిపేర్లను) అభ్యసించి, పండితులమనుకొని అసంగతప్రసంగమును చేయువారు కొందరు.

## బజారుపండితులు

శ్లో॥ జఘన్యలోహపాత్రాణి నిజేభ్యశ్చ యథాధికం ।
అధునైవాఖిలత్రాపి దృశ్యంతే పణ్యపండితాః ॥

వర్తమానకాలమున నిజమైనలోహపాత్రలకంటె తక్కువలోహనిర్మితపాత్రలే ఎక్కువగా చూడబడుచున్నట్లే "నిజమైన పండితులకంటె" బజారుపండితులే ఎక్కువగా చూడబడుచున్నారు.

## సంగతవచనము

శ్లో॥ మానుష్యజన్మ పురుషత్వ ముత ద్విజత్వం,
సద్గ్రంథకల్పనవిధానపవిత్రజిహ్వ ।
సుక్షేత్రపుణ్యతటినీషు శరీరశుద్ధిః,
కిం కామ్య మస్తి మమ మానవజన్మనీతః ॥

మనుష్యజన్మ, పురుషత్వము, బ్రాహ్మణాంశము, శాస్త్రీయ(గ్రంథనిర్మాణము చేసవిత్రి)ముగా బడిన జిహ్వా, పుణ్యక్షేత్రగమనము, పుణ్యనదీతీర్థావగాహనచే పరిశుద్ధమైన పాంచభౌతికదేహము ఇన్ని లభించినపుడు ఇంతకంటె ఈమానవజన్మలో నాకు కావలయునని కోరుకొనవలసిన దింకొక్కటి ఏమి కలదు ?

శ్లో॥ న కశ్చిదపి మత్తోఽ ప్యన్యః నాన్యపోష్యస్థితి ర్మమ ।
తదవ్యాకులచిత్తేన జీవామి సతతం ముదా ॥

నా సంతతిలో "బ్రతుకుదెరువు లేక" నావలన పోషింపతగినవాడొక్కడును లేడు. నేనేస్వల్పమో ఒకనికి పెట్టుస్థితిలో నుంటినిగాని ఒకనిచే పోషింపబడవలసినస్థితిలో లేను. కాన ఏవిధమైన చింత లేని సంతోషముతో దేహయాత్రను గావించుచుంటిని. కోరుకొన్నను లభ్యములుకాని ఇన్నియోగములు సంప్రాప్తములగుట నాపురాకృతసుకృతఫలము.

శ్లో॥ రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే ।
రఘునాథాయ నాథాయ సీతాయాః పతయే నమః ॥

ప్రసంగవశముచే మనుష్యాదుల పరమాయువు

తెలియజేయబడుచున్నది.

శ్లో॥ సమాష్షష్టిర్ద్విఘ్నా మనుజకరిణాం పంచ చ నిశాః
హయానాం ద్వాత్రింశద్వృషమహిషయోః పంచకకృతిః।
విరూపాసాత్వాయుః ఖరకలభయో ర్ద్వాదశ శునాం
స్మృతం ఛాగాదీనాం దశకసహితా షట్చ పరమమ్॥

మనుష్యులకును, ఏనుగులకును 120 సం॥ 5రా; గుఱ్ఱములకు 32సం॥; గోవులకును, మహిషములకును 25 సం॥; గాడిదలకును, లొట్టిపిట్టలకును, 24సం॥; కుక్కలు మున్నగు గో[illegible] సంజ్ఞాలాదులకు 12సం॥; మేకలకు గొఱ్ఱెలకు 16సం.

శ్లో॥ చతుష్షష్టి ర్వ్యాఘ్రి స్తరుభుజగకాకా దశశతం
మృగా వింశత్త్వద్వ ద్దశ చ విహగా షోడశ శివాః।
భవే త్కూర్మ స్సార్థత్రిశత అయుతాయు ర్జలచరః
శశః పంచాబ్దాయు ర్నవమిత సమాః కుక్కుటముఖాః॥

పెద్దపులికి 64సం; వృక్షములు, పాములు, కాకులు వీటికి 1000 సం; లేళ్లకు20సం॥ పక్షులకు 10 సం; నక్కలకు 16 సం; తాబేళ్లకు 350 సం; మహాసముద్రస్థమత్స్యములకు 10,000 సంవత్సరములు; కుందేళ్లకు 5సం; కోళ్లు మొదలగువాటికి 9సం॥ పరమాయుర్దాయము.